శ్రీ రస్తు

# విజయగీత

(శ్రీమద్భగవద్గీతాప్రబోధము ననుసరించి
వ్రాయబడిన పౌరాణికనవల)




రచయిత :

మధురకవి, కవిశేఖర కొండేపూడి సుబ్బారావు

శ్రీ ప్రసన్నభారతీగ్రంథమాల

మొదటి ముద్రణ 1000 ప్రతులు
ఆంగీరస శ్రావణ బ. అష్టమి
శ్రీ కృష్ణాష్టమి.
21-8-1992.

వెల రు. *20-00* లు



ప్రాప్తిస్థానము.
శ్రీ కొండేపూడి సుబ్బారావు.
47-10-5 ద్వారకానగరు
విశాఖపట్టణము - 530 016

ముద్రణ :
శ్రీ పతి ప్రెస్, కాకినాడ.



# కృతజ్ఞత

This book is published with the
Financial Assistance of
Sri TIrumala - Tirupati Devasthaanams
under their scheme
Aid to publish Religious Books.

ఈ గ్రంథము

శ్రీ శ్రీ తిరుమల తిరుపతి దేవస్థానముల
ధార్మికగ్రంథముద్రణ సహాయ్య ప్రణాలిక
ద్రవ్యసహాయ్యమున ముద్రితము-
వారికి నాహృదయపూర్వక కృతజ్ఞతాభివందనములు,

గ్రంథకర్త

# విషయసూచిక

# విజయగీత

## ప్రస్తావన

శ్రీమద్భగవద్గీత యందలి విషయములను కధాత్మకముగ ఒక నవలరూపమున వ్రాసిన గ్రంథ మిది. అయినచో 'విజయగీత' అను పేరేల? అను సందియము రావచ్చును- ఈ నామ మిడుటకు నా కారణము లివి- యుద్ధవిముఖుడైన అర్జునుడు గీతోపదేశ ప్రభావమున ఇనుమడించిన సమరోత్సాహముతో తనకర్తవ్యమును నిర్వహించి విజయు డైనాడు. ఈవిజయము జీవనధర్మమునకు విజయము. అంతేకాదు, ఈ కలియుగమున అడుగడుగున జీవితాధ్వమున ఎదురగు ఇక్కట్టుల నెదుర్కొని మానవుడు తన జీవనపరమార్థములగు ఐహికాముష్మిక సాధనలలో విజయము గావించుటకు ఉత్తమమార్గము గీతాతత్త్వమే. ఇట్లన్నివిధముల విజయప్రధానమగు గీతాతత్త్వమునకు 'విజయగీత' అనుపేరు స్ఫురించినది- భగవద్గీత ప్రపంచసాహిత్యమునందు అత్యుత్తమ ధర్మగ్రంథము అనుట అతిశయోక్తి కాదు- ఈ గ్రంథమునకు బహుభాషలలో బహు నామములతో బహురూపములతో అనువాదములు, పద్య వచన గేయాదులు అసంఖ్యాకములుగ వచ్చినవి, వచ్చుచున్నవి- ఈ వరుసలో ఈ 'విజయగీత' మఱియొకటి.

భారతీయుల మతము వేదమతము- వేదములకు తుదను బ్రహ్మజ్ఞాన ప్రబోధకములగు ఉపనిషత్తు లున్నవి- వేదోపనిషత్తుల సారమే భగవద్గీత- ఈగీతావతరణ మెట్లు జరిగినది? అది ఒక అద్భుత సన్నివేశము- కురువంశీయులు, హస్తినాపురసామ్రా

జ్యాధిపతులునయిన సపత్నుల ఓడ్డుబ ధృతరాష్ట్ర పాండురాజులకు కౌరవులు పాండవులు పుత్రులు- దాయాదులగు పాండవులకు వారి రాజ్యభాగ మీయక దర్పోద్ధతులై కౌరవులు వారిని నానాహింసలు పెట్టిరి. ధర్మనిరతులగు పాండవులపై పునుండి వెడలిన శ్రీకృష్ణుని రాయబారమునైతము విఫలమై సమరము నిశ్చయమైనది- ఇరు వాగులవారును అన్యోన్య జిగీషతో అక్షౌహిణులకొలది బలముతో మహోగ్రమారణాయుధములు ధరించి కురుక్షేత్రమున మోహరించిరి- మరియొకక్షణములో యుద్ధమారంభము కానున్నది- పాండవ మధ్యముడును వీరాగ్రణి యయిన అర్జునుడు, తనరథమునకు శ్రీకృష్ణుడు సారథిగా, రణరంగ మధ్యమునకు వచ్చి ఒక్కసారి తనప్రత్యర్థులను తేరిపారజూచినాడు- కనులు తిరిగినవి, కాలుసేతులు వణకినవి "అయ్యో వారందరును నాగురువులు పెద్దలు బంధువులే వీరినిచంపి మారాజ్యభాగమును తీసుగొనుటా, ఈ నెత్తుటికూడు నేను తినజాలను, ఈయుద్ధమును నేను చేయను" అని విల్లమ్ములు వదలి నిర్విణ్ణుడైనాడు. అర్జునుని విభ్రాంతిని మనోవికలత్వమును శ్రీకృష్ణుడు గ్రహించి, మెల్లమెల్లగా తన ఉపదేశ మారంభించినాడు- సహజధర్మము, కర్తవ్యనిర్వహణము, ఆత్మజ్ఞానము గూర్చి ఎన్నియోవిషయములు నుడివినాడు. నీవు నిమిత్తమాత్రుడవు చంపువాడవు కాదు. అని అర్జునుని సందేహము లన్నియు తీర్చినాడు. ఇంకను అర్జునునకు నమ్మకముకల్గుటకై "అర్జునా, నేను సకలభూతమహేశ్వరుడను నన్ను నమ్మి నాశరణునంది నీధర్మము నిర్వర్తింపుము, నిన్నే పాపము అంటదు" అనిచెప్పి తన విశ్వవిభూతులను వర్ణించి తన విశ్వరూపదర్శనము చూపినాడు-

ఆహా, నిన్నటివరకు తన బావమఱది గొల్లవాఁడనుకొనిన కృష్ణుడు పరమేశ్వరుడా! తన విభ్రాంతి వదలినది. అర్జునుడు శ్రీకృష్ణుని కాళ్ళపైబడి లేచి మహోత్సాహముతో యుద్ధమొనర్చి దుష్టులగు కౌరవసైన్యమును పరిమార్చినాడు. ధర్మము జయించినది.

భగవానుడు శ్రీకృష్ణుడు అర్జునునకుచేసిన ధర్మోపదేశమే భగవద్గీత. అర్జునునిద్వారా మానవజాతికంతకునుచేసిన ధర్మోపదేశమది. ఈనాడు ఈగీతోపదేశ ప్రయోజనము ఒక్కనిముస మాలోచింపుడు. అర్జునునకువచ్చిన చిత్తసంక్షోభమువంటివే మనకును జీవితయాత్రలో ఎన్నోసమస్య లెదురగును వీనినన్నిటిని యెదుర్కొని చిత్తశాంతి ఆత్మవిశ్వాసము పొందుటకు భగవద్గీతాప్రబోధము ఎల్లరకును. మార్గదర్శకము. సులభము. ఆచరణీయము. వారు వీరను భేదము లేక అందరును అనుసరించి ధన్యులు కావచ్చును. ఇంతకన్న సమాజశ్రేయమునకు మఱేమి కావలయును.

ఈగ్రంథ రచనమునుగూర్చి మఱొక్కమాట. భగవద్గీత కది భావానువాదము. అనువాదము కష్టతరమైనపని. అందునను పారిభాషికపదములు, సాంకేతిక శాస్త్రీయవిషయములు ధర్మసూత్రములు గల గీతోపదేశమును కేవల శ్లోకతాత్పర్యములుగా గాక, కథాత్మకమగు నవలరూపమున వ్రాయుట ఒక నూతనప్రక్రియ. నవలారచనమున ఈ చిక్కుతోపాటు మూలవస్తువులకు విరుద్ధము కాకుండ పాత్రలమనోభావములను చిత్రించుటగూడ ఒక కష్టమైన

పని. భాషయందంతగా ప్రవేశములేని వారికిగూడ గీతాతత్త్వము సులభ గ్రాహ్యముగానుండునటుల ఈగ్రంథ మిట్లుసాగినది. చదువరులకు మఱికొంత ఆసక్తి ఆకర్షణ ఉండునట్లు గ్రంథాదిని, అంతమునను రాయబారము రణరంగము శంఖారావము మున్నగు విషయములు జేర్పబడినవి. అందందు ముఖ్యవిషయములకు సంబంధించిన శ్లోకములును ఈయబడినవి. ఆసక్తికలవారు వీనిని కంఠస్థము చేయవచ్చును. ఈగ్రంథము చదువరులకు గీతాతత్త్వమునం దేమాత్రము అభిరుచి కల్గించినను, నా యీనూతనయత్నము సఫలమని భావింతును.

ఈ గ్రంథముపై తమ అభిప్రాయములను వ్రాసిపంపిన మహనీయులు; మహాపండితుడు మహాపౌరాణికుడు మధురవచస్వి శ్రీమాన్ శ్రీభాష్యం అప్పలాచార్యస్వామివారికి, సుప్రసిద్ధకథా రచయిత నవలారచయిత శ్రీ ఘండికోట బ్రహ్మాజీరావుగారికిని నా హృదయపూర్వక కృతజ్ఞతలు. వారి ప్రశంసలు నా యీ రచనకు శుభాశీస్సులు.

భక్తిసాహిత్యప్రచురణలకు అవిచ్ఛిన్నముగ ద్రవ్యసహాయ్యమొనరించుచున్న శ్రీతిరుమల తిరుపతి దేవస్థానమువారికి మఱియొకసారి నాహృదయపూర్వక కృతజ్ఞతాభివందనములు.

నారచనలన్నియు ప్రసన్న భారతీగ్రంథమాలగా వచ్చుచున్నవి. యథాపూర్వము ఈ విజయగీతను కూడ ఆంధ్రప్రజానీకము ఆదరింపగలదని ఆశించుచున్నాను.

— గ్రంథకర్త

# అభినందనపత్రం

వ్యాకరణ విద్యాప్రవీణ, భాషాప్రవీణ
వేదాంతవిశారద, ప్రవచనశిరోమణి

## శ్రీమాన్ శ్రీభాష్యం అప్పలాచార్యులు M. A

భారతీయ సంస్కృతికి ఉపనిషత్తులు. బ్రహ్మసూత్రములు, భగవద్గీతా అనునవి మూడును జీవనాడులు. ఉపనిషత్తులు వేదములో ఉత్తరభాగముగా అపౌరుషేయములై పరమప్రామాణికములై అలరారుచున్నవి. జగత్కారమయిన తత్త్వము బ్రహ్మమన బడును. ఆ బ్రహ్మనుగూర్చిన విచారము ఉపనిషత్తులయందు కనపడును. ఉపనిషద్వాక్యములలో కల్గినసందేహములను తొలగించుచూ అన్ని ఉపనిషత్తులను సమనయమొనర్చుటకు శ్రీ వ్యాస మహర్షి బ్రహ్మసూత్రములను రచించెను. ఆఉపనిషత్తులసారమును ఎఱింగి ఎట్లు జీవించవలెనో ఎఱుంగచేయుటకు భగవానుడే స్వయముగా భగవద్గీతను అర్జునునకు ధర్మక్షేత్రమగు కురుక్షేత్రమందు గీతోపదేశమును ఒనర్చెను. ఈ మూడును మానవుని తనగమ్యమును చేర్చుటకు మార్గములు. కావున వీనికి ప్రస్థానత్రయము అని పేరు. చిట్టచివర శరీరమును వీడి భగవదభిముఖముగా ప్రసాగించు జీవునియాత్ర ప్రస్థానము. ఈమూడును ఆమార్గమును నిర్దేశించునవి. అందుచే ఇవి భారతీయులకు పరమసేవ్యములు, ఇందు ఉపనిషత్తులు, బ్రహ్మసూత్రములు కొంతజ్ఞానము కలవారికే ఎరుంగదగినవై ఉండును. సామాన్యునకు నిత్యజీవితమున ఎఱుగదగిన దానిని ఎఱిగిప్రవర్తింపవలసిన విధానమును ఎఱిగించుటకు విజయు

నకు పార్థసారధియై శ్రీకృష్ణభగవానుడు 'విజయగీత'ను ఉప దేశించెను.

ప్రతీమానవుడు తనజీవితమున విజయమును అందవలెను, లౌకికముగ, అధ్యాత్మికముగ సరియగుమార్గములో పయనించి గమ్యమును-చేరుట ఎట్లోఎరింగినవాడే విజయుడు. అట్టి విజయ మును ఆర్జించుటకు భగవానుడు తనసఖుడగు అర్జునుని వ్యాజముగా ఉంచుకొని మానవజాతికి అందించిన విజయపధయాత్రావివరణమే విజయగీత. సంస్కృతములోనున్న భగవద్గీతను ఎందరో తెనుగున పద్యములుగా, గేయములుగా, వచనముగా అనువదించిరి. కాని శ్రీమాన్ కొండేపూడి సుబ్బారావుగారు నూతనప్రక్రియను ఆశ యించి భగవద్గీతను 'విజయగీత' అనుపేర నవలగా రచించిరి. భగవానుడు స్వయముగా ఉపదేశించుటచే దీనిని భగవద్గీతయని వ్యవహరింతురు. కాని కొండేపూడివారు నరుని విజయునిగా మార్చిన గ్రంథమగుటచే దీనికి విజయగీతఅని పేరిడిరి.

ఇందు ఉపోద్ఘాతముగా గీతావతరణమునకు ముందు తెలిసి కొనదగిన కథాభాగమునంతను సరళము సరసము అయినభాషలో క్రోడీకరించిరి. చదుదరులెల్లరు మున్ముందుదీనిని చదువుట ఆవ శ్యకము- తరువాతగీతను ఏ అధ్యాయమునకు ఆ అధ్యాయము సహజమగు శైలిలో, సులభము, సుందరమగు భాషలో మృదు మధురముగ వివరించిరి. గీతను తెలిసికొనుటకు ఇంతసులభమగు వివరణము ఇంతవరకు రాలేదు- ఏఒక్క శ్లోకభావమును గూడ

వదలకుండ విసుగెత్తించని పద్ధతిలో చివరివరకు చదివించునట్లు సాగినది వీరి రచన.

వీరు బహుగ్రంథకర్తలగు సుప్రసిద్ధకవులు. భక్తులు తత్త్వవేత్తలు అగుటచే బాహ్యాంతరసౌందర్యముతో ఈగ్రంథము సాగినది- పారిభాషికపదములు వేదాంతసూత్రములు గలగీతను వీరిపుడు నూతనవిధమున నవలరూపమున రచించిరి- అర్జునుని మనోభావములను క్రమక్రమముగ మార్చి యుద్ధమునకు సుముఖు నిగజేసిన శ్రీకృష్ణుని సంభాషణములు, ఆయాసందర్భములు అత్యంత రమణీయముగ చిత్రింపబడినవి. ఇది వీరి రచనానైపుణ్యమునకు నిదర్శనము-

పరిణతమయిన వయసున మానవులకందరకు జీవితమున విజయము వార్జించుటకు సాధనముగ 'విజయగీత' నందించిన శ్రీకొండేపూడి సుబ్బారావుగారు ధన్యులు. జీవితమునకు సార్థకమయిన పనిని చేసినారు. వీరికి ఇతోధికమగు భక్తిని శక్తిని ఆయురారోగ్యములను సర్వేశ్వరుడు ప్రసాదించవలయునని ప్రార్థించుచు నా ఆనందమును ఆవిష్కరించక ఉండలేక అభినందించు చున్నాను. నాకీ అవకాశమునొసంగిన శ్రీ సుబ్బారావుగారికి నాహార్దిక కృతజ్ఞతాంజలులు.

# విజయగీత రెండవ వాలులు

సుప్రసిద్ధ నవలారచయిత, కథారచయిత

శ్రీ ధుండికోట బ్రహ్మాజీరావు M. A; (తె, ఇం, సం)

శ్రీ కొండేపూడి సుబ్బారావుగారు, ఆంధ్రసాహితీలోకము నకు చిరపరిచితులైన సుప్రసిద్ధకవులు, చక్కనిపద్యము లాఘవుగా చెప్పగల ప్రవీణులు, బహుగ్రంథకర్తలు.

వీరు శ్రీమద్రామాయణ, మహాభారత భాగవతపురాణము లేకాక శ్రీ వీభాగవతము, శ్రీఉత్తరరామాయణమునుకూడ ద్విపదలో రచించినారు. ఈపురాణములన్నియు ఒక్కరువ్రాయుట ఇదే ప్రథమము. శ్రీ ప్రసన్నభారతి, శ్రీ హనుమత్ స్తోత్రశతకము, కావ్యాంజలి, శ్రీ వేంకటేశ్వరకర్ణామృతము ఆదిగా బహుగ్రంథములను సాంప్రదాయరీతులలో పద్యములలో రచించినారు. వీరు ఇటీవల గద్యరచనను చేబట్టి శ్రీ భక్తమందారము, ఆంధ్రరఘువంశము మొదలగుగ్రంథములను వ్రాసినారు. శ్రీ భక్తమందారము భక్తుల కథలసంపుటి.

శ్రీ కొండేపూడి సుబ్బారావుగారు తమ నిరంతర కవితావ్యాసంగమును లోకశ్రేయముకొరకే వినియోగించి, ఆధ్యాత్మికం పౌరాణికవిషయముల వ్యాప్తికై కృషిచేయుచున్నారు.

నేటి పాఠకులకు కాల్పనిక సాహిత్యమునందుగల అభిలాషను వారు గుర్తించి భగవద్గీతను పౌరాణిక నవలగా తీర్చినారు. నవలను నడిపించునది కథ- ఉత్సుకతను పెంపుజేయుచు,

రోమాంచమైన విషయములతో, హృదయమునకు హత్తుకొనునట్లు సరళసుందరమైన భాషలో నవలను రచింపవలెను. శ్రీ సుబ్బారావు గారి పౌరాణికనవల, 'విజయగీత', ప్రారంభమునుండి ముగింపు వరకు పాఠకుని ఆకట్టుకొని చదివించును. ఈనవల ఆసక్తికలి గించు మహాభారతకథను, గహనమైన ఆధ్యాత్మికతత్త్వమును సుబోధకముగ పాఠకునికి అందించును- సామాజికవిషయములపై నవలలువ్రాయుట అబ్బురముకాదు. ఆధ్యాత్మిక విషయములపై అతిమనోహరముగ నవలను రచించుట కేవలము శ్రీ సుబ్బారావు గారివంటి పండితకవులకే సాధ్యము.

శ్రీ సుబ్బారావుగారు సహజకవులు వీరి వచనరచనలో ఈకవితాసౌందర్యము చోటుచేసుకొని దివ్యమైన రసానుభూతికి దోహద మగుచున్నది.

వీరికి ప్రకృతియన్న ప్రాణము- తద్వర్ణనలో నీరు మేను మరతురు. విజయగీతలో, మనోజ్ఞమైన శైలిలోవచ్చిన ఈ ప్రకృతి వర్ణనను తిలకింపుడు.

"శ్రావణ భాద్రపదములు వర్షర్తువు ముగిసినది. వానలు వెనుకబట్టినవి- అశ్వయుజ కార్తీకములుగూడ ముగిసినట్లే. హిమ ధాముడు మఱియొక శరత్తును పండించుకొనినాడు. క్రమక్రమ ముగా వెన్నెల వెలుగు తెరలుతగ్గి, తెలిమంచుతెరలు నిశాసమయ మున భూమిమీదకు దిగుచున్నవి."

యుద్ధారంభమునకు పూర్వదినమున సాయంసంధ్యను కురు క్షేత్రము భయదమై వీరి వర్ణనలో కనిపించును.

"ఇరువాగుల సంచలనమునకు లేచిన ధూళిజము ప్రాక్ పశ్చిమములనుండి ఘనఘోంతరముల వ్యాపించుచున్నది— కౌరవుల వైపునుండి, నిబిడ నీలభయంకర ధూమాంబుదములు, పర్వత శ్రేణులు కదలి వచ్చుచున్నట్లు, పశ్చిమదిశకు వచ్చుచున్నవి- ఆవచ్చుచున్న ధూమాంబుదములను చీల్చి చరమసంధ్యా కషాయ రాగ మయూఖములు ఖడ్గములవలె దూసికొని పోవుచున్నవి- అజ్ఞానాంధతమస్సులను జీల్చు జ్ఞానమరీచికలవలె అసాయం సమా రంభ సంధ్యారుణిమలు దుర్వారముగ నభోవీధుల నాక్రమించినవి."

గీతాతత్త్వమును బోధించు సందర్భమున ఏకైలి సరళమై, సాత్వికమై, సుభగమై మనసును ఆకర్షించును.

"ఎవరియందును ద్వేషము లేకుండుట, సర్వప్రాణుల యందు దయ, ఎల్లరతో మైత్రి, సహనము, సుఖదుఃఖములయందు సమబుద్ధి, నిత్యముసంతృప్తి, వీనికితోడు దృఢమైనసంకల్పముతో ఆత్మనిగ్రహముకలిగి మనోబుద్ధుల నా కర్పించిన భక్తుడు నాకు ప్రియుడు"—

శ్రీ సుబ్బారావుగారి నవల 'విజయగీత' ఒక అపూర్వ మైన ప్రయోగము ఇది తెలుగుసాహిత్య గగనన ధృవతారగ నిలుచును. ఇటువంటి ఉద్గ్రంథములను రచించుటకు వాసుదేవుడు శ్రీ సుబ్బారావుగారికి ఆయురారోగ్య సౌభాగ్యముల నిచ్చెడుగాత.

విశాఖపట్టణము

8-7-92

# సమర్పణము

ఈ 'విజయగీత' గ్రంథము గీతాచార్యుడు
శ్రీకృష్ణభగవానునకు భక్తిపూర్వకముగ సమర్పితము.

తీసినయూపిరే తిరిగి తీసినయట్టుల నెందరెందరో
వ్రాసిన గీతనే మరల వ్రాసితి నాదగు ఆత్మచింతనా
భ్యాసము నాదకాన, భగవద్వచనమ్ముల నెన్నిమార్లికన్
వ్రాసినఁజెల్లదే బ్రతుకుబాటను దీపిల జ్ఞానకాంతులన్- 1

ఏగానమ్ములు ప్రేమమాధురుల పండించెన్ వ్రజస్త్రీలలో,
ఏగానమ్ములు జ్ఞానదీప్తులను వెల్గించెన్ మనోవీథులం,
దా గానమ్ములు పైడిగంటలయి దివ్యస్పర్శ లందిచ్చుచున్
మ్రోగున్ నాహృదయాంతరస్థ మృదుతంత్రుల్ మీటి
సాగాడుచున్- 2

గళరుధిరమ్ము లేరులయి శత్రులకున్ బలివోవుసంగర
స్థలమున నిల్చి జీవనవిధాపరమార్థ మహోన్నతత్త్వముల్
చెలువములారుపల్కుల వచించినయోగివి. మా మనోంతర
మ్ములు వెలుఁగొందఁజేయు నవమోహనమూర్తివి. పార్థ
సారథీ! 3

ఎవ డీనల్లనిముద్దులా డిటుల నాహృద్వీథిలో గానమై
భవముల్ నిండిన లోతులేర్చి బ్రతుకుంబాటల్ వెలుంగన్ కళా
వ్యవసాయోజ్జ్వల భావభావిత రసవ్యాలోల లీలామహో
త్సవ విన్యాసవిలాసభాసురముగా స్వాదుత్వముల్ చిందెడున్. 4

ఆ మహనీయరూప మధురాదరం మేదురకాంతి లీలగా
నా మదిదోచుకొన్న ఒకనాటిది, ఈ మధురానుభూతిది;
వ్యామలభక్తి భావ మలరార రచించిన సర్వలోక సం
క్షేమమహత్త్వ మీవిజయగీతను ప్రీతిగ్రహింపవే ప్రభూ! 5

ఓమ్ కృష్ణం వందే జగద్గురుమ్



శ్రీరస్తు

# విజయగీత

## భారతీయ సంస్కృతి

శ్రీ రమణీయమగు భరతవర్షము జంబూద్వీపమునందు మిగుల పేరెన్నిక గనిన పెద్దదేశము. జంబూద్వీపము నందే కాదు భూమండలమునగల సప్తద్వీపములందున్న దేశము లన్నిటికన్న మిన్నయని చెప్పదగినది. ఈ దేశమునకీ కీర్తి యుగ యుగమ్ముల నుండియు వచ్చుచునే యున్నది. ఇట్టి కీర్తి వైభవమునకు కారణము భరతదేశము సముద్ర శైల కానన నదీనద సస్య ఖనిజ పశు సంపదాదులతో నిరంతరము విరాజిల్లు చుండుటతో పాటు దీనికిగల సంస్కృతియే. సంస్కృతి యనగా దేశవాసుల జీవన విధానము. ఏ జాతికిగల సంస్కృతి ఆ జాతిదే- ప్రపంచమునం దితర దేశములు భోగ భూములు కాగా, భారతదేశము ఆధ్యాత్మిక చింతనముతో పాటు మానవాభ్యుదయ కారకములగు యజ్ఞయాగాది పుణ్య కర్మములకు నిలయమైనది- జన్మ సాఫల్యము నొసగు ధర్మార్థ కామ మోక్ష చతుర్విధ పురుషార్థ సాధనములగు వర్ణాశ్రమ ధర్మము లిందు వర్ధిల్లినవి- భౌతిక విజ్ఞానమున ఎంతో కీర్తి గడించిన ఈనాటి పశ్చిమదేశ మేధావులు తత్వవేత్తలు సైతము భరతజాతి సంస్కృతి సర్వోత్తమమైనదని పొగడు

చున్నారు. ఈ భరతావని మన జన్మభూమియగుట మన పురా సుకృతఫలమే. యుగ యుగములనుండి విజయవంతముగ, విఖ్యాతముగ సాగుచున్న భారతీయ సంస్కృతిలోగల విశేష మేమి? దీని వెనుక నున్న జ్ఞానసంపద యెట్టిది?

ఆ రహస్యమిది - భగవన్ముఖోద్గతములైన వేదములు, ఉపనిషద్ధర్మములు భారతీయ సంస్కృతి కాధారము లగుటయే ఆ గొప్పతనమునకు హేతువు. వేదము లొకరు రచించినవి కావు. భగవద్వదనమునుండి వెలువడినవనియు అపౌరుషేయ ములనియు అందురు. వాని నుండె సర్వప్రవృత్తులు వికసించినవి. నిస్వార్థులు పరమాత్మ చింతనులు మానవసేవా పరాయణు లు, ధ్యానతపస్సమాధి మగ్నులునయిన ఋషి సత్తములకే వేదవాక్కులు వినబడినవందురు. లోకకళ్యాణార్థము ఆ వేద ధర్మములను వారు సూత్రీకరించిరి - వేదములు ఋగ్యజు స్సామా థర్వములని నాలుగు. ఇందు సంహిత బ్రాహ్మణము ఆరణ్యకము అను విభాగములున్నవి- దైవస్తోత్రములు యజ్ఞ యాగాది పూజా విధులు, ఇతర పుణ్యకర్మ విధానములును ఉన్నవి. ఉపనిషత్తులు బ్రహ్మజ్ఞానము ఆత్మబోధము నుపదేశించునవి- ఇంకను స్మృతులు వేదాంగములు ధర్మ శాస్త్రము లనేకమున్నవి. ఇవియే భారతీయసంస్కృతి కుపాధులైన జ్ఞాన భాండారములు.

"విదంతి అనేన ధర్మం" దీనిచే ప్రజలు ధర్మమును తెలిసికొందురు అని వేదశబ్దమునకు వ్యుత్పత్తి అర్థము. సర్వ

జీవములందును పరమాత్మ అంశకలదు. మానవుని ఐహికా ముష్మిక సౌఖ్యసాధనములగు ఆచార విచారములను వర్తన ములను శాసించు ధర్మవిధానము లీ వేదములు ఉపనిషత్తులు స్మృతులు శాస్త్రములును - జీవనగమ్యమును జన్మసార్థక తను తెలియజేయు జ్ఞానమార్గములివి. ఈ ధర్మసూత్రముల ననుసరించియే వ్యాస వాల్మీక్యాది ఋషీంద్రులచే మానవ సమాజ ప్రయోజనార్థము వ్రాయబడిన వివిధ పురాణేతి హాసములున్నవి. ఈ గ్రంథములందు కేవల ధర్మసూత్రములు, దైవమహిమములే గాక మానవజాతి కాదర్శపర్తనులయిన మహనీయుల చరిత్రములు విశ్వసృష్టి విజ్ఞాన విశేషములు మున్నగునవి అసంఖ్యాకములుగ నున్నవి.

వేదము లనంతములు. లోకవ్యవహారమున ఋగ్యజు స్సామాథర్వములని నాలుగుగ వింగడింపబడినవి. పరమేశ్వర నిశ్వసితములగుటచే వేదములు వాని కవియే ప్రమాణ ములు. తదనుసారముగ పురాణేతిహాసములకును ప్రామా ణ్యము లభించినది-

ఈ వేదవిజ్ఞానము భారతీయుల కబ్బిన మహాభాగ్యము. భగవత్ సన్నిభులైన ఋషులు ప్రజోపయోగము కొఱకు వీని ననేక విధముల బోధించి చెప్పిరి- ఇట్లు ఆది నుండియు మనమతము వేదమతము, మనసంస్కృతి వేదసంస్కృతియు నైనది- ముద్రణసౌకర్యములు లేవు, యంత్రపరికరములు లేవు. అయినను లక్షలాది వత్సరముల నుండి ఆసేతు శీతాచలము

భరతవర్షమున ఈ ధర్మశాస్త్రములు రక్షింపబడుచు అవిచ్ఛిన్నముగ జీవద్వేణివలె ప్రవహించి యావత్ప్రపంచమునకు మార్గదర్శకమైనవి. ఈ సంస్కృతి యందున్న పటుత్వమింత గొప్పది- భరతవర్షమున భిన్న భిన్న భాగములు బహు భాషలు ఆచారములున్నను, మధ్య మధ్య భరతావని పరదేశీయుల పాలనమునబడి స్వాతంత్ర్యము గోల్పోయినను ఈ సంస్కృతి భారతజాతి కేకత్వమాపాదించి వర్ధిల్లు చున్నది- కాలపరిస్థితులను బట్టి అనుదిన ఆచారములలో మార్పు వచ్చినను ధర్మమునకు మాత్రము ఎట్టి మార్పు ఉండదు-

ఏ ధర్మమైనను వస్తుతః ప్రయోజనకారి యైనపుడే అది శాశ్వతమై నిలువగలదు. ఇట్టి మహత్తరవిశేషము భారతీయ వేదసంస్కృతి యందు పుష్కలముగ నున్నది. ఆధ్యాత్మిక చింతనముతో పాటు మానవ సమాజశ్రేయమున కెట్టి సాధనవిధానములు ఈ వేదోపనిషద్ధర్మములందు శాసింపబడినవో చూడుడు.

“ప్రజలకు శుభంకరమగు న్యాయమార్గమున పరిపాలనము సాగుగాక. బ్రహ్మజ్ఞానము పశుసంపదయు వర్ధిల్లును గాక- ప్రజలెల్లరు పరస్పరద్వేషము లేక శక్తిమంతులై తేజోవంతులై అన్యోన్య ప్రేమమున సంపదనుభూతులతో కలిసి మెలిసి యుందురు గాక. అజ్ఞానము నశించి జ్ఞాన మార్గవర్తనులై జనులు సార్థక జన్ములగుదురుగాక. లోకము

లెల్లప్పుడు శాంతి సౌఖ్యములతో విలసిల్లును గాక-"

ఆహా! సర్వమానవ సమాజ శ్రేయమే ఆదర్శముగ వచింపబడిన విశ్వజనీన ధర్మము గదా యిది- ఈ ధర్మమే భారతీయ సంస్కృతికి మూలకందమై భాసిల్లినది-

జగత్కారణుడు జగత్పోషకుడైన శ్రీమన్నారాయణున కొక ప్రతిన యున్నది- ఏమని? ప్రపంచము నందెప్పు డెప్పుడు ధర్మమునకు హాని వాటిల్లి అధర్మము ప్రబలునో ప్రతి యుగమున తానా సమయములందు స్వయముగ అవతరించి దుష్టనాశనము సాధురక్షణము గావించి ధర్మము నుద్ధరించును-

ఏరూపమున అవతరించి ఏకార్యము నెట్లు ఎప్పు డొనరింపవలయునో అది యాస్వామికే వేద్యము. ఎన్నో యవతారము లిట్లా భగవానుడు దాల్చి జగముల నుద్ధరించెను- స్వార్థపరులు లోకకంటకులైన దుష్టుల వలన మరల మరల ఉత్పాతములు వచ్చుచునే యున్నవి. మరల మరల భగవాను డవతరించి ధర్మసంస్థాపనము నొనర్చుచునే యున్నాడు- ఆయవతారములలో ద్వాపరయుగమున వచ్చిన శ్రీకృష్ణావతారము అతి ముఖ్యమైనది- జగత్కల్యాణ కార్య పరిపుష్టమయిన అవతారమది- భగవానుడెచ్చట నున్నాడు? ఏ రూపమున నుండును? భూమిపై జరుగు కార్యాకార్యము లాయన కెట్లు తెలియును? ఈ ప్రశ్నలకు తావు లేదు. ఆస్వామి సర్వాంతర్యామి, సర్వసాక్షి, విశ్వాత్ముడు.

శ్రీకృష్ణుడు లీలామానుష విగ్రహుడు- ఆస్వామి బాల్యము నుండియు ధర్మసంస్థాపనోద్యమము సాగుచునే వచ్చినది- కంసాది విమతులెందఱో శ్రీకృష్ణునిచే హతులైరి. తుదకు ద్వాపరాంతమున హస్తినాపుర రాజవంశమున దాయాదులగు కౌరవపాండవులకు రాజ్యభాగ విభజనమును గూర్చి కలహమారంభమై కురుక్షేత్రమున మహాసంగ్రామముగ పరిణమించినది- న్యాయవర్తనులైన పాండవుల పక్షము వహించి శ్రీకృష్ణమూర్తి పాండవమధ్యముడు జగదేకవీరుడునగు అర్జునునకు సారథియైనాడు- యుద్ధరంగమున కరుదెంచిన అర్జునునకు అకస్మాత్తుగ "అయ్యో బంధువర్గమును జంపి రాజ్యముగైకొనుటా" అను శంకవచ్చి వెనుదిరుగ బోయెను- ఆవిషమ సమయమునందు, భీకరరణరంగమున శ్రీకృష్ణుడర్జునకు ధర్మకర్తవ్యముపదేశించి యుద్ధోన్ముఖుని జేసెను- ధర్మపక్షమగు పాండవులకు విజయము లభించినది- శ్రీకృష్ణుడొనర్చిన ధర్మకర్తవ్యోపదేశమే భగవద్గీత. సర్వమానవ సమాజమునకు ఆచరణీయమైన ధర్మప్రబోధము, సర్వవేదోపనిషత్సార సంగ్రహమది-

ఉపనిషత్తులెల్లను గోవులయినచో, అర్జునుడు గోవత్సము. క్షీరమును దీయువాడు శ్రీకృష్ణమూర్తి. ధీశాలురెల్లగును మహిమాన్వితమగు గీతామృతము నాస్వాదించి సుఖశాంతులు పడయుచున్నారు.

అత్యంత మహిమాన్వితము, పరమాద్భుతము అయిన ఈ భగవద్గీతాప్రబోధ కథను ఇక వినుడు-

# 2. కౌరవ పాండవుల యుద్ధ కారణము

అది ద్వాపరయుగము- కృత త్రేతాయుగములు గడచినవి- ధర్మము క్రమక్రమముగ క్షీణించుచు వచ్చిన దినములు. పుడమిపై పాపభారము దుర్భరమైనది- దుష్టులంతకంతకు ప్రబలసాగిరి- భూదేవి గోరూప ధారిణియై పోయి "యీ పాప భారము సహించుము దేవా!" అని శ్రీమన్నారాయణుని అర్థించినది- యదువంశమున తాను శ్రీకృష్ణునిగ అవతరించి దుష్టుల నెల్ల దునిమెదనని అభయమిచ్చి శ్రీమన్నారాయణుడు భూదేవి నూరడించి పంపెను.

హస్తిన ఉత్తర భారతదేశమునందు యమునానదీ తీరమున నున్న మహానగరము- ఒక మహా సామ్రాజ్యమునకు రాజధాని- ఈ సామ్రాజ్యమును చంద్రవంశపు రాజులు పాలించిరి- ఈ రాజవంశమునకు పూరువు భరతుడు కురువు పాండురాజు మున్నగు ప్రముఖులు వంశకర్తలు- ఈ రాజన్యులలో విచిత్రవీర్యుని భార్యలగు అంబికయందు ధృతరాష్ట్రుడు అంబాలికయందు పాండురాజు వ్యాసమహా ఋషి అనుగ్రహమున ఇరువురు పుత్రులుద్భవించిరి- అందు ధృతరాష్ట్రుని కుమారులు నూర్గురు, దుర్యోధనాదులు. వారే కౌరవులు- పాండురాజు కుమారులు ధర్మజాదులు పాండవు లయిదుగురు. పాండవులు న్యాయవర్తనులు మహా వీరులు. దైవాంశ సంభూతులు. ప్రజలకు వారియందు ఆదరాభిమానములు మెండు- కౌరవులు దుర్బుద్ధులు- రాజ్యకాంక్ష

జనితులు- పినతండ్రి కుమారులకు పాండవుల యెడ అసూయ పెంచుకొని వారిని నానా బాధలు పెట్టిరి; పాండవుల భార్య యగు ద్రౌపదిని నిండు సభలో అవమానించిరి- ద్యూతమున మోసముజేసి పాండవుల నడవికి పంపిరి- ప్రతిజ్ఞానుసారము పాండవులు భార్యాసమేతముగ వనవాస అజ్ఞాత వాసములు ముగించుకొనివచ్చి వారికి రావలసిన అర్ధ రాజ్యభాగము నడుగగా దుర్యోధనాదులు తిరస్కరించి అర్ధ రాజ్యము మాట యెందులకు అయిదుగురు సోదరులకు అయిదూళ్ళు కాదు గదా చివరకు సూదిమోపినంత స్థలమైనను లేదని నుడివిరి. పాండవులకు యుద్ధమే కర్తవ్యమైనది. బంధు బలముల చేకూర్చుకొనినారు- కౌరవులంతకుముందే వారి సైన్య సమూహములు వారి బంధువుల బలములతో యుద్ధసన్నద్ధులైరి- ఇరువాగులును కురుక్షేత్రమున జేరినవి. దాయాదుల కుటుంబ కలహమిట్టు భీకర సంగ్రామముగ పరిణమించినది- అదియే మహాభారత యుద్ధము- శ్రీమన్నారాయణుడు శ్రీకృష్ణమూర్తిగ యదువంశమునందవతరించి ఆయుద్ధమున ధర్మపక్షమయిన పాండవులకు బాసటగానుండి పాండవమధ్యముడు జగదేకవీరుడూ అయిన అర్జునునకు యుద్ధరంగమున జేసిన కర్తవ్యనిర్వహణ ప్రబోధమే ఈ విజయగీత. ఇరుతెగల యందును అనేక అక్షౌహిణుల సైన్యము నశించినది. దుష్టుల యిన కౌరవులు నశించిరి. పాండవులకు విజయము చేకూరినది. పాండవాగ్రజుడు ధర్మరాజు హస్తినకు చక్రవర్తియై ధర్మదేవతగ పరిపాలన సాగించినాడు.

హస్తినకు కడు దగ్గఱలో నున్న కురుక్షేత్రము ఆయుద్ధము జరిగిన స్థలము. ఈ కురుక్షేత్రప్రదేశము నందే పూర్వము బ్రహ్మ ఇంద్రుడు అగ్ని తపమొనర్చిరి. కురుమహారాజిచ్చటనే అనేక ధర్మకార్యము లాచరించిన గాథలు కలవు. అది యీ యుద్ధరంగమగుటలో మఱియొక విశేష మున్నది- త్రేతాయుగ కాలమందొకప్పుడు హైహయాది రాజవంశీయులు అధికారమదోన్మత్తులై ప్రజాకంటకులైరి. మునులను పీడించిరి. వారి యాశ్రమములను కొల్లగొట్టి వారి నిత్యాగ్నిహోత్రాది అనుష్ఠానములు జరుగకుండ ఆశ్రమ ధేనువుల నపహరింపజొచ్చిరి. జాతీయ జీవనము సంక్షుభితమైనది. జమదగ్ని యంతటి మహర్షి ఆ రాజన్యులచే హతుడయ్యెను- జమదగ్ని కుమారుడు పరశురాముడు. శ్రీహరి యవతారము. దుష్టరాజన్యుల దురాచరణముల కామహాత్ముని హృదయము కంపించినది. బ్రహ్మతేజస్వియగు పరశురాముని యందు క్షాత్రశక్తి విజృంభించినది. దుర్వారపరాక్రమ తేజస్సుతో అతని కన్నులు నిప్పులు వర్షించినవి. ఆగ్రహము మహాజ్వాలయై విజృంభించినది. పరశువు బూని లేచినాడు. దుష్టరాజన్యులపై ఇరువది యొక్కమారు సింహము వలె నురికినాడు. తన్నెదిర్చిన వారినెల్ల సంహరించినాడు. వైరిరాజుల దేహారుధిరము లా కురుక్షేత్రమున అయిదు మడుగులైనది. ఆ రుధిరధారలతో తండ్రికి తర్పణము లాచరించినదనుక ఆ మహావీరుని ఆగ్రహము చల్లారలేదు. దానితో

దుర్మార్గులగు రాజన్యుల దర్పోద్ధతులును అంతమైనవి- అదియే శమంతపంచకమనబడు కురుక్షేత్రము. పాపములు శమించిన పుణ్యస్థలము.

వేదవిహిత వర్ణాశ్రమాచార సత్కర్మలకు, మహఋషుల జగత్ క్షేమంకరములగు జపతపోవ్రతములకు, ఉత్తమ రాజన్యుల ధర్మపాలనములకు నిలయమై భరతవర్షము కర్మభూమిగ ఖ్యాతి నందినది. అట్టి సత్కర్మములకు పేరందిన పుణ్యస్థలము లీ భరతావనిలో నలుదిక్కులను పెక్కులున్నవి. వానిలో కురుక్షేత్రమొకటి నేటికిని సుజన సంసేవ్యమై దర్శనీయమై విలసిల్లు చున్నది.

ఆ కురుక్షేత్రము నందే పాండవ కౌరవ మహాయుద్ధమైనది- పాండవుల అభిమానులు రాజబంధువులు వారి వారి సైన్యబలములతో వచ్చి పాండవులకు తోడుగా నిలచిరి. దుర్యోధనాధులగు కౌరవుల మహాసైన్యమునకు వారి బంధువులు వారి సైన్యబలముతో వచ్చి సాయమైరి. పాండవ బలము ఏడక్షౌహిణులు, కౌరవబలము ఏకాదశాక్షౌహిణులు- అక్షౌహిణి అనగా 21870 రథములు 21870 ఏనుగులు 65610 గుఱ్ఱములు 109350 కాల్బలము-

ఇరుగడల యోజనముల కొలది మోహరించి నిలచిన ఆ సైన్యసాగరము చూడగా భారతదేశ యోధానీకమెల్ల అచటనే సమీకృతమైనట్లు తోచినది. ఆ పాండవ కౌరవ సంగ్రామ మా విధమున మహాభారత యుద్ధమై పదునెన్మిది

దినములు సాగినది. ఇరువాగులు జిగీషతో రోషాహ తాన్యోన్యులై పోరాడిన ఆ యుద్ధమును దివినుండి జూచిన దేవతలు వెఱగుపడిరి. భూమండలము సర్వమల్లాడి పోయినది-

నారాయణావతారమూర్తి శ్రీకృష్ణుడు పాండవ పక్షమున నిలబడినాడు. అది ధర్మాధర్మములకు న్యాయాన్యాయములకు మధ్యజరిగిన మహాసంగ్రామము. ఒకనాడు యమునా తీర సైకత బృందావనవీథుల గోపీజన మధ్యమున విశ్వప్రేమ గీతములను తన మోహనమురళితో నాలపించిన శ్రీకృష్ణుడు ఈనాడు విలయ విపద్భీకరమగు మహాసంగ్రామ రంగ మధ్యమున, అర్జుననకు సారథియై ఆత్మబోధతో పాటు కర్తవ్య బోధను జేసి మహోత్సాహము కల్పించినాడు. ఆ ప్రబోధమే ధర్మమునకు విజయగీతమై విశ్వమున నలుదిక్కుల మారు మ్రోగినది.

మానవధర్మ బోధకములగు మహోపదేశములు మహా తపస్సంపన్నులైన భారత ఋషీంద్రులొనర్చినవి వున్నవి, వశిష్ఠగీత పరాశరగీత మున్నగునవి, అవి ఆర్షేయములు. శ్రీకృష్ణుడు హరి అవతారము. ఆ స్వామి ప్రబోధము భగవద్గీతయై వేదోపనిష ద్ధర్మామృతముల గురిసి యావత్ప్రపంచమునకు జీవగఱ్ఱయై నిలచినది- అది దాదాపు ఆరువేల సంవత్సరములకు పూర్వము పవిత్ర భారతమున మొలచిన సర్వ మానవ సద్ధర్మ విజయ గీతాంకురము. మానవజాతి మనుగడకు మహోదయము.

# శ్రీ కృష్ణ రాయబారము

శ్రావణ భాద్రపదములు వర్షర్తువు ముగిసినది. వానలు వెనుక బట్టినవి. ఆశ్వయుజ కార్తీకములు గూడ ముగిసినట్లే. హిమధాముడు, మఱియొక శరత్తును పండించుకొనినాడు. క్రమక్రమముగా వెన్నెల వెలుగు తెరలు తగ్గి, తెలిమంచు తెరలు నిశాసమయమున భూమి మీదకు దిగుచున్నవి. హేమంత మొక చిత్రమైన ఋతువు. హిమాద్రి శీతవాయువులు దక్షిణదిశగా ప్రసరించి భారత భూమిని చల్లబఱచును. రాత్రులందు శరత్కాల చంద్రికాచ్ఛాయలు కనబడుచునే యుండును. ప్రత్యూషమున తెలిమంచు తెరలు దిగుచుండును. బాటలు వాని యందున్న పల్వలములతో సహా ఎండి గట్టిపడి బరువైన వాహనములకు కూడ ప్రయాణాను కూలముగా నుండును.

హస్తినాపుర సామ్రాజ్యము చంద్రవంశపు రాజుల యేల్బడిలోనిది. హిమకరు ననంతరము పూరువు, భరతుడు, కురువు, శంతను మహీపతు లఖండ కీర్తిధురుణులై పాలించిన రాజ్యమది. ఆ మహామహుల పాలనలో హస్తిపుర రాజ్యమెల్ల విధముల అభివృద్ధిగాంచి మూడు పూవులారు కాయలుగ నున్న దినములవి. శంతను మనుమలు, ధృతరాష్ట్రుడు పాండురాజు అను వారిరువురు అంబిక అంబాలిక అను సవతుల్ల బిడ్డలు హస్తినాపుర సామ్రాజ్యాధిపతులు. ధృతరాష్ట్రుడు జనుమాంధుడు. పాండురోగి యయ్యు పాండురాజు

మహాబలవంతుడై యీరాజ్యము నభివృద్ధి పఱచెను. ధృతరాష్ట్రుని సుతులు దుర్యోధనాదులు నూర్వురు, కౌరవులు నాబడువారు. పాండురాజు కుమారులేవురు ధర్మజ భీమ అర్జున నకుల సహదేవులు. పాండురాజు గతించుటతో, ఈ బిడ్డల విద్యాభివృద్ధులు శంతనుని ప్రథమ భార్య గంగాదేవి కుమారుడగు భీష్ముడే చూచుచుండెను. భీష్ముడు బ్రహ్మచారి మహాబలసంపన్నుడు, జ్ఞాని. మనుములందఱికి ధనుర్విద్యా విశారదుడగు ద్రోణాచార్యునిచే యుద్ధ విద్య నేర్పించెను.

పాండవులు ధర్మగుణులు, సాధువర్తనులు, అజేయ పరాక్రమోపేతులు. ప్రజలెల్లరకు అభిమాన పాత్రులు. దుర్బుద్ధియగు దుర్యోధనునకు పాండవులయెడ అసూయ. ఎట్లయినను వారి రాజ్యభాగము వారికి కాకుండ సర్వము తానే అనుభవింపవలయునను స్వార్థమతిని లోకెత్తినది. అతనికి కర్ణ శకుని దుశ్శాసనాది కుమతులు తోడైరి. పెట్టరాని బాధలు పెట్టి పాండవులను పరిమార్ప జూచిరి. లోతు నీట ద్రోయించిరి; విషాన్నములు పెట్టించిరి. లక్కయింటబెట్టి కాల్పింపజూచిరి. కుటిల ద్యూతమున ధర్మజునోడించి పాండవ పత్నియైన ద్రౌపదిని నిండుకొలువున అవమానింప జూచిరి. దైవానుగ్రహము పాండవులయెడ నున్నది. ఈ బాధలన్నిటి నుండియు బయటపడి ద్యూతవచనానుసారము పదిరెండేడులు వనవాసము ఒకయేడజ్ఞాతవాసము నొనరించి పాండవులు హాస్తినకు సమీపమున నున్న ఉపప్లావ్యపురమున కేతెంచిరి.

పాండవులు క్షేమముగ తిరిగివచ్చిన వార్త హాస్తినను వ్యాపించినది- ధృతరాష్ట్ర భీష్మ ద్రోణాది వృద్ధులు, హాస్తినయందే యున్న పాండవుల తల్లి కుంతియు పాండవుల కుశల వార్త విని పరమానందభరితులైరి- పైకి సంతసము నటించెనే కాని ధృతరాష్ట్రునకు గుండెలందేమూలనో ఒక భయమున్నది- పాండవు లపారపరాక్రమోపేతులు, తన పుత్రులు దుర్యోధనాదులు వారికి చాలరు. పాండవు లీనాటివరకు పడరాని కష్టములు పడి తిరిగి నలువురిమధ్యకు వచ్చినారు. ఏమో, ఏక్షణమున వారు వారి రాజ్యభాగమునకై దుర్యోధనాదులపై దుముకుదురో! ముందుగనే జాగ్రత్తపడుట మంచిదని యెంచి అనుచరుడగు సంజయునిచే ధర్మజునికి ఒక సందేశమంపించినాడు. "జరిగినదానిని మఱచి ధర్మజాదులు తన పుత్రులతో పొత్తుకలసి యుండుట సమంజస" మని- ఆ వార్తను గైకొని సంజయుడు ధర్మరాజుకడకేగెను. సంజయునకుచిత మర్యాదలు జరిపి ధర్మజుడిట్లు నుడివెను. సంజయా! పెద్దలందఱు కుశలమేకదా. వారికి నా నమస్సులు. నేను మాత్రము సంధికాదందునా యేమి. ఇంతకును మాకు రావలసిన రాజ్యభాగము సంగతి మాటాడరేమి? మా రాజ్య స్వామ్యమునకై మేము పోరాడవలసి వచ్చినచో అది క్షత్రియ ధర్మమే యగును- మా రాజ్యభాగము మాకిచ్చిన చాలు. ధృతరాష్ట్రుడంతమాత్రము చేయునని నాకాశ లేదు. ధర్మజుని ఈ మాటలు అచ్చటనేయున్న శ్రీకృష్ణుడును సమర్థిం

చెను. సంజయుడామాటలయందున్న భావమును గ్రహించెను. అవి ధర్మజుని ఆగ్రహమును సూచించుచున్నట్లున్నవి. వెనుదిరిగి హస్తినకేగి సంజయుడా సమాచారమునెల్ల ధృతరాష్ట్రునికి నివేదించెను. ఇక పాండవ కౌరవులమధ్య యుద్ధము తప్పదేమో. అందఱును ఇట్లే భావించసాగిరి.

దుర్యోధనుడు మత్సరగ్రస్తుడు. ఎట్లయిన పాండవులను పరిమార్చవలయుననియే చూచును. తండ్రిమాట వినడు. దుర్యోధనుని అసూయాదుర్గుణము లెంత పెరిగిపోవుచున్నవో ధర్మజుని సహనభావము సాధుశీలము అంతె యెక్కువగుచున్నవి. పుత్రమోహముచే ధృతరాష్ట్రుడు దుర్యోధనునకు అడ్డుచెప్పడు భీష్మద్రోణాది వృద్ధులెన్నిన దుర్యోధనుడు సరకుగొనడు. పాండవుల యెడ శ్రీకృష్ణుడెల్లవేళలను శ్రేయోభిలాషియే. పాండవులకాతడు ఆప్తబంధువు కూడను. తన చెల్లెలు సుభద్రను అర్జునకిచ్చి వివాహము గావించెను.

ధర్మజుడు కౌరవుల వలన నానా బాధల పాలయినవాడు. అయినను దుర్యోధనాదుల యెడ ఆగ్రహము లేదు. లోలోపల సంధియే వాంఛించును. కాని ఏమిలాభము? దుర్యోధనుడు దారికిరాడు. యుద్ధము సర్వజనులకు బాధాకరమే. తన తమ్ములు ఎప్పుడు తమ బలపరాక్రమములను చూపగల్గుదుమా యని తోకత్రొక్కిన త్రాచులవలె నున్నారు. ఆమాట ధర్మజున కవగతమే. కాని మరియొకసారి కౌరవులతో సంధికి ప్రయత్నించుట మంచిదని భావించినాడు.

ఆ సంధి రాయబారమునకు శ్రీకృష్ణుడే తగినవాడు- మధ్యాహ్న భోజనములైనవి- కొంతసేపు అందఱును విశ్రమించుటయు జరిగినది- శ్రీకృష్ణుని సుఖాసనమున కూర్చుండబెట్టి జేసి ధర్మజుడు తమ్ములను ద్రౌపదిని పిలచి తన యభిప్రాయమును నుడివి, మీయభిప్రాయము నీవిషయమున విశదీకరింపు డని వారివంక జూచెను. ఈ క్షణముకొఱకే వారును వేచి యున్నారు- వారి గుండెలలోనున్న ఆగ్రహావేశము పెల్లుబికినది.

కౌరవులను రూపుమాపి మన అర్ధరాజ్యమును మనము తెచ్చుకొనుటయే మన కర్తవ్యమని భీముడు మహోత్సాహముతో తన గదనెత్తి భుజస్ఫాలన మొనరించెను. అట్లేయని అర్జునుడు తన గాండీవమును ముందునకు బెట్టెను. తమ కరవాలముల ఝుళిపించి "ఇంకను సహించి ఊరకొనునది లేదని" నకుల సహదేవులు కృష్ణునివైపు జూచినారు. "మీ యుత్సాహమును మీరు కొసవరకు నిలబెట్టుకొనవలయును సుమా!" అని కృష్ణుడు చిఱునవ్వెను. ద్రౌపది ముందునకు వచ్చి అన్నా కృష్ణా! ఆనాడు కౌరవ సభలో నాకవమానము జరుగనున్న తఱి నీవేగదా నన్ను రక్షించితివి. ఇదిగో చూడుము క్రూరుడు దుస్ససేనుడు నాశిరోజములనుపట్టి లాగగా సగము తెగి మిగిలిన శిరోజములివి. మీ రాయబారములమాట నాకు తెలియదు. కాని నా భంగపాటునకు చిహ్నములైన ఈ శిరోజములను సంధిమాటల సమయమున మరువవద్దుసుమా యని

కంట నీరుబెట్టుకొనినది. బాష్పాకులిత నేత్రయయిన ఆమెను జూచి భీమాదులకు ఒడలు జలదరించినది. ఆనాడు అన్నగారి యాజ్ఞకు లోబడుటవలనగదా తమ కండ్లయెదుట తమ పత్ని పరాభవింపబడుట చూచియు ఏమియు చేయలేక ఊరకుంటిమి అనుకొనికోపోద్రిక్తులైరి. శ్రీకృష్ణుడు ద్రౌపదినిజూచి "తల్లీ నీవు మహాపతివ్రతవు. నీకెగ్గుదలచిన వారూరకపోరు. ఆ కౌరవాధముల కాంతలు విలపించుదినము లాసన్నమైనవి. ఓపికపట్టికొన్ని దినములు నీవూరకుండుము"- అని ఊరార్చినాడు.

ధర్మజుడంతయు గమనించుచునే యున్నాడు. తన సోదరులు శ్రీకృష్ణుని దీసికొని ఈక్షణమే కౌరవులపై దూకు నట్లున్నారు- శ్రీకృష్ణునకు నమస్కరించి యిట్లనినాడు.

"కృష్ణా! మమ్ముల నొకకంటితో నీవెప్పుడును కాపాడుచునే యున్నావు. ఈనాడది అన్నిటికన్న ముఖ్యవిషయము ఆవేశములతో లాభములేదు. మాలోమాకు విభేదములేల? మా తమ్ముడు దుర్యోధనునకు అంతగా రాజ్యాశ యున్నచో అట్లే కానిండు. పదపడి యుద్ధము పైపైనున్నదా. గెలుపోటములు ఊహాతీతములు కదా. కౌరవులకండగా నున్నవారు మాత్రము సామాన్యులా. మా తాత భీష్ముడు, ఆచార్యుడు ద్రోణుడు ఈ యిద్దటిలో ఒక్కరు చాలు జగత్సంక్షోభము కలుగజేయుటకు. కృష్ణా! వినుచున్నావుగదా. నీవు రేపే హస్తినకేగి పెద్దలకు నా వందనములు, చిన్నలకు నా ఆశీస్సులను తెల్పి, నామాటగా ఇట్లనుము. "పాండవులకై దుగురికి

అయిదూళ్ళిచ్చిన జాలు, వారికి యుద్ధవాంఛ లేదు. ఈ వాక్యములపై సంధికుదుర్చుకొని రమ్ము." ధర్మరాజుడు తన అంత్య నిర్ణయమును చెప్పినాడు. ఆహా జ్వాలదిగ్ని మధ్యమున నున్నవానికింత శాంతియా. అనుజులు నలువురు నోరువిప్ప లేదు అన్నగారి మాట కాదనగలిగినచో ఏనాడో భీమార్జును లిరువురు కౌరవులను మట్టుబెట్టియుందురు. ద్రౌపదియు మరల మాటాడలేదు.

శ్రీకృష్ణుడు తలయూచి సరే అనినాడు. కృష్ణుని మనసులోనున్న ఊహ లేవియో ఆయనకే తెలియును. మఱునాడు బహుళపంచమి. సమయము బాగున్నది. తన రాయబారి కార్యమునకై పయనమై ధర్మజుని అనుమతి గైకొని రథారూఢుడై హస్తినకు బయలుదేరినాడు. అర్జునుడు కొంత దూరము కృష్ణుని సాగనంపి వెనుదిరిగినాడు. ఆ యిరువురి మధ్య సంభాషణయే జరుగలేదు. ఎవరేమి ఆలోచించుచుండిరో. ఏమియు భయము లేదన్నటుల శ్రీకృష్ణుడు పార్థుని భుజము తన దక్షిణహస్తమున తట్టి వెనుకకు పంపినాడు.

శ్రీకృష్ణుడు హస్తినకు చేరి విదురునింట విడిదలయొనర్చి మున్ముందు ధృతరాష్ట్రుని భీష్మ ద్రోణులను జూచి తన రాకకు కతం బెఱింగించి యెట్లయిన సంధియగుట మేలని నుడివి, పిదప కుంతికడకేగి పాండవుల కుశలము తెలియజేసెను. ఆ మఱునాడే మహాసభ జరిగినది. వృద్ధరాజు అచ్చటనే కొలువుదీరియున్నాడు. భీష్మ ద్రోణ విదుర కృపాచార్యాది

వృద్ధులు, అశ్వత్థామాదులు విచ్చేసి వారి ఆసనములలో కూర్చొనిరి. దుర్యోధనుడు దుశ్శాసనాది అనుజుల తోడను కర్ణ శకుని ప్రభృతులతోడను వచ్చి ఒకప్రక్క ఆసీను డయ్యెను. శ్రీకృష్ణుని డెందులకు వచ్చెనో వారందఱికి తెలి యును.

పెద్దలెల్లరకు అభివాదములు తెల్పి, ధర్మజుని నమ స్సులు గూడ అందజేసి పిన్నలను ప్రేమపూర్వకముగ సంభా వించి కృష్ణుడు మాటలాడుటకు లేచినాడు. ఏమిచెప్పునోయని సభ్యులెల్లరు ఆసక్తితో ఆ గోపాలుని వైపే చూచుచున్నారు. గంభీర స్వరమున శ్రీకృష్ణు డిట్లనెను.

"కురు కుమారులందఱిలో వయసున ధర్మజుడు పెద్ద. ఆదిని పాండురాజు తన బలపరాక్రమములతో ఈ హస్తినా పుర రాజ్యమును బహుధా విస్తరింపజేసి నేటి ఈ రాజ్య ప్రశస్తికి కారకుడయ్యెను. న్యాయ ప్రకారము ధర్మజ దుర్యో ధను లిరువురును రాజ్యమును చెఱిసగము పంచుకొని వారే వురు వీరు నూర్గురు నూట అయిదుగురు సోదరులు కలసి మెలసి యుండుట మంచిది. ఇట్లు గంభీరముగ నుడివి శ్రీకృష్ణు డొక నిముస మూరకొనెను. భీష్మ ద్రోణాది వృద్ధులు సంతో సముతో అంగీకార సూచకముగ తలలూపిరి. దుర్యోధన వర్గమునుండి మూతి విరుపులు వెక్కిరింతలు పిల్లికూతలు విన వచ్చినవి. శ్రీకృష్ణు డిది గ్రహించి మరల ఇట్లనెను. 'దుర్యోధనా! నా సంధి వచనములు నీకు పథ్యములు కావని

నే నెఱుగుదును. వారి రాజ్యభాగమునకై పాండవులు నన్ను మీా యెదుటకు పంపు పనియే లేదు- అర్ధరాజ్యమే కాదు భీమార్జును లాయుధహస్తులై ఉద్రేకమున రేపు వచ్చినచో హస్తినాపుర సామ్రాజ్య మంతయు ఒక్కదినములో వారి హస్తగతము కావలసినదే. కాని ధర్మజునకంత ఆశ లేదు. జరిగినదంతయు మఱచి తనకు ప్రియ సోదరులగు మీాయెడల ప్రేమతో పాండవు లయిదుగురికి అయిదూళ్ళిచ్చిన చాలు నని చెప్పుటకు నన్నిట కంపినారు. అట్లయినచో వారు మీాతో సంధికిసిద్ధమే. ఈమాత్రము ఔదార్యముమీారుచూపవచ్చును. ఏమందురు?" అని శ్రీకృష్ణు డాసీనుడయ్యెను. తథ్యముగ అట్లు కావలసినదే అని భీష్మాదులు తెలుపిరి. ధృతరాష్ట్రుడును అంగీకారమును తెలిపెను కాని ఆ వృద్ధరాజు నిర్ణయాధి కారము ఏనాడో నశించినది. దుర్యోధనునిదే తుదిమాట. దుర్యోధను డేమియనునో యని సభ్యుల నేత్రము లతనివైపు దిరిగినవి. కర్ణుడేదియో దుర్యోధనుని చెవిలో నూదు చున్నాడు. దుర్యోధను డిట్లనెను. అతని మొగమునందేదియో వింతయగు ధైర్యరేఖ మెఱసినది- 'శ్రీకృష్ణా నీవాక్యము లన్నియు శ్రద్ధగా వినినాము. ఒక్కమాట వినుము. పిరికి పందలై కాళ్ళబేరమునకు వచ్చినవారితో మహా వీరులమగు మాకు సంప్రదింపులా? హస్తినాపురాధిపులు కని విని యెఱు గని వింత. ఆపైన నీవేమియో ధర్మశాస్త్రములు విప్పు చున్నావు. సోదరులిరువురిలో మాతండ్రి ధృతరాష్ట్రుడు పెద్ద.

రాజ్యమాయినది. ఆయన జ్యేష్ఠపుత్రుడను నేను. ఆ రాజ్యాధికారము నాకుచెందును. ధర్మజునకు ఆవగింజంత అధికారము లేదు, లేదు, లేదు. బలమున్నచో గెలిచి గైకొనవచ్చును గదా. ఈదైన్యపు వ్యవహారమేటికి. యుద్ధమునకే సిద్ధమగుచో మా అంగదేశాధిపుడు కర్ణుడు ఒక్కడును చాలును వారిని, వారి వారిని మరల అరణ్యములకు దోలుటకు. అయిదూళ్ళు కాదుగదా సూది మోపినంత స్థలమైనను ఈయను, ఈయనన్నచో నీయను. నీ సంధిరాయబారములతో నాకు పనిలేదు. నీవు మర్యాదగ వెనుకకరుగవచ్చును!

దుర్యోధనుని ప్రసంగమునకు కర్ణుడు దుశ్శాసనాది అనుజులు హర్షధ్వానములు చేసిరి. ఆమ్మోలబ్బించి కృష్ణుని వైపు వికటాట్టహాసము లొనర్చిరి– భీష్మాదివృద్ధులు నివ్వెఱగంది ఇది అన్యాయము, అన్యాయమని ఘోషించిరి. ధృతరాష్ట్రుడేదియో చెప్పజూచెను. వినువారు లేరు. భార్య గాంధారిచే చెప్పించెను. అదియును వ్యర్థమే. కర్ణ దుర్యోధనులు తాము జయించినట్లొక వింత మందహాసము చేయుచు కూరుచొనిరి.

శ్రీకృష్ణుడు లేచెను. సభ నిశ్శబ్దమైనది. శ్రీకృష్ణుని వదనమందొక తీవ్రభావము ప్రబలినది. ఇట్లనెను. "దుర్యోధనా! అసమంజసములు అసంబద్ధములైన నీమాటలు నిన్ను బోలిన నీ యనుయాయులే మెచ్చుకొనవలయును గాని, ఈ సభలో పెద్దలకు గాని ఇతరులకు గాని అంగీకారములుగావు.

నీతో వాదించుటకు నాకిది సమయముకాదు ఆవశ్యకతయూ లేదు. విషయ ప్రాముఖ్యమును బట్టి నామాటలను మఱికొన్ని నీ శ్రేయస్సుకొఱకై నుడువవలసియున్నది. రాజ్యస్వామ్యము సంపూర్ణముగ నీదే అంటివి. నీతండ్రి పుట్టుగ్రుడ్డి. పాలన కనర్హుడు. పాండురాజే లేకపోయినచో మీరీసరికి ఎచ్చటుందురో. నీ కర్ణుని బాసట చూచుకొని పాండవుల బలము తృణీకరించితివి. నీబలము నీ కర్ణుని బలము ఆనాడు అరణ్యములో గంధర్వులయుందేమైనది? విరాటుని గోగణాపహరణము చేయ నెంచిననాడేమైనది.” ఈ మాటలు వినిన దుర్యోధనాదుల గుండెలో ఏదో చురుక్కుమన్నది. కొంచెము నటు కదలి మరల యథాపూర్వము కూరుచుండిరి. శ్రీకృష్ణుని సంభాషణము సాగినది. “ఆనాడు నిండుసభలో మహాపతివ్రత నీకు మాతృసమానురాలు ద్రౌపది నవమానించినవాడవు. తత్ప్రతీకారమెచ్చటికి పోవును. ధర్మజుని సహాయము నీవూహించుకొనలేకున్నావు. వారైదుగురు దైవాంశ సంభూతులు. దిక్పాలురను మించినవారు. ధర్మదేవత ధర్మరాజలిగినచో జగత్ సంక్షోభమే యగుట తప్పదు. సంగ్రామమే యైనచో నీ తమ్ముని గుండె నెత్తురులు త్రాగుదునని నీతొడలు విరుగగొట్టుదునని భీముడు చేసిన ప్రతిజ్ఞ ఇంకను ఈ సభా భవనమున మార్మ్రోగుచున్నది. అర్జునుని గాండీవము విలయాగ్నిహోత్రమే. నకుల సహదేవులు దుర్వారవిక్రమములు. వారు యుద్ధక్షణమునకై నిరీక్షించుచు నిప్పులు గ్రక్కుచున్నారు.

వారిముందు త్రిభువనములేకమైనను ఆగవు నీ వెంత? నీబలమెంత? వారినెదుర్చుటకు నీకర్ణులు పదివేవురు పుట్టవలయును. భీష్మ ద్రోణులందువా? వారికి ధర్మజాదులును మీరును సమానులే. అయినను నీపెట్టి సంధికి ఒప్పుకొనవు. నీకర్మమట్లున్నది-" ఆ మాటలు విని దుర్యోధన కర్ణులు ఒక్కసారి పైకి లేవబోయిరి. శ్రీకృష్ణుడు ఒకింత కోపవివశుడైనను వారి నాపి "నాడు తెలియును నీవు ధృతరాష్ట్రవంశనాశనమునకు జన్మించితివి- తుదిమాట వినుము. నేటికి ఏడెనిమిది దినములకు అమావాస్య వచ్చును. ఆ పుణ్యదినమున భండనంబు కావలయును."

శ్రీకృష్ణుని మేఘగంభీర భాషణధ్వనులు సభాభవనములందు మారుమ్రోగుచునే యున్నవి. దుర్యోధనుడిప్పటికైనను మారునా అని కురువృద్ధులు ఆచార్యులు వానిపైన ఆసక్తితో చూచుచున్నారు. కర్ణ దుర్యోధన దుశ్శాసన శకుని వర్గములలో ఏదో గుసగుస ప్రారంభమైనది. "ఈ పెట్టి గొల్లడేమేమియో వదరుచున్నాడు. తగినశిక్ష కావలయును." అను దుర్యోధనుని మాట అస్పష్టముగ వినబడినది. ఎందులనో వారు నల్వురు వేగముగ బయటికిపోయిరి ఆ వెను వెంటనే ఒక పెద్ద పగ్గముతో వచ్చి శ్రీకృష్ణుని చుట్టుముట్టి బంధించి బయట కీడ్చుకొనుపోవ ప్రయత్నమారంభించిరి. భీష్మ ద్రోణాదులకు వెఱగయ్యెను. "ఆహా! సంధి రాయబారమునకేతెంచిన రాజదూతకిదియా సత్కారము. ఈ దుష్టుడు తన నెత్తికి

కొలుపు తెచ్చుకొనినాడు. ఇక సర్వనాశనమే. ఇట్టిభావము లావృద్ధుల మనస్సులలో అంతములేని అలలవలె లేచుచున్నవి. సభ సంక్షుబ్ధమైనది. ఈ కలవరమేమియని ధృతరాష్ట్రుడడుగగా విదురుడు జరుగుచున్నది నుడివెను. ఆ గ్రుడ్డిరాజునకు ఆపాదమస్తకము శరీరము వణకిపోయెను. తాను అడియుండే దుర్యోధనుని ఆటలు కట్టివేసినచో ఇంతవరకు రాదుగదా. తనను తానే వంచించుకొనినాడు తన అసమర్థతకిది ఫలము.

ఒక్కక్షణము శ్రీకృష్ణు డున్నచోట విలయాగ్ని జ్వాలలు లేచినవి. సహస్ర మార్తాండులవలె శ్రీకృష్ణుడు వెలిగిపోవుచున్నాడు. పంచభూతములచటనే ఉన్నవి. ఆదుష్ట చతుష్టయము ఒక అంగుళము ముందునకు వచ్చినచో భస్మము కావలసినదే; వచ్చినదారినే వారు పరువెత్తినారు. అది శ్రీకృష్ణుని విశ్వరూపము. ఆ దేవుని యనుగ్రహమున ధృతరాష్ట్ర భీష్మ ద్రోణ విదురులకు దివ్యదృష్టి కలిగినది. ఆ విరాట్ స్వరూపమును వీక్షించి పాహి పాహి యని వారు చేతులు జోడించిరి. మఱుక్షణములో యథాపూర్వ దృశ్యమే సభయందున్నది. సభ ముగిసినది. శ్రీకృష్ణుడు పెద్దలకడకేగి సెలవు గైకొని యేగెను.

ఆనాడే శ్రీకృష్ణుడు పాండవుల తల్లి కుంతి కడకేగి ఆమెనోదార్చి పాండవులకు మంచిదినములు వచ్చినవని నుడివి ధైర్యము గొలిపినాడు. మార్గమందు కర్ణుని గలిసి "నీవు నిజ

ముగ సూతుడవుగాదు. కుంతికి ప్రథమ పుత్రుడవు. ధర్మజునకు అగ్రజుడవు. కౌరవులను వీడి పాండవులను జేరుము. నీకు వారు బ్రహ్మరథము పట్టుదురు. నీవే హాస్తినాపుర చక్రవర్తి వగుదువని యెంతో బోధించెను." కర్ణుడు స్వామిభక్తిపరాయణుడు. శ్రీకృష్ణుని మాటలు వినడు.

సంధి రాయబారములకేగిన శ్రీకృష్ణుడు సమరమును ప్రకటించి ఉపప్లావ్యపురమునకేతెంచి ధర్మజునకు సర్వము నివేదించినాడు. ధర్మజానుజులు సాత్యకుల మొగమునందుత్సాహము పదింతలయినది. తమ ఆయుధములవైపు గౌరవ మర్యాదలతో చూచుకొన్నారు. ద్రౌపది మొగము విడినది. ఉత్సాహోద్రేక పూరితులయిన తన పతులను చూచినంతనే ఆమెకు పట్టరాని సంతోసము కల్గినది. శ్రీకృష్ణదేవునకు నమస్కార మాచరించినది. ఆ స్వామి చిఱునవ్వి ఊరకొనినాడు. ధర్మజుడు 'ఆహా! యుద్ధము తప్పలేదుకదా' అని మనస్సులో ననుకొని శ్రీకృష్ణునిజూచి "మహాత్మా మాకీ సమరము కుల వృద్ధులతోడను గురువులతోడను జరుగనున్నది. వారు అజేయ వీరులు, ఇక నీవే ఉన్నావు. మా కాలంబము" అని నుడువు నంతలో శ్రీకృష్ణుడందుకొని "విధి నిర్ణయము జరుగవలసినది జరుగుచున్నది. మీకు మంచిదినములివి. ఆలస్యము లేక భావి కర్తవ్యము నూహింపుడు." అని చెప్పి అర్జునివైపు మందహాసుడై చూచెను.

కౌరవ పాండవ సంగ్రామవార్త వాయుప్రేరితదవానలమువలె నలుదిక్కులకు ప్రాకినది. అటు కౌరవులు ఇటు

పాండవులు వారి వారి బంధువులకు మిత్రులకు అభిమానులకు వార్త నంపిరి. ఒక వారము దినములకన్న వ్యవధి లేదు. రావలసిన రాజన్యులు సైన్యములతో హుటాహుటి వచ్చి వారి కూటమును జేరవలయును—

ఏక్షణమున శ్రీకృష్ణుం డాకురుసభలో అమావాస్య నాడు సంగ్రామమగునని ప్రకటించెనో ఆక్షణమునందే ఆతడు విశ్వసంక్షేమార్థము చేయనున్న మహా గీతోపదేశమునకు బీజము పడినది.

## 4. కురుక్షేత్ర రణరంగము

హస్తినాపురమునం దానాడున్న సంచలనము ఎన్నడును కని విని యెఱుగనిది- శ్రీకృష్ణుడు పాండవుల దూతగ వచ్చి నలువురితోడను మాటలాడి తిరిగి ఉపప్లావ్యమున కేగెను. సంధి రాయబారములు విఫలమై సమరము నియశ్చ మైనది- ఎవరినోట జూచినను ఈమాటయే. ప్రజావాణి కడ్డు లేదుగదా. ఎవరికి తోచినటుల వారూహ సేయుచున్నారు. ఇన్నినాళ్ళను తమయెదుటనున్న భీష్మ ద్రోణ కర్ణుల బల సాహసము లెఱిగినవారికి, అరణ్యాజ్ఞాతవాసములు విజయవంతముగ నొనర్చి బయటికివచ్చిన పాండవుల పాటవముగూడ కొంచెము కొంచెము తెలియవచ్చినది. బాధపడిన వారివైపునకే ప్రజాహృదయము మొగ్గును. విశేషించి శ్రీకృష్ణుడు పాండవపక్షమని తెల్లమైనది- పాండవుల విజయమున కడ్డు

లేదను అభిప్రాయము బలపడి అంతకంతకు దూరదూరముల కల్లుకొనిపోయినది.

దుర్యోధనునకు సహాయమొనర్ప నెంచినవారు వారి వారి చమూసమూహములతో హస్తినకు వచ్చుచున్నారు. పాండవాభిమానులు ఉపప్లావ్యమున కేగుచున్నారు. ఇరువారు లందును యుద్ధ సన్నాహములు నిముషములమీద జరుగు చున్నవి. వీరి వేగులవాండ్రచటికి వారి రహస్యములను వారి వేగులవాండ్రు వచ్చి వీరి రహస్యములను తెలిసికొని వారి వారి నాయకుల కందజేయుచున్నారు- అటునుండి వారు ఇట నుండి వీరు పుణ్యక్షేత్రమైన కురుక్షేత్రము సమర రంగముగా కదలి వెళ్ళుచున్నారు. ఉత్తర భారతమంతయు ఒక మహా సైన్యసాగరముగా నున్నది. ఇంకను వచ్చువారు వచ్చుచునే యున్నారు-

శ్రీకృష్ణుడు వచ్చి వెళ్ళిన క్షణమునుండియు దుర్యోధనునకు గుండెలలో ఏదో దిగులుగానే ఉన్నది. సభామధ్యమున తన పరాభవముల నెత్తిపొడిచినాడు. పాండవ బలము నగ్గించినాడు. ఉన్నది రెండు దినములు హస్తినను మూలముట్టుగ కదల్చి వెళ్ళినాడు. కర్ణుడు తా నున్నచోటికి వచ్చుటతో దుర్యోధను డొకింత ధైర్యము తెచ్చుకొని కూర్చొనినాడు. కర్ణు డజయ్య పరాక్రమముడే యగును. తన లోపములు తా నెఱుగును. కవచకుండలములను తన ప్రాణ భయమున కయిన జంకక దానమిచ్చినాడు. మీదుమిక్కిలి

ఏ వేవియో శాపములున్నవి. కదనమనగా కాలుదువ్వినంత సులభము గాదని కర్ణునకును తెలియవచ్చినది. అయినను బింకము వదలక దుర్యోధనున కుత్సాహము గొలిపినాడు. “మహారాజా ఇది చింతించుటకు సమయము కాదు. గంధర్వులతో పోరు, విరాటుని గోగ్రహణము అవి తాత్కాలిక సంఘటనలు. మనము యుద్ధమునకై పోలేదు. వినోదమున కేగిన విషయములు శ్రీకృష్ణుడు పెద్దగా చేసి వచించినాడంతియే. నావద్దనున్న శక్తియొక్కటి పదిమంది అర్జునుల పెట్టు. నేను ఆ ముదుసలి భీష్ముని తరువాత కదా యుద్ధమునకు వచ్చునది. మీరిప్పుడు భీష్మద్రోణులను చూడుడు” అనిన కర్ణుని మాటలు దుర్యోధనునకు నచ్చినవి.

ఆనాటి రాయబార సభలో భీష్మద్రోణులు తనకు సుముఖముగా నున్నటుల కనుపట్టలేదు. ఇప్పుడు యుద్ధభారమంతయు వారిమీదనే యున్నది- కురుపతి మున్ముందు భీష్మునొద్ద కేగి అభివాదనము చేసి ఉచితాసనుండయి, “తాతా మనకుటుంబ వ్యవహారము పాండవులతోడి సమరము వరకు వచ్చినది. ఈనాటి వరకు మమ్ములను కాచుకొని యుంటివి. ఎవ్వరేమనుకొన్నను విధి యిట్లు లాగుకొని వచ్చినది. ఇదిదో చూడుము. మన బలము పదునొకండక్షౌహిణులకు పదునొకండ్రు అధిపతులు- ఇక నీ యుద్ధభారము నీయదనే. వీరి నేకోన్ముఖముగ సంఘటించి శత్రువుల ఢీకొనవలయును. యుద్ధమిక రెండుదినము లున్నది. నీవు సర్వ

సేనాధిపత్యము గైకొనవలయునని ప్రణామము లాచరించెను." భీష్ముడనుకంపతో మనుమని జూచి "దుర్యోధనా, నాకు మీరును పాండవులొక్క రూపు. మీ నిమిత్తము ఈ సమరము వచ్చినది. నేను మీవైపున సర్వసేనాధిపత్యము వహింతును. ఇన్నినాళ్లు ఇచ్చటనే ఉన్నందులకు, నాకు కర్తవ్యమిది. నాకు జాలినవారెవ్వరును లేరు" అనినంతనే దుర్యోధనుని ప్రాణములు లేచి వచ్చినవి. సామంతుల నెల్ల పిలిపించి, తీర్థ జలముల దెప్పించి, పురమెల్ల మంగళతోరణములు దీపికాతతులతో నలంకరింప జేసి కృప ద్రోణాదుల సమక్షమున బాహ్లికాది కురువీరులు ముదమంద గాంగేయునికి సర్వసైన్యాధిపత్యాభిషేచనము విధి విహితముగ జరిపించినాడు- యుద్ధ కార్యక్రమము కౌరవుల పక్షమున ఆరంభమైనది. భీష్ముడు పేరు పేరున తమ పక్షమున నున్న వీరుల సామర్థ్యములను అస్త్రాలను నిర్ణయించి కురుపతికి జెప్పినాడు. కర్ణుని అర్ధరథునిగనే నిర్ణయించినాడు. వానికి గల శాపములు కవచకుండల రాహిత్యమును బట్టి అట్లగునది. ఈమాట వినుసరికి దుర్యోధనుని గుండె ఒకింత దడ దడలాడినది. పాండవ వీరుల బలాబల నిర్ణయమును జరిగినది. అట నందఱును అతిరథోత్తములు, అతిరథులు, మహారథులే.

సైన్యములు యుద్ధ సన్నద్ధములైనవి - రణభేరి మ్రోయించుటే ఆలస్యము. దుర్యోధనునకు కొంత ధైర్యము వచ్చినది. ఉలూకుడనువానిని ధర్మజు కడకుబోయి "మేము

సంగ్రామమునకు సిద్ధముగా నున్నాము. మీకొక అంగుళమైనను రాజ్యభాగ మిచ్చునది లేదు. బలమున్నచో సంగరమునకు రమ్ము, పెద్దమాటలు చెప్పుట కాదు" అని తన మాటగా చెప్పుమనియెను. ఉలూకు డేగి సభామధ్యమున ధర్మజునకీమాటలు నుడివెను. "ఓహో! అటులనా, దుర్యోధనుడు సోదర బంధు పరివార సహితముగ చచ్చువరకు ఈ యుద్ధ మాగదు. రేపే బవరంబని" కృష్ణార్జునులు క్రోధాయత్త చిత్తులై నుడివిరి. దూతగ సంభావించి ఉలూకునకు ధర్మజుడు తాంబూల వస్త్రాభరణములిచ్చి వీడ్కొలిపెను. ఉలూకుడు తిరిగి వచ్చి చెప్పిన పాండవుల వాక్యములు కురుపతి వినినాడు. బలములను వెంటనే కురుక్షేత్రమునకు నడిపింపుడని మొదలపెట్టి దుర్యోధనుడు భీష్మునితో కలిసి తన సేనానాయకులతో గూడి తానును కురుక్షేత్రమున కరిగి తగినరీతి శిబిరముల నేర్పఱచెను. తల్లిదండ్రులతో చెప్పి యుద్ధమున కరుగుటకు దుర్యోధనునకు తీరికయే లభింపలేదు.

హస్తిన నుండి ఉపప్లావ్యమునకు వచ్చిన శ్రీకృష్ణుడు అచ్చట జరిగిన సర్వ విషయములను ధర్మజునకు పూసగ్రుచ్చినట్లు నుడివి ఇక సమరము తప్పనిసరి యనినాడు. ఎంత ప్రయత్నించినను దుర్యోధనాదులతో పొందు కుదర లేదు గదా యను చింత ధర్మజుని మనసు నుండి వదలలేదు. శ్రీకృష్ణుడంత ధర్మజు దిక్కు మొగంబై "ధర్మజా! ఆది నుండియు దురోధనుండొనర్చిన సేతలకు తుట్టతుది యుద్ధము

గాక వేఱొకడగునా. ఇందేదియో పాపమున్నదని నీశంక. అట్టిదేమియు లేదు. ఈ విషయము నేను హాస్తినలో పూర్ణముగ చర్చించినదే. దుర్యోధనుని వర్తనము విదుర భీష్మ ద్రోణ బాహ్లీకాదులు నిరసించిరి. మీ మాతృదేవి కుంతియు కౌరవులకెంతయో చెప్పినది. ఇక పాపమెక్కడిది. పాపమును బాపుటకే మీరు యుద్ధ మొనర్పవలయును. బలాబలములా, భీమార్జునులిరువురును జాలు కౌరవుల నుక్కడంచుటకు" అనగనే ధర్మజునకు మఱియొక మార్గమే కనుపడ లేదు. వెంటనే శ్రీకృష్ణుడాదిప్రముఖు లందఱి సమ్మతిని వరమున బుట్టినవాడు ద్రౌపది సోదరుడు సర్వసమర్థుడు నగు దృష్టద్యుమ్నునికి సర్వసేనాధిపత్య పట్టాభిషేకము విధివిహితముగ నొనర్చి సర్వసేనలను కురుక్షేత్రమునకు నడిపింపుడని తనకు సాయమునకుటకు వచ్చిన ఏడక్షౌహిణీ పతులకు యాజ్ఞ నిచ్చెను.

సైన్యముల నాయత్తముజేసి మున్ముందు యుద్ధరంగమున కంపినది దుర్యోధనుడే. రాయబారానంతరము శ్రీకృష్ణుడుపప్లావ్యమున కరుదెంచిన పిదప మఱికొన్ని తర్జనభర్జనలు జరిగిన తరువాత పాండవబలములు కదలినవి.

సంధి రాయబారములు విఫలమైనవి. కౌరవ పాండవ బలములు దిక్కులకు వ్యాపించు మహాసైన్యములతో నేగి కురుక్షేత్రమున మోహరించియున్నవి. ఇరుపక్షములు తన కాప్తులు విశేషించి భీమ దుర్యోధనులు గదాయుద్ధమున తన శిష్యులు. ఒకరినొకరు పొడుచుకొను ఈ యుద్ధమును తాను

కన్నుల జూడలేను. బలరామునకీ దుస్సంఘటనము దుర్భర
దుఃఖము కలిగించినది– ఇరు వాగులకును సంధి యొనర్చుట
మేలని తానెంత జెప్పినను కృష్ణుడట్లు జేయలేదు. కృష్ణుని
సహాయ్య సంపదలున్న పాండవ పక్షము జయించును.
కౌరవులు నాశనమగుదురు. బలరాముడు ఇది యెఱుగును.
పాండవులున్న చోటికి కరుదెంచి కృష్ణ ధర్మజాదు లెల్లరచే
పూజితుడై తన హృదయ బాధ వారి కెఱింగించి, అన్నిటికిని
సమర్థుడు కృష్ణుడుండెను గదాయని ధర్మజునకు జెప్పి తానా
స్థలమునుండి దూరముగ సరస్వతీనదీ తీర్థయాత్రకు బోయెను–

కార్తీక మాసాంతమది. దినములు చల్లబడినవి.
సూర్యుడస్తంగతుడై సాయం సంధ్యారాగములు పశ్చిమ
దిగ్భాగమున నుండి ఉత్తుంగముగ లేచి గగనమును క్రమ్ము
చున్నవి. ఆనాటి సంధ్యాకాంతు లందేలనో బంగారువన్నియ
లంతగా లేవు. ఏ ప్రక్క జూచినను రక్తకషాయ దీధితులు
ప్రబలు చున్నవి– కురుక్షేత్రము నందు ప్రాగభిముఖముగ
పాండవ బలములు చేరినవి. సేనానాయకుల ఆదేశానుసా
రము దండనాథులు వారి వారి సైన్యములకు శిబిరములు
అభ్యాస విన్యాస స్థలములు ఏర్పాటు చేసికొనుచున్నారు.
తూర్పు నుండి పశ్చిమ ముఖముగ వచ్చిన కౌరవ బలములు
వారి వారి స్థావరముల నల్లంత దూరములో నిర్ణయించు
కొనుచున్నారు– ఇరువాగుల సంచలనమునకు లేచిన
భూరజము ప్రాక్పశ్చిమముల నుండి భూనభోంతరముల

వ్యాపించుచున్నది- కౌరవుల వైపునుండి నిబిడ నీల భయంకర ధూమాంబుదములు పర్వత శ్రేణులు కదలి వచ్చుచున్నట్లు పశ్చిమ దిశకు వచ్చుచున్నవి. ఆ వచ్చుచున్న ధూమాంబుదములను చీల్చి చరమ సంధ్యా కషాయరాగ మయూఖములు ఖడ్గములవలె దూసికొని పోవుచున్నవి. అజ్ఞానాంధ తమస్సులను జీల్చు జ్ఞానమరీచికలవలె ఆ సాయం సమారంభ సంధ్యాగుణిమలు దుర్వారముగ నభోవీధుల నాక్రమించినవి-

ధర్మజుని ఆదేశములందుచే తడవుగ సర్వపాండవ సైన్యాధిపతియైన దృష్టద్యుమ్నుడు తన విధుల యందప్రమత్తుడై విశాల సమరాంగణమున విద్యుద్రేఖవలె తిరుగుచున్నాడు. వచ్చుచున్న సైన్యములు వచ్చుచున్నట్లే తమ నిర్ణీత స్థలముల కేగవలయును. ఆ సేనాధ్యక్షుని యాదేశములు దూరశ్రవణ యంత్రములద్వారా ప్రసారము చేయబడుచున్నవి. ఈ నిముస మిచట నుండును మఱు నిముసములో ఎంతయో దూరమునుండి ఆస్వరము వినిపించు చుండును.

మునిమాపు చిఱు చీకటులు క్రమ క్రమముగ దట్టమగుచున్నవి. సైన్య సమీకరణముల నుండి వచ్చు కాంతులా చీకట్లను మ్రింగివేయు చున్నవి. రథిక భటుల కరదీపికల వెలుగులో, రథము లందమర్చబడిన మణిస్థగిత కనక ఫలకములు, వివిధ వర్ణచిత్రములు, పదాతుల చేతులలోని కరవాలములు, గజ తురగముల భూషణాంబరములు ప్రతిబింబిత కాంతులతో మఱింత ప్రకాశించుచు సైన్యములకు మధ్యనున్న మార్గములు

ప్రస్ఫుటముగ గన్పడుచున్నవి. పదాతులు అశ్వికులు సారథులు గజారోహకులు ఎవరి పని వారిది. ఒకరితో నొకరు ఏ నిముసమో మాట్లాడవలసి వచ్చినను పొరుగు వానికి వినబడకుండ జరుగును.

ఆ సమయమున పాండవ చమూసమూహ ముఖ్యమార్గము వెంబడి ఇరువురు వ్యక్తులేమేమియో మాటలాడుకొనుచు బోవుచున్నారు. ఒకసారి దూరమున గాన్పించు ఎదిరితెగవారి సైన్య సమీకరణము జూతురు. వెంటనే వీరి సైన్య సముదాయమును వీక్షింతురు. వీరి వ్యూహము మధ్యమున ఉబ్బెత్తుగ రెండు పైపులను ప్రక్కలకు వంగి అర్ధచంద్రాకారముగ నున్నది. ఎదుటివారిది మధ్యభాగ మొకింత లోతట్టుగను దక్షిణ వామాగ్రములు ముందునకు వచ్చినటుల నున్నది- ఇవి రెండు విధములైన వ్యూహములు- వీరున్న వ్యూహమే పటువుగ దోచినది వీరికి. ఎదిరితెగ నుండి ముందునకు వచ్చు వారిని వచ్చినట్లుగ రెండు ప్రక్కల నుండియు వేగముగ చుట్టుముట్టి మట్టుబెట్ట వచ్చును. ఇట్లు మాట్లాడుకొనుచు వచ్చుచున్న వారిలో ఒకడు మేఘ శ్యామలాంగుడు. మొగమున మహాతేజస్సంపన్నుడు. మఱొకడు బంగారు వన్నెగల ఆజానుబాహుడు, మొగమున రాజకళ దుర్నిరీక్ష్య ప్రకాశమానమై ఒప్పుచున్నది- పాండవ బలములకు మూలస్థంభములగు కృష్ణార్జునులు వారే- తమ సంభాషణమును కృష్ణుడిట్లు మొదలిడెను.

"అర్జునా! నీ వూహించినట్లు దృష్టద్యుమ్నుడు మన సర్వ సేనాధిపత్యమునకు సర్వవిధముల దగినవాడు. ఒక అర్ధ దినములో సైన్యము నెంతె పాటవముగల వ్యూహముగా పన్నినాడో చూచితివా. ద్రోణవధార్థము అగ్నికుండమున జన్మించినాడు. అతనితో బాటుగ నతని రథ రథ్యములు ధనుర్బాణములు తను త్రాణ ఖడ్గములు గూడ ప్రాదుర్భవ మందిన మహానీయుడు. అనుభవశాలి మహావీరుడున్నైన భీష్ముడట సేనానాయకుడనిన భయమును లేదు. భీష్మున కెదురు శిఖండియు మనపక్షమే.

అర్జు : కృష్ణా! ఈ యేర్పాటు నీ అనుమతితో జేసినదేగదా. నీ సమర్థనము నాయూహకు బలమిచ్చినది. అన్నగారును అట్లే నిర్ణయించిరి.

కృష్ణు : దానికేమి. రేపటిమాట చూదుము. ఆనాడు నీవు ద్వారక కరుదెంచి, దుర్యోధనుడు మహాబలవంతులైన గోపబలమును తనకు సాయముగ కోరుకొనగా, నీవు నన్నే కోరితివేల? నేనేమి యుద్ధమొనర్తునా. బొమ్మవలె రథమునందు కూరుచుండువాడనే.

అర్జు : నే నాలోచించియే అట్లు చేసితిని కృష్ణా- మాయన్న భీమునకును నాకును కౌరవుల నొకమూలకు తేగలిగిన బల సామర్థ్యము లున్నవి. మాయత్నము సఫలమగుటకు వలయు దైవబలము నీవుగా నాకు దోచినది.

మొదటి నుండియు నన్ను వెనుక నుండి కాచుచున్నది. నీవేకదా- ఈనాడు నాకు నా రథివై జయము గూర్చుము. నీ వధివసించి యున్న నా రథము మధ్యాహ్న మార్తాండ ప్రభాసన్నిభమై శత్రువుల గుండెలు మండించును. అది చాలు-

ఇట్లు సంభాషించు కొనుటలో వారి శిబిరములు చేరువైనవి- అచ్చటనే అర్జునుని రథము సముచిత సమరాలంకారములతో ప్రకాశమానముగ నున్నది- ఆ ప్రక్కనే రథమున కాయత్తపఱుపబడిన ధవళవర్ణ హయములు బలిష్ఠావయవ శోభితములై దీపాకాంతుల యెదుట తళతళ మెఱయుచు పాల సముద్రమువలె కనులకు విందుగనున్నవి. వారిరువురిని చూచుటతోడనే ఆ యశ్వముల ముఖములు వికసించి ఒక నూతనహర్షము వానికన్నులలో మెఱసి అనుమోదకరములైన సంజ్ఞ లొనర్చుచున్నవి- శ్రీకృష్ణుడు వానివద్దకేగి స్కంధము లనురాగపూర్వకముగ తట్టి నడుములు నిమిరి, పరిచారకులు తెచ్చిన మేలిరకపుదాణాను తనహస్తములతో దినిపించి స్వచ్ఛమైన జలముం బ్రీతితో ద్రావించెను- ఆ యశ్వముల కనులలో ఏనాడును లేని తృప్తి ఆనాడు దీపించినది-

శ్రీకృష్ణుడు మరల అర్జునుని జూచి

"అర్జునా! అన్ని యేర్పాటులును అనుకొనినట్లు బాగుగ నున్నవి- నీ రథకేతనము సిద్ధముగ నున్నది గదా! అనునంతలో అర్జునుని మొగము ఏదో భక్తిభావమున

వెలుగొందినది. ఒక ముహూర్తమాత్రము కనులు మూసినాడు. ద్రౌపది కోరికపై వెనుక నొకనాడు భీముడు సౌగంధిక పద్మముల తెచ్చుట కేగునాడు మార్గమధ్యమున హనుమంతుడు ప్రత్యక్షమై తాను అర్జునుని రథకేతన చిహ్నమై విజయము నాపాదింపగలనని చెప్పినాడు.

నిరంతర రామనామ జపతత్పరుడు, అజేయపరాక్రముడు అయిన ఆ హనుమంతుని దివ్యరూపము అర్జునున కా క్షణము కనులలో మెఱపినట్లయినది. చేతులు మోడ్చి శ్రీకృష్ణునితో "సిద్ధముగానే ఉన్నది కృష్ణా- కపి మహావీరుడు, శ్రీరామ భక్తుడు అయిన హనుమదంకితమగు ఆ విజయకేతనమును ఎల్లి నీవే నారథముపై నెత్తవలయును" అనినాడు.

శ్రీకృష్ణుడు చిరునవ్వి "అవునులే భాగ్యవంతుల కన్నియు అట్లే సమకూడును- అగ్నిదేవుడిచ్చిన గాండీవమూ, పరమేశ్వరు డొసగిన పాశుపతాస్త్రమూ, కపిరాజు కేతన చిహ్నమూ" అని యేమో అనునంతలో అర్జునుడు "కృష్ణ దేవా! అన్నిటికన్న నా రథముపై నీవు సారథివై యుండెదవు అది నాభాగ్యము" అని నమస్కరించెను-

"మన సంభాషణ విఁక చాలు. ప్రొద్దుపోయినది- పెద్ద బావగారు మనకై వేచియుందురు. వారి తుది ఆదేశము లేవియో వినవలయునను" అని మందహాసవదనుడై నందనందనుడు విజయుని బుజము తట్టుచు ధర్మజుని శిబిరమువైపు నడచినాడు.

# 5. సంజయునకు దివ్యదృష్టి

ధృతరాష్ట్రుడు తాను దేనికి భయపడుచుండెనో ఆ కురు పాండవుల యుద్ధము దాపురించినది. ఆ గ్రుడ్డి రాజునకు పుత్రమోహ మెంతకలదో భీమార్జునులనినచో అంత గుండె బెదురు- ఇట్లు చింతాకులుడై, సంజయ సహితుడై యున్న యా కురుపతి కడకు వ్యాసమహర్షి చనుదెంచెను. ఏక రాశిగనున్న వేద సూత్రములను విషయాను సారముగ నాలుగుగ వింగడించి బ్రహ్మసూత్రములను రచించి ప్రపంచ మున కొసగిన మహాత్ముడా ఋషీంద్రుడు, త్రికాలవేది-వ్యాసుడు వచ్చినపుడెల్ల దుర్యోధనాదులకు హితబోధ చేయు చునే యుండెను. ఆ మంచి మాటలు వారి తలకెక్క లేదు. పాండవులు వనవాస మందున్నపుడేగి సత్పురుషులకు మంచి దినములు తప్పక వచ్చును ధైర్యము వీడకుడని ఉత్సాహము గొల్పుచుండెను. తాతగారికి యథోచిత సత్కృతులాచరించి అగ్రాసనాసీనుంజేసి పెద్దమనుమ డీరీతి తన గోడును చెప్పి కొనెను-

తాతా, నీవుద్ధరించిన కురువంశమునకు పతన మాసన్న మయినది. దుర్యోధనుని దుర్నయమూపలేని అసమర్థుడనైతిని. పాండవ కౌరవుల ఖండనమ్మొల్లి కానున్నది. దీనినాపువారు లేరు. అన్యోన్యము కుమారుల మధ్య జరుగు ఈ క్రూర హింసాకాండను కన్నులున్నను నేను చూడజాలను. అచ్చట ఎప్పుడేమి జరుగుచున్నదియు మాత్రము వినున ట్లనుగ్ర హింపుము. నీవు త్రికాలవేదివి. యుద్ధపరిణామ మెట్లుండు

నోయని ధృతరాష్ట్రుండూరకుండెను. వ్యాసు డామనుజేంద్రు జూచి, ధృతరాష్ట్రా! ప్రజాక్షయకాల మాసన్నమైనది. నీ సుతుని దుర్ణయము నీవు మాన్పలేక పోయితివి. దుర్యోధనాదుల దెసనుండి అన్నియు దుశ్శకునములే. ఆయుధముల నుండి నీల ధూమంబు లెగయుచున్నవి. పాండవుల దెస వాయువులు మధుర గంధవహములై వీచుచున్నవి. భేరీ ఘోషణమ్ములు శుభస్వర సంయుతములై వహ్నులు హోమ కాల పుణ్యగంధమ్ము లెగయుచున్నవి. అయినను సమరమ్మున జయమ్ము దైవాధీనము. పాకము దప్పిన రాజ్యమ్మున నీ కింకను ఆశయేల. "ధర్మోజయ" అనుచు నొకచో గూర్చుండుము. నేనిచ్చు దివ్యదృష్టి ప్రభావమ్మున సంజయుడు యుద్ధరంగమున ఎవ్వరికిని కానబడకుండ రేబవలు దిరుగుచు తత్ద్విశేషమ్ములు నీకు దెలుప గలడు– సర్వమానవ సమాజమునకు ధర్మాధర్మములు సుస్పష్టముగ దెలుపునట్లు కురుకుల చరిత్రమును మహా భారతాఖ్యతో పంచమాగమంబుగ నేను వెలయింతు" నని వ్యాసు డంతర్ధాను డయ్యెను–

వ్యాస మునీంద్రుని వాక్ప్రభావము వలన సంజయునికి దివ్యశక్తు లలవడినవి. ఇచట నచట యను విచక్షణ లేదు. ఒకరికంట బడకుండ కానెచటికైన నేగగలడు. అదృశ్యుడుగనే యుండి నలుమూలల యుద్ధ దృశ్యముల సర్వము చూడ గలుగుటయే గాక రణరంగమున నున్నవారి యింగితముల గూడ నెఱుంగజాలును.

తపస్విసత్తమలైన మహాఋషుల అనుగ్రహము లట్టిండును. వ్యాసఋషి భగవత్సన్నిభుడు. ఏది యెట్లు జరుగవలెనో అట్లు నిర్దేశించును. సంజయుడనగా సమ్యక్ జయము గలవాడని భావము. ఆ హేతువు చేతనే వ్యాసుడాతని కీశక్తినిచ్చెను. ఎందుల కీశక్తి లభించినదో అందులకే దానిని వినియోగించు స్థితినిష్ఠు డాతడు.

## ౬-౧. అర్జున విషాదయోగము

ధృతరాష్ట్రుని కొక నిరాశ చిత్తమునందావరించినది. ఏవిషయము పైనను మనస్సు నిలువదు. జగత్ప్రాజ్యాడు తమ శ్రేయోభిలాషియు నగు వ్యాస మునీంద్రుడు చెప్పి వెడలిన విషయములు తన నిరాశను మఱింత ఎక్కువ జేసినవి. ఒకింత ధైర్యమూని యా కురుమహీపతి చేతితో తడవి చూచుకొని "సంజయా మంచి చెడుగుల రాపిడులతో నామనస్సాక కట్టిడి రాయియైనది. ధర్మక్షేత్రమైన కురుక్షేత్రమునందు నావారును పాండవులును చేరి యుద్ధమొనర్ప సిద్ధముగ నున్నారు. ఎట్టి కష్టపు పలుకైనను గారియుపెట్టని స్థితిలోనున్నాను. నీ వా సంగర రంగమున కేగి ఇరుతెగల సమాచారమును, ఏయే రీతుల సంగరము సాగుచున్నదియు చూచి నాకు తెలియజేయు చుండవలసినదని వీడ్కొలుప, సంజయు డంబికానందనునకు నమస్కరించి చిత్తము వ్యాసభగవానుని యందు నిలిపి కురుక్షేత్రమున కేగెను.

సంజయుఁడా సంగరరంగమున కేగి తిరిగి వచ్చి నుడివిన విశేషము లిట్లున్నవి-

మహారాజా! ఏకాదశాక్షౌహిణీ బంధురమైన కౌరవ బలము సప్తాక్షౌహిణీ బంధురమైన పాండవ బలము ఒకదాని కొకటి యెదురుగ మోహరించి యున్నవి- ఆ సైన్య సమూహము తరంగ ఘోషాకులితమైన ఒక మహార్ణవము వలె నున్నది. ప్రభాత సమయమైనది. యుద్ధారంభమున కింకెంత యోసేపు పట్టదు-

అ. శ్లో॥ ధర్మక్షేత్రే కురుక్షేత్రే సమవేతా యుయుత్సవః।
మామకాః పాండవాశ్చైవ కిమకుర్వత సంజయ॥

సమర వేషభూషణాలంకృతులై చతురంగ బలములతో వీరులెల్లరు తమ తమ నిర్ణీత స్థానములందుండి నాయకుల ఆదేశముల కెదురు చూచుచున్నారు. అక్షౌహిణీపతులు ఉప సేనాపతులు వారి వారి అనుయాయులకు సంగరోత్సాహ వాక్య నినాదములతో ధైర్యము నొసంగుచున్నారు.

గగనవీధుల కెగయు చిత్ర చిత్ర వర్ణపతాకములు హయ హేషా ఘోషలు గజబృంహిత స్వనితములు పదాతి జనము లటు నిటు త్రిప్పు కరవాలముల తళతళలతో, కొందఱి చేతులందున్న శూల పరశు ఢక్కా-డమరు కృపాణాదుల కదలికలు ఆ సైన్యాబ్ధి ఘనతరంగములవలె ఒకదాని వెనుక నొకటి లేచుచున్నవి.

మన సేనకు ముందుగ శ్వేతచ్ఛత్రలాంఛనుడు, వజ్రరుచివ్యాప్త సువర్ణతాళ చిహ్నిత కేతనుడు గాంగేయుడు సమర వస్త్ర విభూషణ భూషితుడై మణిఖచిత కిరీటధారియై కాంచన రథారూఢుడై మన సైన్య వీరుల పురికొల్పుచు ముందునకు వచ్చెను- ఆ మధ్యందిన మార్తాండుని వలె వెలుగు ఆ మహావీరుని కిరుప్రక్కలను కాంచనమయ వేదికా కనత్కేతను డాచార్యవర్యుడు, కనక గోవృషకాంతి మత్పతాకవిభవుడు కృపుడు, మణి సింహలాంగూల చిహ్నితధ్వజు డశ్వత్థామ, రత్నరాజిత కదళికాంకిత పృథుకేతనుడు మద్రపతియు రథారూఢులై కదల, తక్కుంగల యోధాగ్రేసరులు భగదత్త సోమదత్త బాహ్లిక సుదక్షిణ బృహద్బల నీల సుశర్మలును, సాల్వ సౌవీర శూరసేనాభీర యవన వసుధాధీశులును, ఆత్మీయ చతురంగ బలములతో నిజధ్వజ విరాజమానులై వినూతన వస్త్రాభరణ విభూషితులై రథారూఢులై పదియక్షౌహిణుల నడిపించుకొని యుద్ధవ్యూహమున నుండ పదునొకండవ అక్షౌహిణితో శ్వేతచ్ఛత్రములతో గంధసింధురము నెక్కి బహురత్న ప్రభా భాసురమ్మయిన భుజంగకేతనమ్ము మెఱయ తన యిరుకెలంకుల దుశ్శాసన దుర్మర్షణ వివింశతి వికర్ణాదులు వెంట నడువ కురుక్షోణీ విభుడు నీ ప్రథమ సుతుడు దుర్యోధను డరుదెంచెను- ఇట్లు భీకరాభీల సమ్మర్దంబయి కౌరవ పక్షవాహిని అక్షీణ ధైర్య సాహసమ్ముల మోహరించి నిలచినది. తాతా! మఱి నీవెఱిగిన మాటయే

కదా భీష్మునకు యుద్ధరంగమున నున్నంతవరకు మన సుయో ధనునకు కుడిభుజమగు కర్ణుడు అస్త్రధారణ సేయక వెనుకనే యుండెను.

ఇక పాండవ బలాధిపతుల విజృంభణ విభ్రమ విలాసముల వినుము. గగనోత్తుంగ కేతనోజ్జ్వల కాంతులు వెలయ, చతురంగ బలములు సమరోత్సాహమున వెన్నంటి నడువ, జైత్రభేరీ వాద్యములు కులపర్వతముల దాకి ప్రతిరావముల నీన వెల్లగొడుగుల వెలుగు లంబరము గప్ప పాండవాగ్రజుడు యుధిష్ఠిరుండును, ఆ ప్రక్కనే పదాతి జన భూయిష్ఠ సైన్యముతో భీకర గదాయుధుడు, రోష కషాయిత నేత్రుడు, పర్వతసాను విశాల వక్షుడు, సమర క్రీడా సముత్సాహ విజృంభిత భుజాస్తంభు డుజ్జ్వలాకారుడై భీమసేనుడుండెను. ధర్మజుని కీవలిప్రక్క శ్వేతమత్తాశ్వముల పూనిన కనకాంచన మణిమయ రథమ్మున కపికేతన దీధితులు నభోభాగమున కంట ఇంద్ర చాపమ్మునుంబోని గాండివము ధరించి మఱియొకచేత స్ఫటిక ద్యుతిమంతమ్మగు దేవదత్తము వెలుగ అస్త్ర శస్త్ర సంయుత తూణీర ధరుండై అర్జునుండును, ఆ యరదంపు నొగలపై సూర్యదీధితుల దన్ను కిరీటకాంతులు దిక్కులాక్రమింప పాంచజన్యమును ధరించి వేఱొకచేత గుఱ్ఱపు పగ్గము లూనిన శ్రీకృష్ణుడు కదలిరాగ, రథారూఢులై అజేయబలులు కవలలును ఇరువైపుల అభిమన్యు ద్రౌపదేయులు తక్కంగల మహావీరులు ద్రుపద రాటవి

సాత్యకి చేకితానులును శిఖండియు ధృష్టకేత ఘటోత్కచులు, పాండ్య కేకయ కాశ కరూశాధీశులు మహారథుల్లై, విజయ భేరీ తూర్యనికాయనాద బధిరితాశాముఖులు, సంగరో త్సాహ సముల్లాస భాసితులునై, సప్తాక్షౌహిణీ బంధురమ్మగు చమూ సమూహముతో నడతేర, సర్వపాండవ సైన్య సమూహ వ్యూహముల పర్యవేక్షించు సంగరావష్టంభోజ్జ్వల వీరరేఖా విరాజితుడై ఉద్దీప్తోరు ధ్వజముతో సర్వసేనాపతి దృష్టద్యుమ్నుండు సమస్త పాండవసేనా ముఖమ్మునకుం తిల కుండై విలసిల్లె-

కౌరవ పాండవసేన లిట్లు పరస్పరాభిముఖములై ఎన్న డును కనియు వినియు నెఱుంగని సంగ్రామ వ్యూహమ్ముల నమరించుకొని యున్న సమరక్షోణిని వీక్షింపుచు ఏమి జరుగ నున్నదోయను కుతుకమ్మున బృందారక ప్రముఖులు దివంగ తులైన పురాతన ధరారమణులు నంబరవీధి కేతెంచిరి-

కౌరవసేనల బలప్రతాముల విని ఊరట జెందిన ధృతి రాష్ట్రుని హృదయము పాండవుల పరాక్రమాతిరేకము విని నంతనే దిగులుపడి పరితపింప జొచ్చెను-

సంజయుని ప్రసంగము మరల నిట్లు సాగినది.

"ఇరుతెగ లిట్లున్నతరి తనకు శుభసూచకమ్ముగ దక్షిణ నేత్ర భుజంబు లదరుట తోచి యుధిష్ఠిరు డాకస్మికముగ తన తనుత్రాణ కిరీటములను చాపాస్త్రముల నూడ్చి రథమ్ము నం దునిచి యొంటరిగ పాదచారియై కౌరవ సైన్యమ్మున్న

దెస కేగుచుండుట జూచి అందఱును ఇతడిట్లేల ఏకతమ నేగు చుండెనో తెలియక విస్మయం పడుచుండిరి- ఎందులకైన మంచిదని సోదరులు నల్వురును శ్రీకృష్ణ సహితులై వెంట నడువ ధర్మజుఁడు మున్ముందుగ భీష్మునకడ కేగి పాదాభివందన మాచరించి, తాతా! మీతో కయ్యము నొనర్పు సంఘటన మనివార్యమైనది. మీ యనుమతి తోడనే నే నీపనికి గడం గెదను. నిన్నెదుర్పగల వీరు డీమేదిని లేడు. ఆ విషయమెఱిం గియే మేము యుద్ధమున గెలుచు విధమేదియో తెలుపుడని వేడుచున్న వినయాంజలి బద్ధుడగు యుధిష్ఠిరుని గాంగేయుడు దీవించి, కుమారా! నీ ధర్మము నిన్నుగాచును. అయినను నాచేత ఆయుధ మున్నంతదనుక నీ చెప్పినట్లు నన్నొరులు జయించుట పొసగదు. ఆయుధములు వీడు సమయము వచ్చిం చుటకిది కాలము కాదని మరల ధర్మజునికి దీవనలిడి యనిపెను.

ధర్మజుడిట్లే ద్రోణ కృప శల్యుల వద్దకు నేగి ప్రణతు లర్పించి తాను యుద్ధమున గెల్చు నుపాయము నర్థించెను. నిజమునకు భీష్మ ద్రోణ కృప శల్యులు తమ యంతరంగము ధర్మవర్తనులగు పాండవుల విజయము నే కోరుదురు. యుద్ధము మాత్రము దుర్యోధనుని పక్షమున చేయక తప్పలేదు- ఆచా ర్యుడును ధర్మజు దీవించి, ధర్మజా! నాకు యుద్ధమునం దాప్తి యుల మృతివంటి చెట్టవార్త విశ్వసనీయుల నుండి వినబడి నచో నే నస్త్రములు త్యజింతును. ఆ సమయమునందు నన్నొంచుట సాధ్యమని చెప్పి పంపెను. కృపుడును తాను

చిరంజీవియగుటట ధర్మజుని విజయుడవు కమ్మని అని దీవించి యనుప, మేనమామయగు శల్యుడు తాను కర్ణునకు సారథి గానై యతని బాణములు గురితప్పునట్లు చేయగలనని ధైర్య మొసగెను-

ధర్మజుడిట్లు కౌంతేయడై సంతృప్త మానసుండై కౌరవ సైన్యమ్ములదెస విలోకించి పెద్ద యెలుంగున "మీలో నెవ రయినను దుర్యోధన సైన్యమును వీడి మా సైన్యముల జేర నిచ్ఛగించుచో వేగిరము రావలసినది. వారిని నాతమ్ములట్లను రాగింతు"నని నుడువ, మహారాజా! నీ పుత్రులలో నొకడగు యుయుత్సుడు తన సైన్య సమూహముతో కదలి దుర్యో ధనుని దుర్ణయమ్ములు తెగడి పాండవుల ధర్మవర్తనము పొగడుచు పాండవసేనల జేరి ధర్మజు నాదరమునకు బాత్రు డయ్యెను- పాండవులు శ్రీకృష్ణ సహితులై వారి స్థానముల కరిగిరి"-

సంజయుడిట్లు నుడివిన ఇరువాగుల యుద్ధోపక్రమణము రణరంగ చిత్రము మనమున నూహించి, ధర్మజునకు భీష్మా దుల ధైర్య వచనములును, యుయుత్సుని పాండవ పక్షావ లంబనము దలచి భయకంపితుడై ధృతరాష్ట్రుడు సంజయు నితో, "సంజయా! ఆ మఱుక్షణములోనే యుద్ధమారంభమై యుండునుగదా ఎవరెవ రేమిచేసినది చెప్పు" మనెను.

సంజయుడంత "ఔను మహారాజా! కౌరవ పాండవ బలములు హస్త సంధృతాయుధులై సమరోద్యుక్తులై నిరీ

క్షించుచున్న క్షణ మాసన్నమైనది. ఇప్పుడొక ముఖ్యవిష యమే మీకు నివేదింపవలసి యున్నది. ఆలకింపు" డనగా, ధృతరాష్ట్రుని డాసక్తితో వినుచుండెను- సంజయుడిట్లు చెప్ప సాగెను-

మహారాజా! నీపుత్రుడు సుయోధనుడు ముందు ఆచార్యుని కడకేగి నమస్కరించి "గురుదేవా చూచితివా నీ శిష్యుడగు ద్రుపదుని కుమారుడు ధృష్టద్యుమ్నుడు తీర్చిదిద్దిన పాండవ సైన్య వ్యూహ మెట్లున్నదో. ఇందు భీమార్జున సము లగు మేటి ధానుష్కులు సాత్యకి విరాటుడు ద్రుపదుడు చేకితానువు ధృష్టకేతువు కాశీరాజు వంటి మహారథు లున్నారు-

మన పక్షమున గూడ మహాయోధులు అజేయ పరా క్రములైన మీరు భీష్ముడు ఆపైని కర్ణుడు అశ్వత్థామ కృపుడు వికర్ణుడు సోమదత్తుడు జయద్రథుడు ఇంకను యెందరో వీరాగ్రణు లున్నారు. నాకొక్కమాట తోచుచున్నది. * గురువర్యా! భీమాభిరక్షితమైన పాండవబల మేవిధమున చూచినను పరిమితముగనే యున్నది. మన బలమన్ననో నాకొఱకు ప్రాణము లర్పింపగల అసంఖ్యాకులయిన శూరులతో అపరిమితమై భీష్మాభిరక్షితమై యున్నది.

---

1 అ. 10 అపర్యాప్తం తదస్మాకం బలం భీష్మాభిరక్షితమ్,
పర్యాప్తం త్విదమేతేషాం బలం భీమాభిరక్షితమ్.

మీరందఱు మీ మీ స్థానములు వీడక జగదేకవీరుడగు భీష్ముని కేయిక్కట్టు రాకుండ కాపాడుచుందురు గాక" అను దుర్యోధనుని పలుకు వినగానే అతనికి ధైర్యము కల్గించుటకై ద్రోణుడు భీష్ముడును ఉత్సాహ పూరితులై లేచి పెద్ద యెలుగున సింహనాదములు చేసిరి, తమ శంఖములు పూరించిరి. కౌరవ పక్షమునం దా శంఖధ్వనికి ఉత్సాహోద్రేకములు వెల్లుబికినవి. శంఖ భేరీ దుందుభి ఢక్కా ధ్వానము లొక్కసారి మ్రోగినవి. ఆ భయంకర ధ్వని దిక్కులు నలుమూలలను వ్యాపించినది-

కౌరవ శంఖధ్వనులు పాండవ వీరులను రెచ్చగొట్టునట్లు మ్రోగినవి- కృష్ణుడు పాంచజన్యము, అర్జునుడు దేవదత్తమును మహోద్రేకముతో పూరింపగనే భీముడు పౌండ్రకమును ధర్మరాజు అనంతవిజయము కవలలు సుఘోష మణి పుష్పకములను వాని వెంబడి సాత్యకి విరాటుడు ద్రుపదుడు అభిమన్యుడు ద్రౌపదేయులు శిఖండి కాశీరాజు ధృష్టద్యుమ్నుడు మున్నగు మహావీరాధివీరు లెల్లరు తమ తమ శంఖము లొక్కుమ్మడి పూరించిరి. పాండవ సైన్యమునందు రణభేరీ వాద్యములు నలుదెసలను మ్రోగినవి. జయ జయ ధ్వానములు రేగినవి, పాండవ బలము నుండి ఒక్కసారిగ ఉత్పన్నమయిన ఈ ధ్వని మహారాజా! ఇట్టి దట్టిదని చెప్పుట అసాధ్యము. భూనభోంతరములు నిండి మారుమ్రోగినది- ఆ భీకర ధ్వని దుర్యోధనుని సైన్యములకు హృదయ విదారకమైనది. వారినెల్లరను ఒక విధమగు భయ మావహించినది-

మహారాజా! ఇంకను వినుము, ఆ క్షణమున పాండవ వీరుడు, అర్జునుడు తన విల్లు నెత్తిపట్టుకొని లేచి, "కృష్ణా! మన యెదిరిపక్షము మనపై బాణపరంపర కురియుటకు సిద్ధముగ నున్నది. దుర్యోధనునకు హితమొనర్ప ఎవరెవరిచ్చట గూడియున్నారో, ఎవరితో నేనిపుడు పోరవలసి యున్నదో ఒకింత స్పష్టముగ చూడనిమ్ము. కొలదికాలము మనరథము * నీ యుభయసేనల మధ్యగ నిలుపుము" అనగనే కృష్ణుడు తాను నడపుచున్న రథమును యుద్ధరంగ మధ్యమునకు తీసికొని వచ్చి భీష్మ ద్రోణులు భూపాలు రందఱు గూడియున్న స్థలమున కెదుటగా నాపి, అర్జునా! చూడుము నీవు పోరునం దెదిరించవలసిన వారందఱు నీయెదుటనే యున్నా రనెను—

అర్జునుడు లేచి ఆమూలల నుండి ఈమూల వరకు కౌరవ పక్షమును తేఱిపాఱ జూచెను. అతని హృదయమున ఏదియో కలత. ఆ కలత క్రమ క్రమముగా ఒక విషాదరేఖగా మాఱి మొగము నావరించినది. తాను చూచిన దెవరిని? తన మహోగ్ర బాణాగ్నుల కెఱకాఁబోవునదెవరు? వారు తండ్రులు తాతలు గురువులు మేనమామలు అన్నదమ్ములు దాయాదులు కొడుకులు మనుమలు మిత్రులు శ్రేయోభిలాషులే. అయ్యో! వీరితోడనా పోరాడుట, వీరినా నేను చంపనుంకిం

---

1-21 సేనయోరుభయోర్మధ్యే రథం స్థాపయ మే௨చ్యుత॥
1-22 యావదేతాన్నిరీక్షే௨హం యోద్ధుకామానవస్థితాన్।
కైర్మయా సహ యోద్ధవ్య మస్మిన్ రణసముద్యమే॥

చుట! ఈ నూతన భావ ప్రవాహములో అర్జునుడు కొట్టు కొని పోవుచున్నాడు. తన మనస్సు తన వశములో లేదు. కృష్ణునివైపు జూచి *"కృష్ణా! నే నీ యుద్ధమునకు వచ్చినది నా యెదుట గన్పడు ఈస్వజనము నెల్లరను జంపి మా రాజ్య భాగము చేకొనుటకా! ఈ మారణ హింసను నే నొనర్ప లేను, నే నీయుద్ధము చేయజాలను" అని తన విల్లమ్ముల క్రిందికి జాఱవిడిచెను. జాఱవిడుచు టేమి, వణకిపోవుచున్న అతని చేతులనుండి అనియే జాఱిపోయినవి.

సంజయుడు నుడువు ఈ విషయము వినుసరికి ధృత రాష్ట్రుని మనస్సులో ఒక నూతన సంచలనము కలిగినది- ఒడలు పులకించి సంజయుని తన రెండు చేతులతోడను బుజ ములు పట్టుకొని కుదిపి "సంజయా! ఏమంటివి. అర్జునుడు యుద్ధము చేయనని ధనుర్బాణములు క్రిందకు వదలి నాడా! ఈమాట సత్యమేనా! నిజముగ నే అట్లు చేసినాడా. యుద్ధ మాగిపోయినదా! ఏది ఏది మరల చెప్పుము మరల చెప్పుము, ఎంత మంచిమాట చెప్పితివి. అర్జునుడే తప్పుకొనినచో ఇక కదనమెక్కడిది" అని యా యంధనృపతి యావేశపడుచుండెను.

---

1-28 దృష్ట్వేమం స్వజనం కృష్ణ యుయుత్సుం సముపస్థితం॥
1-29 సీదంతి మమగాత్రాణి ముఖంచ పరిశుష్యతి।
వేపథుశ్చ శరీరేమే రోమ హర్షశ్చ జాయతే॥
1-30 గాండీవం స్రంసతే హస్తాత్ త్వక్చైవ పరిదహ్యతే।

సంజయుడంతట ధృతరాష్ట్రుని చేయిపై చేయి వేసి "మహా రాజా! తొందరపడకుము. ఇంకను చెప్పవలసిన విశేషము లెన్నియో ఉన్నవి. అర్జును డా ఒక్క వాక్యముతో ఆగలేదు. కృష్ణు డాతనిని అంతతో వీడను లేదు. ఆ క్షణమునందు వా రిరువురికిని జరిగిన వాదోపవాదములు మానవ చరిత్రలో ఒక నూతనయుగమునే సృష్టిచేయునట్లున్నవి. కృష్ణార్జునుల బోలు మహాత్ముల నిక ధాత్రిపై చూడబోము"-

సంజయు డనిన ఈ రెండు మాటలతో పొంగుచున్న పాలపై నీటిచుక్కలు పడినట్లు ధృతరాష్ట్రుని ఆతురత ఉపశమించినది. సంజయుని ఈ మాటలు ఏదో గంభీర భావ గర్భితములుగా నున్నవి. శాంతించిన హృదయముతో ఆ ముసలిరాజు సంజయుడు చెప్పుచున్నది మరల నిట్లు వినెను-

## ౨. సాంఖ్యయోగము

ఆరీతి నుడువు చున్న పార్థుని జూచి కృష్ణు డొకింత మందహాసము చేసెను. ఆ మందహాసము హాస్యాస్పదముగ నున్నది. అర్జుని నిర్వేదము ఆజ్యముపోసిన అగ్ని జ్వాలవలె మఱింత యెక్కువైనది. అర్జును డిక తనబాధను పట్టలేక నిగ్రహము వీడి యిట్లు వాపోయెను-

"కృష్ణా! ఏమిది, నన్నుజూచిన నీకు నవ్వు వచ్చు చున్నది. ప్రాణ సంకట సమయములో పరిహాసమా. అవును అట్లె యుండును. మమ్ముల నందఱను యుద్ధమునకు పురి

కొల్పితివి. నీ చేతులలో సంధియత్నములు విఫలమైనవి. నిన్ను చటకు లాగుకొని వచ్చితివి. పర్యవసాన మిది. నా వారి నందరను నేను వధింపవలెను. నా గాండీవ పాశుపతము లిందులకా. నా దేవదత్త మా యార్తనాదములను ప్రతిధ్వనింప జేయుటకా. నా బాధ నీ కెట్లు తెలియును. పిల్లికి చెలగాటము ఎలుకకు ప్రాణగొడ్డమువలె నున్నది." ఈ హృదయావేదనతో అర్జునకేదో అంధకారమున బడిపోవుచున్నట్లయినది. కన్నులలో నీరు క్రమ్ముచున్నది–

కృష్ణు డది చూచి, అర్జునా ఇప్పు డేమైనది. ఆకస్మికముగా నిపిట్లు మాటిపోయినావు. ఏ మేమియో మాట్లాడుచున్నావు. నీ విచ్చటికి ఎందులకు వచ్చితివో స్పృహయున్నదా. లేక ఇంకను నిద్రా స్వప్నములం దుంటివా. నీకు గల్గిన మనోవ్యథ యెట్టిదో సవిస్తరముగ నేను విన వచ్చునా. సుభద్రాపతీ! అని కృష్ణుడు కొంత నెమ్మదిగా అడుగుటతో అర్జునుడు (శ్రీ) కృష్ణుని జూచి యిట్లనెను–

కృష్ణా! నేనేమి చెప్పవలయునో నాకే తోచుటలేదు. యుద్ధమువలన జరుగనున్న మారణ హోమమును తలంచినంతనే నాగుండె లవియుచున్నవి. * అదియును నా స్వజనమును ఆత్మీయులను పూజనీయులైన కులవృద్ధులను ఆచార్యు

---

1అ.37 తస్మాన్నార్హా వయం హన్తుం ధార్తరాష్ట్రాన్ స్వబాంధవాన్
స్వజనంహి కథం హత్వా సుఖినః స్యామ మాధవ!

లను నేను చంపుటా. ఇట్టి ఘోరకృత్యము దుఃఖప్రదముగాక మఱి యెట్లుండును. నా దేహమంతయు దూదిపింజవలె తేలి పోవుచున్నది. నోరు పిడచగట్టుకొని పోవుచున్నది, శరీరమంతయు ముండ్లు గ్రుచ్చినట్లగుచున్నది. చర్మమంతయు ఒకటే మంట, మనస్సుతోపాటు కండ్లు తిరుగుచున్నవి. నేను ఎందు చేతనో నిలువలేక పోవుచున్నాను. గాండీవము నా చేతుల నుండి జాఱిపోవుచున్నది కూడ-

ఆ పైన నాపై కుఱికిన శత్రువులనైనను శిక్షింపవలెనా యేమి- మా రాజ్యభాగము చేకొనుటకు నా ఆప్తులను జంపవలయును. ఆలోచించిన కొలదియు నాకీ క్రూరకార్యము వలన రవంత శ్రేయము కూడ నాకు గనుపట్టుటలేదు- నా మాటలు తెలియుచున్నవా కృష్ణా! ఇట్టి విజయముగాని సుఖముగాని రాజ్యముగాని నాకేల. వీనియందు నాకణువంతయు వాంఛలేదు. ఎవరికొఱకీ రాజ్యభోగము కోరుచున్నామో వారే నా బాణముల కెఱ కావలసినవారు, తాతలు తండ్రులు గురువులు తమ్ములు. కట్టా! యింతకన్నను పాపముండునా. ఒకవేళ వారే నాపైబడి చంపుదురా చంపనిమ్ము. త్రిభువన సామ్రాజ్యాధిపత్యమే ఈ విజయము వలన నాకు లభించినను నా కక్కఱలేదు. ఇక నొక చేరెడు నేలకై నేను హింసకు దిగుదునా. దిగను. ఐనను ఈ ధార్తరాష్ట్రులను చంపినచో మనకు పాపమే కాని శ్రేయమెట్లగును- వారు మిత్రద్రోహము కులక్షయమునకు వెఱువక యుద్ధము

నకు గడంగినచో, యుద్ధమునకు ఫలము కులక్షయమని మనకు స్పష్టముగ గన్పడు చున్నపుడు మనమెందుల కావిధ మను సరింపవలయును. ఆదారినుండి తొలగుట మంచితికదా!

వంశ నాశనమగుచో కులధర్మములు నశించి అధర్మము ప్రబలి కులాంగనలును దుష్టవర్తనమునకు వశులగురు. దాని పర్యవసానము వర్ణ సాంకర్యమే. వర్ణ సాంకర్యము వలన కుల నాశకులకు, కులమునకు నరకమే గతి. పితరులకు పిండోదక ములు లేని దుర్గతులు ప్రాప్తించును. ఎప్పు డేర్పడినవో అనాది సిద్ధములైన ఈ జాతి కుల ధర్మములు సమూలముగ నశించును. కులధర్మము లేనివారికి నరకమే గతియనిగదా విజ్ఞులు నుడువుట వినుచున్నాము. రాజ్యము మీది పేరాసచే మనవారినే మనము చంపు మహాపాపమునకేల మన మొడి గట్టవలయును కృష్ణా, నిరాయుధుడనై నిలుచున్న నన్ను ధార్త రాష్ట్రు లాయుధములతో వచ్చి చంపినను నాకది శ్రేయో దాయకమే.

అర్జునుని ఆవేదనా నివేదన మిట్లు సాగినది- మహా రాజా! ఆక్షణమందలి అర్జునుని ఆకారమేమని వర్ణింపగలను. స్వజనుల యెడల జాలితో కరగి ద్రవీభూతమైన దాతని మనస్సు. దుఃఖము పొంగి పొంగి వచ్చుచున్నది. నేత్రము లశ్రుపూరితము లైనవి. వివశుడై ధనుర్బాణములు విడచి రథముపై చతికిలబడినాడు-

శ్రీకృష్ణు డిదియంతయు చూచుచున్నాడు. అర్జునుని

"కృష్ణా! నీవేమో చెప్పుచున్నావు. నీ వాక్యములు నాకు బోధపడుటలేదు. భీష్మ ద్రోణులు నాకు పూజ్యులు గదా, వారిపై బాణవర్షము గురిసి వారినెట్లు నొప్పింపగలను. ఆ మహాత్ములను వధించుటకన్న లోకమున బిచ్చమెత్తుకొనుట మేలు. ఆమాట నట్లుంచుము, పెద్దలను పిన్నలను నావారినెల్ల వధించి తెచ్చిన భోగ భాగ్యములను అనుభవింప మందువా మారణ రణ సంపాదితమైన ఈ నెత్తుటికూడును తినమందువా కటకటా, అయినను యుద్ధమునం దెవరు జయింతురో చెప్పలేముగదా వారు మమ్ములను జయించుటా మేము వారిని జయించుటా ఏది శ్రేయస్కరమో నేనెఱుగకున్నాను. ఎవరు చనిపోయినపిదప మనము జీవించియుండుట వ్యర్థమో వారే ఈక్షణమున నా బాణములకు బలియగుటకు నాకెదురుగ నున్నారు- కృష్ణా! నాకంతయు అయోమయముగా నున్నది- ఏదో దుర్వ్యథా తాపము నన్నులోగొని మనోబలము నశింపజేసినది- ధర్మాధర్మ విచక్షణ లేని మూఢుడనై పోతిని. నేనిప్పుడు నీ శిష్యుడనై ప్రార్థించుచున్నాను. * నాకేది శ్రేయస్కరమో నీవే నిశ్చయించి

---

2-7 కార్పణ్యదోషోపహత స్వభావః
పృచ్ఛామి త్వాం ధర్మసమ్మూఢ చేతాః
యచ్ఛ్రేయస్స్యాన్నిశ్చితం బ్రూహి తన్మే
శిష్యస్తేఽహం శాధి మాం త్వాం ప్రపన్నమ్॥

చెప్పుము. చెప్పుటయే కాదు నన్ను శాసింపుము. అట్లు చేయుదును. ఏవిధముగను పరితాపము కలుగజేయని భూలోకరాజ్యమో ఆపైని దేవతాధిపత్యమో నాకు లభించినను నా యీ మనోవేదనను నశింపజేయునదేదియు నాకు కన్పించుట లేదు." అని పార్థుడు వినమ్రుడై కృష్ణునిముందు శిరము వాల్చెను.

ధృతరాష్ట్రు డింతవరకు విని; "సంజయా! మరల అర్జునుని యుద్ధోన్ముఖునిగ జేయుచున్నాడే. శ్రీకృష్ణు డెంతకైన తగును సుమా! ఆ తరువాత ఏమైనది నుడువుము" అనగా సంజయుడు మరల నిట్లు మొదలిడెను.

తన మనోవ్యథ నిట్లు తెలిపి యుద్ధము చేయనని యూరకుండిన అర్జునుని జూచి శ్రీకృష్ణు డొకింత నవ్వుచూ, "అర్జునా! ఈ యుద్ధము నీకు శోకము కలిగించుచున్నదని ఊహించుచున్నావు. ఒక విషయము వినుము. ఎవరికై శోకింపదగదో వారికై నీవు శోకించుట వింతగానున్నది. ఆపైని ఏదో పెద్ద తెలిసినవానివలె గూడ పాపము నరకము అని మాటాడుచున్నావే. తెలిసిన వారెప్పుడును బ్రతికి యున్న వారిని గూర్చి గాని మృతిజెందిన వారినిగూర్చి గాని ఇట్లు మాటాడరు. నీవు చూచుచున్న ఈ రాజు లందఱును గాని నీవుగాని నేనుగాని ఒకప్పుడు లేనివారమని ఇకముం దుండబోవమని తలంపకుము.

ఈనాడుండి రేపే కారణము వలననో భూమిపయి పతన మగు మన దేహము శాశ్వతమనుకొని నీవిట్లు పలుకుచున్నావు సుమా. ఈ సుస్థిరత్వము దేహము నాశ్రయించుకొనియున్న ఆత్మకే గాని దేహమునకు లేదు— నీవు నేను అనుకొను భావము ఆత్మయేగాని దేహముకాదు. నీవిప్పుడు యౌవను డవు, రేపు ముసలివాడ వగుదువు. దేహమునందు గలుగు చున్న ఈ మార్పులవలెనే మరణాంతరము దేహధారియగు ఆత్మ మఱియొక శరీరము దాల్చును. ఇంద్రియ విషయ అనుభవములను బట్టి కష్ట సుఖము లీదేహమునకు గల్గుచుం డును. వాని నోపికతో సహింపవలెను. నీ వెఱుగదగిన సత్యము వచించెదను. వినుము—.

లోనున్న ఆత్మ నిత్యమగు వస్తువు. దేహ మనిత్యము ఈ భేదము నీవు తెలిసికొనినచో నే చెప్పబోవు విషయము లన్నియు నీకవగత మగును. ఈ ఆత్మ వస్తువే పరమాత్మ అది * సర్వగత సకల చరాచర భూతములందు వ్యాపించి అవ్య యమై యున్నది. దానికి నాశ మనునది లేదు. నాశమొందు నది నీ కనులకు పైకి గన్పించు దేహమే. ఈ దేహమును గూర్చి దుఃఖించుట అవివేకము. ఈ చింతవదలి యిక యుద్ధ మునకు లెమ్మా—

---

2–18 అన్తవన్త ఇమే దేహా నిత్యస్యోక్తాః శరీరిణః ।
అనాశినో ఽ ప్రమేయస్య తస్మాద్యుధ్యస్వ భారత ॥

అర్జునా! ఈ ఆత్మపదార్థ మంత సులభముగ తెలియ బడునదిగాదు. మఱికొంత వివరముగ తెలుపుచున్నాను వినుము. ఆత్మ అవినాశి యనిగదా చెప్పితిని. అందుచే చావు పుట్టుకలు లేని నిత్యుడు ఆత్మ. ఇక ఈ ఆత్మ చావులేనిదిగ నున్నపుడు చంపువాడు మాత్ర మెవడు చచ్చువాడెవడు. ఈ చావు పుట్టుకలు దేహమునకే. * నీవు నిన్న ధరించిన దుస్తులను తీసివైచి నేడు వేఱుగ ధరించినావు. రేపు మరల వీనిని మార్చి వేఱు దుస్తులను ధరింతువు, చినిగిపోయిన ప్రాత బట్టలను విసర్జించి మనుజుడు క్రొత్తబట్టలను ధరించుచున్నట్లే పతనమైన దేహమును విడచి వేఱొక దేహమును ఆత్మ ధరించుచుండును. అన్ని శక్తులకును అతీతమైన దీ ఆత్మ. ఖడ్గము దానిని ఖండించలేదు. అగ్ని దానిని కాల్పలేదు, జలము దానిని తడుపలేదు. దేహము నశించినంత మాత్రమున ఆత్మ కెట్టి యిక్కట్టును లేదు. ఈ ఆత్మ తత్త్వము యొక్క నిజము నెఱిగి యికనైనను నీ కర్తవ్యమైన యుద్ధమునకు లెమ్ము. క్షత్రియునకు యుద్ధము స్వధర్మము. ఇందు గెలిచినచో రాజ్యసంపద కలదు. ఓడినచో స్వర్గ సౌఖ్యము లభించును. కావున అర్జునా! నీవిప్పు డూహించుకొనుచున్న

---

2-22 వాసాంసి జీర్ణాని యథా విహాయ
నవాని గృహ్ణాతి నరోఽపరాణి
తథా శరీరాణి విహాయ జీర్ణా
న్యన్యాని సంయాతి నవాని దేహీ॥

దుఃఖము దుఃఖముకాదు. ఈ తలంపును విడచి లెమ్ము"- అర్జును డీమాటలను ఆసక్తితో వినుచున్నాడు. శ్రీకృష్ణుడు మరల "అయినను, దేనికొఱకై నీ దుఃఖము పుట్టినది. మృతి చెందక తప్పదు. దీనికై దుఃఖించుటయు నిష్ప్రయోజనము. ఇక దేహధారియైన ఆత్మయందునా, అది అన్ని దేహము లందు వసించు వస్తువు, చంప నలవికానిది. ఇంతమాత్రమే నకై నీ స్వధర్మము, ధర్మకారణము అయిన ఈ యుద్ధము నుండి వెనుదిరిగినచో నీకు అపకీర్తియే భూమిమీద నిలచు నది- సాటివారిలో నీవు చులకన అయిపోదువు గూడ. ఈ అనావశ్యకముగు అపనింద నీకేల.

నీవేదో పాపము పుణ్యము అనుచుంటివి. లాభ నష్టములు సుఖ దుఃఖములు జయాపజయములు సమబుద్ధితో చూచి యుద్ధమున కుద్యుక్తుడవు కమ్ము. నిన్నే పాపమును అంటదు.

అర్జునా! నీకింతవరకును ఆత్మజ్ఞానమును గూర్చి చెప్పితిని. దీనికి సంబంధించినదే మఱియొక విషయ మున్నది. నీవు తెలిసికొనవలసినది చిత్తశుద్ధిగ ఆచరింపవలసినది కూడను. అది కర్మయోగము. కర్మబంధ విముక్తి కింతకన్న మార్గము లేదు- నవేదో కష్టసాధ్యమైన ఆచరణలోనికి నిన్ను లాగు చున్నానని భయపడకుము. నీవు దీనిని పూర్తిగ ఆచరింప లేకున్నను విరుద్ధఫలములు రావు, ఏమాత్రము * ఆచరింప

2-40 నేహాభిక్రమ నాశోఽస్తి ప్రత్యవాయో న విద్యతే
స్వల్పమప్యస్య ధర్మస్య త్రాయతే మహతో భయాత్ ॥

గలిగినను నిన్నది సంసార భయమునుండి తప్పించును. చూచి తివా ఈ కర్మయోగ మెంత ప్రయోజనకారియో-

ఈ క్రొత్త విషయమును గూర్చి వినుము. ఏకాగ్రత లేని బుద్ధి పలుతెన్నులబోవును. ఏ వేవియో కోరికల పెంచు కొనును. స్వర్గపదము నే లక్ష్యముగా నెంచుకొని వేదము లందలి కొన్ని కర్మకాండలను ప్రశంసించు వాదములను నమ్మి కేవలము భోగైశ్వర్యముల యందాశక్తి కలిగి ఇట్టి చంచలబుద్ధులు వర్తింతురు. అవ్యయముక్తిప్రదమగు ఈశ్వ రత్వ మొకటి వేఱుగనున్నదని వీరు గ్రహింపలేక కామ్య కర్మఫలమగు పునర్జన్మ లనుభవించుచుందురు-

కష్టసుఖాది ద్వంద్వములు సమబుద్ధితో చూడవలయు నని ఈవరకే వినియుంటివిగదా. అట్లే సత్త్వరజస్తమము లను త్రిగుణములకు అతీతుడవు కావలెను ఈ సాధన నెఱిగి ఆత్మజ్ఞానమును బడయుచో అది ఆనందసాగర సంసిద్ధియే. ఏవియో స్వల్ప ఫలములనిచ్చు కూపోదకముల వంటి కర్మ కాండలు నీకేల! అనంతమైన ఫలమునిచ్చు ఆత్మానందసాగ రము కొరకే నీవు యత్నింపుము. * ఏమైనను నీకున్న అధికా రము కర్మము లొనర్చుటకే, ఆ కర్మఫలములపై లేదు, వానిని నీవాశింపరాదు కూడను. ఫలోత్పత్తికై కర్మాచర ణము కూడదు. ఇందులకని కర్మముల విడనాడరాదు. ఫలము

---

2-47 కర్మణ్యేవాధికారస్తే మా ఫలేషు కదాచన
మా కర్మఫలహేతుర్భూర్మా తే సంగోఽస్త్వకర్మణి ॥

నం దాసక్తి లేక, మనోరథసిద్ధియైనను కాకున్నను సమ బుద్ధితో నీ కర్మముల నిర్వహింపుము. ఇదియే నేను మొదట అనిన కర్మయోగము- ఇట్లు చేయనివారు కడుహీనులు, అవివేకులు. సిద్ధ్యసిద్ధులయందు సమబుద్ధి కలుగువాడు, అనగా కర్మఫలముల త్యజింపగలిగినవాడు పుణ్యాపాపముల నుండి విముక్తుడయి, ఏవిధమగు కలతియు లేనిదియు, జన్మబంధము లేనిదియు నగు ఉత్తమపదము నందును- అదియే జీవన గమ్యస్థానమగు ముక్తి. ఫలాభిలాషయను అజ్ఞానమును దాటగల్గితివా అర్జునా! ఇక నీవు వినదగినది లేదు. బుద్ధి నిస్సంగమై నిశ్చలమై ఆత్మధ్యానమందు స్థితప్రజ్ఞకలదిగా నున్న పుడు నీవు పరమాత్మ సాక్షాత్కారమును పొందెదవు-

అర్జునుడు శ్రీకృష్ణుడు చెప్పినది వినినాడు. శ్రీకృష్ణుని వచనములు తననేదియో ఒక క్రొత్త దారిని పట్టించునట్లివిగా ఉన్నవి- ఒకమాటలో తనను యుద్ధమునకు లెమ్ము అనును. వెంటనే ఈ యుద్ధకర్మము వలన నీకేమియు పాప మంటదు స్థితప్రజ్ఞుడవు కమ్ము అనును. ఈ సిద్ధాంతమేదియో వినుటకు ఆకర్షణీయముగనే యున్నది. అర్జును డిట్లాలోచించి కృష్ణుని జూచి ఆసక్తితో "కృష్ణా! ఆగు ఆగు ఒక్కనిముషము. నీమాటలు బాగుగనే ఉన్నవి. కాని వెనుకది ముందు, ముందుండవలసినది వెనుక చెప్పుచున్నావేమో అనిపించుచున్నది- ఆత్మసాక్షాత్కారము పరమపదప్రాప్తి సమాధి స్థితియందున్న స్థితప్రజ్ఞునకే లభించునని చెప్పుచున్నావు. ఆ స్థితప్రజ్ఞు డెవరు?

ఆతని లక్షణము లెట్టివి? ఈ విషయములు కొంత వివరముగ చెప్పరాదా" అనెను. శ్రీకృష్ణునకు మొగమునం దేదియో కొంత తృప్తి గలిగిన భావము తోచినది. అర్జునుడు దారికి వచ్చుచున్నాడు అనుకొని "అర్జునా, అయితే కొంత విశదముగా చెప్పబోవుచున్నాను వినుము." అని హెచ్చరించి ఇట్లు నుడివెను-

"ఇది జరుగవలెను, అది కావలెను అను కోరికలను మొదలంట కోసివేయవలెను. ఆత్మయందు కలిగినదానితో సదా తృప్తి సంతోషము లుండవలెను. ఒకింత కష్టము ప్రాప్తించగనే దుఃఖపడి, ఒకింత సుఖము తోచగనే పొంగిపోవు మనోభావము లుండరాదు. అనురాగము, భయము, కోపము దేనియందును పెంచుకొనరాదు. నీవు తాబేలును చాలసార్లు చూచియుందువు కదా. అది దానికాళ్ళను, తలను లోపలకు ముడుచుకొని వట్టి జోడి డిప్పవలె కన్పించును. అట్లే స్థితప్రజ్ఞుడయిన నరుడు విషయభోగాకర్షణల నుండి తన యింద్రియముల మరల్చుకొనును. అప్పుడే అతని జ్ఞానము సుస్థిరమగును. ఇంద్రియములను విషయ సుఖములనుండి మరల్చుటే కాదు. ఆ సుఖములందు వాంఛయూ నశింపవవలెను- అట్టి స్థిరత్వము లేకపోయినచో ఇంద్రియము లెట్టి వానినైనను లోబరచుకొని తప్పుదారిని పట్టించును. ఆవిధముగ ఇంద్రియముల నణచిపట్టి యుంచగల్గిన స్థిరచిత్తుడే

పరమాత్ముడనగు నాయందు బుద్ధిని నిలుపగల్గుదురు. అట్టి నరుని జ్ఞానమే స్థిరమైనదని గ్రహింపుము—

అట్టి ఇంద్రియ నిగ్రహము లేకపోయెనా, ఇక చూడుము విషయాసక్తములైన ఇంద్రియముల దుష్ప్రభావము— మనసునందు పెక్కు కోరికలు, కోరికనుండి అవి తీరలేదను కోపము, కోపమునుండి మంచిచెడ్డల విచక్షణలేని మూఢత్వము, అందుండి మతిమఱపు, దానితో యుక్తాయుక్త వివేకము నాశనమగుటయే ఫలము. అట్టి వివేకనాశనమే కలిగిన నాడు వాడు నైతికముగా మరణించినవానితోనే లెక్క.

ఇక సుస్థిర చిత్తుడందువా, జితేంద్రియుడై ప్రియాప్రియములకు అతీతుడై ఎట్టి రాగద్వేషాదులు లేక దేహపోషణావసరములగు అన్నపాననిద్రాదులకు ఇంద్రియముల నుపయోగించినను, చిత్తశాంతిని పొందగలడు. అట్టి చిత్తశాంతి కలుగవలెనేగాని వానికి దుఃఖమను సంగతియే ఉండదు— వానికి నాయందు ఏకాగ్రము నిశ్చలమైనబుద్ధి కుదురును—

అట్టి స్థిరత్వములేని వానిగతి యెట్లుండు ననుకొనుచున్నావు? నీటిపై నున్న పడవను వాయువీచిక లెటు ప్రసరించిన ఆవైపునకే లాగుకొనిపోవునట్లు ఇంద్రియములు ప్రబలములై మనుజుని లొంగదీసుకొని తమవైపు లాగుకొనిపోవును. అందుచే అర్జునా! అధోగతి పాలుజేయు ఈ ఇంద్రియములకు లోబడక, నీబుద్ధిని సుస్థిరముగా నుంచుకొమ్ము. దీనినే మఱి

కొంత స్పష్టము చేయుచున్నాను వినుము. ఇంద్రియ నిగ్రహము స్థిరబుద్ధియు లేని జనునకు అంతయు చీకటిమయమే. పరమార్థతత్త్వమును చూడనేలేడు- ఇంద్రియనిగ్రహమున్న స్థిరచిత్తుడు మునీశ్వరుడే. అదే పగటికాలమై పరమాత్మను చూడగల్గును. విషయలోలత్వము నందు మేల్కొని యున్న వారికి పగలుగా నున్నది, విషయ సంగరహితులై పరమాత్మ ధ్యానమే సుస్థిరముగా నున్న వారికది విషయ మోహము లేని చీకటియేగదా. ఇట్టి సుస్థిరులకు విషయాకర్షణలు చిత్తమునకు రావు. సముద్రమును చూచితివిగదా నలువైపుల నుండియు ఎన్నియో నదులు మహా ప్రవాహముతో వచ్చి చేరుచుండును. అయినప్పటికి సముద్రము కలతనొందక యథాపూర్వముగా నుండును- స్థితప్రజ్ఞుని చిత్తమునందు, ఆ నదీ ప్రవాహములవలె ఎన్నియోవాంఛలు వచ్చి చేరుచుండును గాక. వచ్చినవి వచ్చినట్లే అవి అణగి పోవును. వానివలన ఎట్టి కలతయు రాదు. అట్టివాడు ముని. ఆ మునికున్న చిత్తశాంతి కోరికలకు లోబడినవానికి ఆవంతయు ఉండదుసుమా. అట్టి శాంతికి మార్గము * మఱియొకసారి

---

2-71 విహాయ కామాన్య స్సర్వాన్
పుమాం శ్చరతి నిస్పృహః
నిర్మమో నిరహంకార
స్సశాన్తి మధిగచ్ఛతి ॥

చెప్పుచున్నాను వినుము. ఆశలు, వాంఛలు విడచి, నేను నాది అనుభావము త్యజింపగల్గినపుడే ఆ శాంతి లభించును-

అర్జునా ఇదియే బ్రహ్మభావ మందగలిగిన వానిస్థితి. అట్టివానికి మూఢత్వమని గాని విషయవ్యామోహ మని గాని దుర్గతులుగాని ఉండవు. మరణకాలమం దట్టి స్థితినిష్ఠ కలుగువాడు బ్రహ్మైక్య సంస్థితిని తథ్యముగ పొందును-

## ౩ కర్మయోగము

పార్థునకు శ్రీకృష్ణుని నుడువు లంతకంతకు వినదగిన విగా నున్నవి. ఆ వాక్యములలో తనకు తోచుచున్న సందేహము లెప్పటికప్పుడే తీర్చుకొనుట మంచిదని తలచినాడు. వెంటనే శ్రీకృష్ణుని జూచి

"కృష్ణా! సత్కర్మము యొక్క ప్రశస్తిని తెల్పితివి; బాగున్నది. మరల ఆత్మజ్ఞానము శ్రేష్ఠమని చెప్పుచున్నావు. అట్లయినచో నన్ని ఘోరకర్మమైన యుద్ధమునకు లెమ్ము లెమ్ము అని మరల ప్రోత్సహించెద వేల? నాకేది శ్రేయః ప్రదమో ఆలోచించి దానినే నిశ్చయముగా వచింపుము. రెంటిని కలిపి చెప్పుచున్న నీమాటలు నన్ను భ్రమపెట్టునవిగా ఉన్నవి" అను అర్జునుని సందియము వినిన కృష్ణునకు మంచి సమయము దొరికినది- తాను చెప్పదలచుకొనిన విషయము మఱింత నొక్కి నుడువవచ్చును- కృష్ణుని ప్రసంగమిట్లు సాగినది-

"అర్జునా! నీవు వినిన రెండు తెఱగు నిష్ఠలను, ధ్యాన శీలురకు జ్ఞానమార్గము కావ్యనిపుణులకు కర్మమార్గము, సృష్ట్యాదిని నేను జెప్పినవే- వీనిమధ్యగల భేదము నీవొకింత సూక్ష్మముగా గ్రహింపవలయును కర్మమును వీడినంత మాత్రమున ప్రయోజనముకూడ లేదు. ఏ కర్మమును చేయ కుండ ఏ మనుజుడును ఎటులుండగలడు. దేహపోషణకైనను ఏదియో పనిని చేయవలసినదేకదా. ఇంద్రియ వ్యాపారము నేకారణము చేతనో నిరోధించి మనసునందు విషయోప భోగములనే స్మరించువాడు మూఢుడు, కపటియుకూడ. కర్మాచరణము నిలుపుట అసాధ్యము గాన, అర్జునా నీవు శాస్త్ర నిర్దిష్టములైన కర్మము లొనర్పుము. మానవలదు.

యజ్ఞార్థము చేయు కర్మములు, అనగా భగవత్ప్రీతిక రములైనవి లోకశ్రేయః ప్రదములై నెగడును. కర్మాధికారిని సంసార కష్టములు బంధింపవు. తక్కినవి బంధించును. కాన నీవు ఉత్తమమైన యజ్ఞకర్మల ఫలాపేక్ష లేక చేయుము. వానివలన దేవతలు తృప్తినంది నీకు మేలొనర్పగలరు కూడ. నరులు, సురలు ఇరువురిట్లు ఒకరికొకరు సాయమైనవార గుదురు. మొట్టమొదట బ్రహ్మయజ్ఞముతో బాటు ప్రజలను సృష్టించి, "యజ్ఞకార్యము మీకొక కామధేనువువంటిది. మీ మనోరథము నిడేర్చు"నని * స్పష్టముగా చెప్పినాడు-

---

3-12 ఇష్టాన్భోగాన్హి వో దేవా దాస్యన్తే యజ్ఞభావితాః
తైర్దత్తానప్రదాయైభ్యో యో భుంక్తే స్తేన ఏవ సః ॥

దేవతలిచ్చు సుఖముల ననుభవించుచు దేవతలకేమియు సమర్పింపక సర్వము తానేతినువాడు దొంగ అనిపించుకొనును-

ఇట్లు అనుష్ఠింపదగిన కర్మమునకు బ్రహ్మమునకు ఒక విడదీయరాని సంబంధమున్నది- అన్నము నుండి ప్రాణులు, వర్షము నుండి అన్నము, యజ్ఞము నుండి వర్షము పుట్టుచున్నవి. యజ్ఞమునకు వేదవిహితమగు కర్మ కారణము. అవ్యయమగు బ్రహ్మము నుండి వేదము ఉద్భవమగుటచే సర్వవ్యాపియగు బ్రహ్మము యజ్ఞమందు సుస్థిరముగా నిలచి యుండును. ఇట్టి విహితకర్మమును వదలి విషయవ్యాసంగుడగువాని జీవితము వ్యర్థమేకదా-

అర్జునా! ఒకమాట మాత్రము జ్ఞాపకముంచుకొనుము ఆత్మజ్ఞానియై ఆత్మ తృప్తిగల మనుజునకు కర్మవిధితో ఆవశ్యకత గాని ప్రయోజనముగాని లేదు. అది చాల కష్టసాధ్యమగు లక్ష్యము. దాని నటుంచి ప్రస్తుతము నీ కర్తవ్యమును నీవు ఎట్టి ఫలాసక్తి లేక చేయుము. అట్టి అనాసక్త కర్మము మోక్షదాయకము- ఇది నీకొక్కనికొరకై నేను ప్రతిపాదించునది కాదు. పూర్వము జనకుడు మున్నగు మహారాజులు అనుసరించిన విధానమే యిది. పెద్దలు ప్రామాణికముగ చేయు కార్యవిధానము నేగదా తరువాతివారు మార్గదర్శకముగ గైకొని అనుసరింతురు. నావిషయమును చూడుము. నేను చేయవలసిన కార్యమేదియును లేదు. సర్వమును సాధించినవాడనే అయినను నిరంతర మేదియో చేయుచునే

ఉందును. నేను కర్తవ్యముచు మానినచో ఇతరులును ప్రమత్తులై వారి కర్తవ్యములను వదలుదురు. దానివలన వర్ణసాంకర్య మేర్పడును. కాన కర్మఫలాసక్తిలేని ప్రాజ్ఞుడు తన విధ్యుక్త కర్మములను వీడక ఇతరులు వాని ననుసరించు నట్లు జేయువలెను-

ప్రకృతి సహజమునగు గుణములు మూడున్నవి. సత్వము రజస్సు తమస్సు. మనుజునిచే పనులు చేయించు చున్న శక్తులవియే. కాని తానే తన కార్యములకు కర్తనను అహంకారము గల మనుజుడు మూఢుడగును. కర్మలు ఇంద్రియగుణ ప్రవర్తితములని యెఱిగిన జ్ఞాని అట్టి కర్మలం దాసక్తిని పొందడు.

అర్జునా! నీవు బుద్ధిశాలివి. నే నింతవరకు నుడివిన విషయములన్నిటిని మనసునం దుంచుకొని, ఒక ముఖ్యమగు మాటను చెప్పుచున్నాను వినుము నీవు చేయు *సర్వ కర్మములను నాకు సమర్పించి, ఎట్టి కోరికలు మమకారము లేక బుద్ధిని ఆత్మయందు నిలిపి, నీ సందేహములను విచారమును పారద్రోలి నీ కర్తవ్యమగు యుద్ధమును నీవు చేయుము- యుద్ధమును మాటయేల ఎవరేపని చేసినను ఈవిధముగ చేయుచో వారు కర్మబంధ విముక్తులే. ఈ నా చెప్పిన విధమునందు విశ్వాసములేక నిందించువారు మూఢులేగాదు

---

3-30 మయి సర్వాణి కర్మాణి సంన్యస్యాధ్యాత్మచేతసా
నిరాశీర్నిర్మమో భూత్వా యుధ్యస్వ విగతజ్వరః॥

సర్వభ్రష్టు లగుదురు- ప్రకృతికి అతీతుడై ప్రవర్తించుట ఎవరికైనను కష్టసాధ్యము. ఈ ప్రకృతిగుణములు ప్రకోపింప జేయు రాగద్వేషములకు మనుజుడు బానిస కాకూడదు. అవి యాతని శ్రేయస్సున కడ్డువచ్చు శత్రువులు- స్వధర్మము కంటె పరధర్మమే మేలుగా కనుపించినను పరధర్మాచరణము నందు ప్రమాదము లున్నవి. ఏమాత్రమైన లోపమున్నను స్వధర్మమే ఎన్నటికిని సుఖప్రదము-

ఇచ్చట అర్జునకొక ముఖ్యమైన సందేహము తోచినది. వెంటనే యిట్లడిగినాడు-

"కృష్ణా! నీవు చాల మంచి విషయములే చెప్పుచు న్నావు. నేను శ్రద్ధగా వినుచున్నాను. నీవు నుడువు మాట లనుబట్టి ఆచరణముకూడ కావలయును గదా. ఇక్కడే చిక్కు వచ్చుచున్నది- ఈ విషయమునుగూడ వివరించి చెప్పుము. నాసందియ మిది- విషయ వ్యాసంగము నణగించి విధివిహిత కర్మము లొనర్ప మనుచున్నావు. సరే మనుజుడు తనకిష్టము లేకున్నను పాపమార్గముల వెంట బోవుచున్నాడు, ఇది యెట్లు జరుగుచున్నది. ఇట్లు మానవుని బలాత్కారముగ తప్పుదారికి లాగుకొనిపోవు శక్తియేది" అని అర్జును డనగానే కృష్ణు డిట్లు విశదీకరించెను-

"అవును అర్జునా ఇట్టి విపరీతము జరుగుటకు కామము క్రోధము ఇవి రెండును కారణములు. ఇవి రజోగుణ సము ద్భవములు. ఎంత అనుభవించినను వీనికి తృప్తియనునది లేక

పాపము లొనరింపజేయును. మోక్షసాధన కింతకన్న శత్రువులు లేరు- అగ్నిని పొగ అద్దమున మాలిన్యము కప్పియున్నట్లు ఈ కామము ప్రబలి జ్ఞానమును కప్పివేయును- ఈ కామమే మనస్సును బుద్ధిని ఇంద్రియములను ఆవరించి ఆత్మకు మూఢత కల్గించి పాపచర్యలు చేయించును. కావున అర్జునా శాస్త్రజ్ఞానము తత్ప్రయోజనమును నాశనమొనరించు ఈ కామము నరికట్టవలెనన్నచో ఇంద్రియ విషయ ప్రాబల్యము మొదలంట త్రుంచి వేయవలెను. ముందు ఈ పనిని చేసినగాని తరువాతి పనులు సుకరములు గావు. ఇంద్రియములకంటె మనస్సు, మనస్సుకంటె బుద్ధి, బుద్ధికంటె ఆత్మ శ్రేష్ఠమని పెద్దలందురు. అట్టి ఆత్మనెఱిగి ఆయాత్మస్థానమునందే స్థిరబుద్ధి కలిగినవాడవు కమ్ము. నీ బుద్ధిబలము వలన ఈ కామమును తుదముట్టించుటయే మోక్షసాధనకు మొదటిమెట్టు-

## ౪ జ్ఞానయోగము

అర్జునున కిప్పుడొక క్రొత్త విషయము తెలిసినది. మనస్సు బుద్ధి బలహీనములుగా నుండుటవలననే మానవుడు పాపమార్గమునకు బలాత్కారముగ ఈడ్వబడు చున్నాడు. కామక్రోధము లణగినకొలదియు బుద్ధిబలపడును. సన్మార్గ మహిమ గ్రహింపగలుగును. ఇది అభ్యాసముతో రావలెను. ఒకనాడు తటాలున వచ్చిపడునది కాదు అని యేమేమో

లోలోల అనుకొనుచున్న అర్జునుని బుజముపై శ్రీకృష్ణుని చేయి తగులగానే ఒడలుపులకరించి అర్జునుడు సరుదుకొని కూరుచుండెను.

అర్జునుని జూచి కృష్ణుడు, "ఏమిటి బావా! నీవేదో ఆలోచనలో పడినట్లున్నావు. నేనిప్పుడు చెప్పిన విషయము క్రొత్తదేమీ కాదు. మనస్సులో లేనిపోని శోకం ఏదో పెట్టుకొని చేయవలసిన పని యేదో తోచని పరిస్థితిలో ఉండి కర్తవ్యము ఉపదేశించమని ప్రార్థిస్తే ఈ ధర్మరహస్యం చెప్పినాను నీకొఱకు కల్పించిన క్రొత్త సిద్ధాంతము కాదిది. నేను వెనుక యెప్పుడో సూర్యునికిది బోధించితిని, అతడు మనువునకు, మనువు ఇక్ష్వాకునకు దీనిని బోధించినారు. పద పడి రాజర్షులెందఱో దీనిని అనుసరించి ఆచరించినారు. నీవు నాకు ఆప్తమిత్రుడవు కాబట్టి నీకిది చెప్పినాను.

ఈ మాటలు వినగానే అర్జునునకేదో వింతగాతోచి "ఆగు ఆగు కృష్ణా; తొందరపడకు. సూర్యుడా మనువా వీరికి నీవు చెప్పితివా! ఇది అంతా చాల అసంబద్ధముగా కన్పడు చున్నదే. నిన్న మొన్న పుట్టి పెరిగినవాడవు సృష్టితో సమముగా వచ్చిన సూర్యునికి నీవు బోధించుటా, పోనీ మనువు మాత్రి మెప్పటివాడు. ఏదో గారడీ మాటలు చెప్పుచున్నావు".... అనుచున్న అర్జునుని శ్రీకృష్ణుడాపి "నెమ్మదిగా శ్రద్ధగా వినుమయ్యా అర్జునా, నేను చెప్పిన విషయములు జ్ఞప్తిలో ఉంచుమని చెప్పబోవునది వినుము. ఏమీ క్రొత్తగాని

వింతగాని నీకు కన్పడను. మాసినబట్టలు మార్చి క్రొత్తవి ధరించినట్లే ఒక దేహము శిథిలము కాగానే ఆత్మ మఱియొక దేహమున జేరును. ఈ మాట ముందే చెప్పితినిగదా. *నీవూ నేనూ ఈనాటివాళ్ళము కాదు. ఎన్నో జన్మములెత్తి యెత్తి ఇప్పుడిట్టులున్నాము. నిన్న నేమిజరిగినదో ఈదినమున జ్ఞాపక ముండకపోవచ్చును. అంతమాత్రమున నిన్న అనునది లేకపోయినదా. జన్మాంతర విషయములు కర్మవాసనల వలన అందఱికిని జ్ఞప్తిలో నుండవు. నేనట్టి కర్మబద్ధుడను గాను. ఆదినుండియు నాకన్నియు స్మృతిలో నుండును. సృష్టి అంతయు నా ఆధీనములో నున్నది. నేను పుట్టుకలేనివాడను, అయినను నా స్వశక్తిచే నాకు నేనవతరించుచుందును. నే నవతారము దాల్చినపుడు ప్రాణికోటి కెల్లరకు ధర్మోపదేశము చేయుచునే ఉంటిని. కాని కొందఱిని పెడచెవిని పెట్టి కామ క్రోధ లోభ మోహములకు లోబడి మద మత్సరములతో విపరీత ప్రవర్తనకు దిగి క్రమముగా లోకకంటకు లగుచుందురు. ఈ విధముగ ధర్మమునకు * జగత్తున హానికలిగినప్పుడు

---

4-5 బహూని మే వ్యతీతాని జన్మాని తవ చార్జున
తాన్యహం వేద సర్వాణి న త్వం వేత్థ పరంతప.
4-7 యదా యదా హి ధర్మస్య గ్లానిర్భవతి భారత
అభ్యుత్థాన మధర్మస్య తదాత్మానం సృజామ్యహమ్.
4-8 పరిత్రాణాయ సాధూనాం వినాశాయ చ దుష్కృతామ్
ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగే యుగే.

దుష్టులను శిక్షించి సాధుజనులను రక్షించి ధర్మము నుద్ధరించుటకు ప్రతి యుగమందును నన్ను నేను సృజించుకొందును.

వినుచున్నావా, అర్జునా! ఈవిషయమై మఱికొంత స్పష్టముగా చెప్పుచున్నాను వినుము. వేద వేదాంత ధర్మము నెఱిగి తదనుగుణముగ వర్తించుటకు జనులకు మనస్సును బుద్ధిని ఇచ్చినాను. వీనినన్నిటిని వీడి దుర్వర్తనులైన దుష్టులను నేను శిక్షింతుననగా అది ద్వేషముచేత కాదు నాఅనుగ్రహము చేత వారిని మంచిదారిని పెట్టుటకే. నాయీ మతమును అలౌకికములగు నా జన్మ కర్మముల యథార్థతత్వమును ఎఱిగినవారు నన్ను సేవించి నా సాయుజ్యము పొందుదురు. ఎవరు ఏమార్గమున ఏభావముతో సేవింతురో వారికావిధముగనే కామితార్థసిద్ధి నిచ్చెదను. జీవనగమ్యమగు మోక్షము నాసించక కొందఱు సులభ సాధ్యములగు తాత్కాలిక సుఖప్రాప్తికి ఇతర దేవతలను పూజించుచుందురు.

*గుణమునుబట్టి కర్మమును బట్టి బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్రులను నాలుగు వర్ణముల నేర్పఱచినది నేనే అర్జునా. సృష్టికర్తను గూడ నేనే. ప్రజలను వారి వారి పూర్వ కర్మానుసారము గుణానుసారము ఆయా వర్ణములలో పుట్టునట్లు చేయునది నేనే. కాని నన్నీకర్మలంటవు. నేను

---

4—13 చాతుర్వర్ణ్యం మయా సృష్టం గుణకర్మవిభాగశః
తస్య కర్తారమపి మాం విద్ధ్యకర్తారమవ్యయమ్.

ఆత్మస్వరూపుడను గనుక. ఈ రహస్య మెఱిగి మోక్షాభిలాషు లైన పూర్వరాజు లెందఱో మంచి కర్మలొనర్చి ధన్యులై నారు. జనకాది చక్రవర్తు లట్టివారే. మనస్సులో సందేహాలు పెట్టుకొనక నీవును అట్లే చేయుము. ఇట్టి ధర్మ కర్మాచరణములో వింతగాని క్రొత్తగాని లేదు.

అర్జునా! నేను గ్రహించితిని. నీవేదో అడగబోవుచున్నావు. ఒక క్షణం ఆగు. నిజమునకు ఈ కర్మను గూర్చి చెప్ప వలసినవి విశేషాలున్నవి. వాటినికూడ విను. సృష్టికార్యం నేనే నిర్వహించుచున్నానని చెప్పినాను కదా. అయితే ఇందులో నాకేదో స్వలాభం ఉన్న దనుకొనవద్దు, నేను ఫలాశ లేనివాడను. నన్నీ కర్మలంటవు. కర్మ అనగా ధర్మ సమ్మతమైన పని. చేయగూడని పని వికర్మ. దానిని త్యజించ వలసినదే. కర్తృత్వబుద్ధి ఉండినను ఏవిధమైన కర్మఫలాపేక్ష లేనిది అకర్మ. అభిమాన శూన్యములు, ఫలవాంఛారహితము లైన కర్మము లొనర్చువాడే ప్రాజ్ఞుడు మేధావి. కర్మఫల సుఖదుఃఖాలకు కట్టుబడనివాడు ఏమీ కర్మ చేయనివాడే. వానికి కర్మబంధములు లేవు. నీ విషయమే ఆలోచించు అర్జునా. నిన్ను యుద్ధము చేయమనుచున్నాను. దుర్మార్గ విధ్వంసనము క్షత్రియుడవైన నీకు ధర్మము గనుక అట్లని నాను. "ఈ యుద్ధమున నేను గెల్చెదను, రాజ్యభోగము లనుభవించెదను ప్రజలు నాకు బ్రహ్మరథము పట్టెదరు" అని నీమనసులో ఆశ యున్న యెడల నీవీ కర్మబంధములో పడెదవు.

హింసాపాపముకూడ నిన్ను చుట్టుకొనదు. నేను చెప్పినట్లు 'ఓడినా గెలిచినా భగవన్నిర్దేశానుసారము స్వధర్మ కర్మముగా యుద్ధము చేయుచున్నాను' అని భావింతువా ధన్యుడవే. కర్మము నిన్నేమియు చేయదు. జ్ఞానాగ్నిచే అది దహింపబడినట్లే.

నీవు గ్రహించితివో లేదో నేను చెప్పెదననిన కర్మ రహస్య మిదియే. ఇట్టి భావము గభాలున వచ్చునది కాదు. కొంత నిశ్చలమైన సాధన కావలయును. లౌకికమైన వాంఛలను వీడి మనస్సును తక్కిన యింద్రియములను తన వశములో నుంచుకొని కార్యసిద్ధిని అసిద్ధిని సమబుద్ధితో జూచు ఎవ్వడైనను వాడు కర్మబుద్ధుడుగాడు. ముక్తుడే. వాని కర్మము యజ్ఞ సమానమైనది. అనగా లోకకళ్యాణార్థము జరిగినది. ఇట్టి యజ్ఞము చేయువాడు, చేయునది, చేయించువాడు చేసినదానికి ఫలము అంతెయు ఆత్మరూపుడైన బ్రహ్మమే' అది భగవత్ప్రీతికరమైన సమర్పణమే.

కృష్ణుడు ఇప్పుడు నుడువుచున్న ఈ మాటలు సర్వము అర్జునుడు వినుచుండెను గాని మనస్సున కంతగా ఎక్కలేదు. కొంచెము ధైర్యము తెచ్చుకొని "కృష్ణా నీవు చెప్పున వన్నియు వినుచున్నాను. మధ్య మధ్య కొన్ని సందేహాము లుదయించుచున్నవి. క్రొత్త విషయము వినునప్పు డెవరికైనను ఇట్లేగదా. నన్ను మాటలాడకుండ చేయుచున్నావు. నామాట కూడ కొంచెము వినవయ్యా, యజ్ఞమనునది ఎవరో

ఆచారనిష్ఠులకు కదా. అందఱికి ఎట్లు వర్తించును. ఈ విషయము మాకింకొంత వివరముగా వినవలెనని ఉన్నది." అనగనే శ్రీకృష్ణుడు "అర్జునా నీ ప్రశ్న మంచిదే విను. యజ్ఞమనగా నీవు అగ్నిహోత్రములు, హోమములు, వివిధ దానాదులు, మంత్రపఠనము, బలులు మొదలైనవి అని ఊహించుచుంటివేమో. వాని విషయ మట్లుంచుము. మూల విషయము ముందే చెప్పితినికదా. భగవత్ప్రీతికరమైనది యజ్ఞము, అది దేవతారాధన అని — ఏ రూపములో నయినను ఇది జరుగవచ్చును. విషయాసక్తిని నిరోధించి ఇంద్రియ నిగ్రహము కొందఱు పాటింతురు. అనగా ఇంద్రియములను నిగ్రహమను అగ్నియందు ఆహుతి చేయుటే. ఈదశలో విషయ సుఖాసక్తి ఆహుతి అయినట్లే కొందఱు బాహ్యకర్మలను వదలి ఆత్మావలోకనము చేయుదురు. తీర్థయాత్రలు హోమకర్మాదులు చేసినను, ద్రవ్య దానాదులు వేదాభ్యాసము చేసినను, తుదకు ఉచ్ఛ్వాస నిశ్శ్వాసములను నియమబద్ధము చేసినను భగవత్కైంకర్యముగా చేయుచో యజ్ఞమే. ఈ సాధనలన్నిటికొఱకు మనో దేహములను తేలికగా వశము నందుంచుకొనుట కవలంబించు ఆహారనియమము కూడ యజ్ఞమే. ఇవియన్నియు యజ్ఞములుగా భావింపబడిన సత్కర్మములు. ఈవిధముగా యజ్ఞములు పాప పరిహారములయి యజ్ఞశేషమును భుజించువారికి బ్రహ్మసాయుజ్యము లభించును. యజ్ఞము లొనర్పని వానికి ఐహికాముష్మికములు రెండును లేవు ఇప్పుడు చెప్పిన వన్నియు వేదోక్తములు కర్మ సంబం

ధములైన యజ్ఞములు. ఈ విచక్షణ మెుక్కింత నీవెఱు గుము.

అర్జునా! ఈ విషయమై మఱియొకమాట జ్ఞాపక ముంచుకొనవలె. కర్మ (భౌతికవస్తు) సంబంధములగు యజ్ఞ ములు గాక, జ్ఞాన యజ్ఞములు వేఱుగ నున్నవి. ఈ రెండు విధములును పరమాత్మ ప్రాప్తికి మార్గము లేమైనను, వీనిలో జ్ఞానయజ్ఞ ముత్తమమైనది. కర్మ కూడ జ్ఞానమునందు పరి సమాప్తమగుచుండుటయే దీనికి హేతువు. కర్తయొక్క మనో భావమునకెక్కువ ప్రాధాన్యముండుట కూడ గమనింపదగిన విషయము. జ్ఞానమునకు మన మనస్సునే కాదు మన సర్వ స్వమును పరిశుద్ధముచేయు మహిమయున్నది. ఈ జ్ఞానమును గ్రహించగలిగితే ఈ విశ్వమునంతయు నీయందు నాయందు చూడగలవు. ఈ జ్ఞానమందు కర్మమంతయు భస్మముకాగలదు. అన్ని దేహములందున్న జీవాత్మ ఒకటే అను జ్ఞానము నీవు తెలిసికొన్నపుడు ఈ యుద్ధములో నీ తాతలు తండ్రులు అన్నదమ్ములను చంపుచున్నాను అనే మూఢత్వము నీకు ఉండనే ఉండదు. మహాపాప మనదగు కర్మమును గూడ ఈ జ్ఞానము పావన మెునర్చును.

మఱి ఈ జ్ఞానమును పొందువిధము ఎట్లు. ఈ ప్రశ్న నీకు సహజముగనే రావచ్చును. దీనికి గూడ నా ప్రత్యుత్త రము వినుము. తత్త్వవేత్తలు ఆధ్యాత్మిక జ్ఞానులును ఉన్నారు

వినయ విధేయతలతో సాష్టాంగ ప్రణామములతో వారిని ప్రార్థించుము. వారునీకే జ్ఞానోపదేశము చేయగలరు. వారి ఉపదేశము సర్వము శిరోధార్యముగా గ్రహించు.

జ్ఞానసముపార్జన చేసినట్లయిన మఱి జీవనయాత్రలో నిరోధములను మాటయే ఉండదు. తనయందే బ్రహ్మమును చూచును. ఇది యెలాసాధ్యము. శ్రద్ధ, ఏకాగ్రభక్తి దీనికి సోపానములు. ఇంద్రియ నిగ్రహము, జ్ఞానము ఉపలబ్ధమై ముక్తి అను పరమశాంతి ఈ సాధనవలన లభించును. ఈ యోగము నభ్యసించి కర్మలను త్యజించి, నీ సంశయము లన్నిటిని నిర్మూలము జేసికొని నీ యుద్ధధర్మమునకు లెమ్ము. అర్జునా ఇప్పటికైనను నామాటలు విని జంకు గొంకులుమాని నీ ధర్మము నిర్వర్తించుము.

## ౫. కర్మ సన్యాస యోగము

అర్జునునకు గల కర్తవ్యమేదియో నుడివి కృష్ణుడొక క్షణమూరకుండెను. తాను చెప్పిన మాటలలో ఒక సందిగ్ధము స్పష్టముగా కనుపించుచునే యున్నది; అర్జునుడు సునిశితబుద్ధి. దీనిని గ్రహించగలడనే ధైర్యముతోడనే కృష్ణుడు మిన్నకుండుట. కృష్ణునకు కావలసినదియు నిదియే. అప్పుడు తనపని సులభముగా నెఱవేఱును. సమయము దొరకినది. వెనుకాడకుండ అర్జునుడు ఇట్లడిగినాడు.

"కృష్ణా ఏమిటయ్యా నీ పన్నుగడ. నన్నింతకంతకు అయోమయస్థితిలో పడవేయుచున్నావు. ఇంతవరకు నీవు చెప్పినదేమి. జ్ఞానయోగము నభ్యసించి కర్మలను త్యజించి పరమాత్మ దర్శనము పొందుము నీ కర్మలన్నియు నశించి ముక్తుడవగుదువు అని చెప్పినవాడవు మరల అదే వరుసలో లెమ్ము నీ కర్తవ్య యుద్ధమునకు నడుము కట్టుము అనుచున్నావు. నీవే పరస్పర విరుద్ధములైన పద్ధతులు చెప్పినచో నేనేమి చేయవలెనో నాకు తెలియుటలేదు. ఈ కలగలుపు పలుకు లెందులకు. చెక్కాబద్దా క్రింద నాకు మేలైన ఒక పద్ధతి నిశ్చయముగా చెప్పలేవా. దీని కొఱకేగదా నిన్ను ప్రాధేయపడి అడుగుచున్నది."

అర్జునుడు చాలవరకు దారికి వచ్చినట్లే. కృష్ణునకు లోలోపల తృప్తికలుగుచున్నది. పైకి మాత్రము గంభీరముగా కనబడుచు అర్జునుని జూచి

"అవునవును ధనుంజయా, నీమాట కాదనను, కాని ఏ విషయమునైనను సమగ్రముగ పరిశీలింప వలయునుగదా. ఒకగమ్యస్థానమునకు రెండుత్రోవ లున్నచో ఆరెండిటి ప్రయోజనములను స్పష్టముగ నెఱిగి అనుకూలమైన దారినిబట్టి పోవుట సమంజసము. నీవు గ్రహించిన రెండుమార్గములు కర్మ సన్యాసము కర్మాచరణము, రెండును మోక్షదాయకములే,

*కాని కర్మాచరణము శ్రేయస్కరము. కర్మఫలములందు రాగద్వేషములు లేనివాడు సన్యాసితో సమానమే. ఈ రెండు పద్ధతులు వేర్వేఱనుకొనుట కేవలము అజ్ఞానము. ఏవిధ మనుసరించి కృతకృత్యుడైనను ఫలస్వభావ మొక్కటియే. నిజమునకు కర్మానుష్ఠాన మెఱిగిన పిదపగదా కర్మసన్యాసమును పొందుట. కర్మయోగులకు జ్ఞానులకు గమ్య మొక్కటియే.

కర్మాచరణము శ్రేయస్కరమంటిని. ఈకర్మయోగము గూర్చి కొంచెము ఆలోచింపుము. నీవు వలదనినను ఇంద్రియములు వానిపనిలో నవి వర్తించుచునే ఉండును. కనులు తెఱచుచున్న, మూయుచున్న, నిద్రించుచున్న, ఉచ్ఛ్వాస, నిశ్వాసములు జరుగుచుండును. నీకు తెలియకుండగనే ఈపనులు జరుగును. ఇట్టుల నీయింద్రియములు ఏదోయొక కర్మమునకు పొరబడుచునే యుండును. ఈదశలో నిషిద్ధ దుష్కర్మములకు దూరముగా నుండగలుగుట నీబుద్ధిక్షేమమునకు నిదర్శనము. నీధర్మకర్తవ్యమున నీవు ప్రవర్తించునపుడు నీకు ఉండవలసిన భావ మొక్కటియే. నేను కర్తను, ఈకార్య ఫలము నాదిఅను మమకారమును త్యజించుట. నా యీ కార్య నిర్వహణము భగవదాదేశము; ఫలమేమైనను అది భగవదర్పణమే అని నిష్కల్మషబుద్ధితో భావించు. ఈవిధముగా కర్మసంగము వదలి సుఖదుఃఖ ద్వంద్వమున సుస్థిరమైన సమ

---

5-2 సంన్యాసః కర్మయోగశ్చ నిఃశ్రేయసకరావుభౌ
తయోస్తు కర్మసన్యాసాత్ కర్మయోగో విశిష్యతే.

బుద్ధి అలవడినచో యతనికైనను మఱి కావలసినదేమి. ఇదియే జ్ఞానసిద్ధి. ఇహమున శాంతి, పరమున మోక్షము అతనికి కరతలామలకములు. ఇక రాగద్వేషాదులు వదలుకొనలేక ప్రవర్తించువానిగతి యందువా, కర్మపాశబద్ధుడై కొట్టుమిట్టాడు చుండవలసినదే. వాని జీవన మధఃపతితమే. జితేంద్రియునకు ముక్తసంగునకు సర్వమును సౌఖ్యప్రదమే. అర్జునా నీవు అట్టివాడ వగుము.

ఇచ్చట నుఱొకసంగతి కూడ గ్రహించు. కర్మములకు గాని కర్తృత్వబుద్ధికి గాని కారణము పరమాత్మకాదు. ప్రకృతి సర్వవ్యాపియగు అవిద్య ఇదియే కర్మములను చేయించునది. ఈ కర్మఫలములుగ దేవమానవ పశుపక్ష్యాది జన్మములు కలుగవచ్చును. ఈ పాపపుణ్యములతో సంబంధములేని నిర్వికారుడు పరమాత్మ. అయితే ఈ పరమాత్మతో నరునకేమి సంబంధమున్నది అనుకొందువేమో, అట్టి ఆలోచన అజ్ఞానమునుండి బయటకు వెలువడలేనిదుస్థితి. ఈమాయయే బుద్ధిని కప్పివేసి మానవుని తప్పుదారి పట్టించును. ఈ మాయకు లోబడిన కార్యములే ఇంద్రియముల స్వేచ్ఛావిహారములు. ఈ అజ్ఞానముపోయి జ్ఞానమను వెలుగులోనికి వచ్చుటయే ఆత్మజ్ఞానము, అదియే బ్రహ్మనిష్ఠ. వారిఆత్మయే బ్రహ్మము. సంసారబంధము గాని కర్మబంధము గాని మరలలేనట్టి మోక్షానందమును అతడు పొందును— ఈ తత్వజ్ఞానము లేనివాడు

తానేకర్తను అని ధర్మఫలభోగములు తనవేననియు విర్రవీగుచు అహంకారమగ్నుడయి అధఃపతితు డగును. ఫలితము తన కనుకూలముకానిచో, దైవదూషణకు గూడపాల్పడును— ఆ దుర్గతికి అంతుండదు.

ఆత్మజ్ఞానము గలవారు అన్ని ప్రాణులలో గల పరమాత్మ స్వరూప స్వభావాలను చూడగలుగును - అతనికి ప్రాణకోటి అంతయు సమానమే. *ఇది కుక్క, ఇది ఆవు, ఇది ఏనుగు, ఇది పంది, ఈతడు విద్వాంసుడు, వీడు ఛండాలుడు అనే బాహ్యాకారములపై అతని దృష్టిగాని భావముగాని భేద బుద్ధితో ప్రసరించదు. అన్నిటియెడల సమబుద్ధి అలవడును, ఎవరికిట్టి ఆత్మదర్శనభాగ్యము సమబుద్ధియు కలుగునో అతడు బ్రహ్మానుభవ ఆనందము ననుభవింపగలడు. విషయ సంబంధములైన సుఖములతో అతనికి పనియే లేదు — అర్జునా, సమబుద్ధి సమత్వదృష్టియని నీకు పదేపదే చెప్పుచున్నాను - దీని యందలి అర్థమును సూక్ష్మముగ పరిశీలింపుము - ఏనుగునకు అంబారీవేసి ఊరేగింతుము, పందికి అట్లుచేయము; గోవును పూజించి నమస్కరింతుము, కుక్కకు అట్లుకాదు. సమదృష్టి బాహ్యాశరీరములపై గాదు, అన్నిజీవులలోనున్న ఆత్మఒక్కటే

5–18 విద్యావినయసంపన్నే బ్రాహ్మణే గవి హస్తిని
శునిచైవ శ్వపాకేచ పణ్డితాః సమదర్శినః.

అది పరమాత్మ. అంశ అని అన్నిటిని సమానభావముతో చూడ గలిగినవాడే ప్రాజ్ఞుడు - సర్వవ్యాపి అయిన ఆత్మస్వభావ మును దర్శింపగలిగినవానికి సమబుద్ధి సహజముగానే అలవడ గలదు -

ఇట్టి సమభావస్థితి ఎప్పుడో తెచ్చుకొనవచ్చునను అల సత్వము కేవలము పరాఙ్ముఖమే. శరీర పతనమునకు ముందే ఈ ఆత్మజ్ఞానము రావలెను. పవిత్రము, జ్ఞానప్రకాశ మయమైన ఆత్మభావమునందే క్రీడించుచు ఆసౌఖ్యానుభూతిని పొందు నతడు అవ్యయమైన ముక్తి సుఖమందును. ఋషులందరు అట్టి బ్రహ్మభావులైన జీవన్ముక్తులే. వారు పాపదూరులు జితేం ద్రియులు సర్వభూతహితులు అగుటయే వారిసిద్ధికి హేతువు. ఆత్మజ్ఞానానుభవులైన ఆ యోగులు మరణమునకు పూర్వము అనంతరముగూడ అవ్యయమైన ఆ మోక్షస్థితి యందుందురు.

అర్జునా ఇట్టిమహానుల ధ్యానముద్ర ఎట్లుండుననుకొను చున్నావు. విను. ఇంద్రియములను గాని మనస్సు గాని బాహ్య విషయములపై పోనీయరు - దృష్టి భ్రూమధ్యమున నిలిపి యుందురు. ఉచ్ఛ్వాస నిశ్వాసములందు ప్రాణాయామ నియ మము గలిగి, సర్వవ్యాపియగు పరమాత్మ భావమునందే హృదయమును లగ్నమొనర్తురు - అట్టి యోగికి ధ్యేయమైన పరమాత్మ పదార్థమును * నేనే. యజ్ఞ తపస్స్వరూపములు

5-29 భోక్తారం యజ్ఞతపసాం సర్వలోకమహేశ్వరమ్
సుహృదం సర్వభూతానాం జ్ఞాత్వా మాం శాన్తి
మృచ్ఛతి.

సర్వభూత మహేశ్వరుడను నేనే అనియు, సర్వభూతహితుడను నేనే అనియు, నన్ను దెలిసికొని పరమపదశాంతి నందుదురు.

అర్జునా ఇప్పుడు నీకు అవగతమైనదా. ఫలాపేక్షగాని ఫలస్వభావమును ఎట్టి రాగద్వేషములుగాని లేక, భగవదర్పితమైన సత్కర్మాచరణయే కర్మసన్యాసము - సర్వభూతాంతరాత్మను సర్వలోకేశ్వరుడను నేనే. విధియుక్తముగ నన్నే ధ్యానించుచు నీ కర్తవ్య నిర్వహణమునకు నిస్సంశయుడవై లెమ్ము - పరమశాంతిని పొందగల్గెదవు.

## ౭. ఆత్మసంయమ యోగము

అర్జునుడు వినుచున్నాడు. శ్రీకృష్ణుని ప్రబోధము సాగుచున్నది - అర్జునా మనమిప్పుడు రణరంగమున నడిబొడ్డున ఉన్నాము. ఇటు మనవారు అటు కౌరవసైన్యము యుద్ధమెప్పుడెప్పుడాయని పరవళ్ళు త్రొక్కుచున్నారు. యుద్ధారంభ సమయ మతిక్రమించరాదు, నేనింకను చెప్పవలసిన సంగతులున్నవి. ఇంతవరకు మూల సూత్రములైన ఆత్మ స్వభావము, కర్మయోగము, జ్ఞాననిష్ఠ, కర్మసన్యాస మన నేమియో వివరించితిని. వానిని మనసునం దుంచుకొనినచో మరల నే చెప్పబోవు విషయములు స్పష్టములగును - అని నుడువగానే అర్జునునకు తానేదో క్రొత్త లోకములకు బోవు చున్నట్లైనది- కృష్ణుడు విడచునట్లు కనుపించుట లేదు-

అతడు నుడువు మాటలేవియో శ్రద్ధగావిని అతడు నిర్దేశించిన ప్రకారము చేయుటయే మంచిదనుకొని "కృష్ణా నీవుచెప్పునది సాంతము సాగనిమ్ము నేను శ్రద్ధగానే వినుచున్నాను. తుదకేమి చేసినను నీదేభారము" అని అర్జును డూరకొనినంతనే శ్రీకృష్ణుడు-

ధనంజయా అయితే శ్రద్ధగా విను. చివరగా నేను చెప్పినది కర్మసన్యాసమునుగూర్చి. ఆ విషయమును తిరిగి మనము చేయవలె. "ఈ పనిని ఏదియోవిధముగా చేయుచున్నాములే దానిగొడవ మనకెందులకు" అనిన స్తబ్ధత్వము కర్మసన్యాసము కాదు. యజ్ఞయాగాదులు తటాకాది నిర్మాణములు వదలినంత మాత్రమునను కాదు. అహంకారము మున్ముందు నిర్మూలనము కావలెను. ఇది భగవత్ప్రీతికరమైన కార్యము. ఫలితమెట్లున్నను చేయుట నా విధి. ఈ కర్మఫలాపేక్ష నాకు లేదు అను చిత్తశుద్ధితో ప్రవర్తించుట కర్మసన్యాసము. ఈ కర్మ యోగానుష్ఠానము వెనుక బలమైన సాధన ఉన్నపుడే ఇది ఆత్మజ్ఞానమును కలుగజేయును. అర్జును డంతటిలో "ఒక్క క్షణము ఆగు కృష్ణా ఇప్పుడు నీవుచెప్పునది స్పష్టముగనే ఉన్నది. కాని ఏదియో సాధన కావలెననుచున్నావు. దానికనుకూలమైన మార్గములు విశదముగా వినవలెనున్నది" అని ముందునకురాగానే శ్రీకృష్ణుడిట్లు మరల తన భాషణము సాగించెను.

"అర్జునా నీకీమాత్రము ఆసక్తి కలిగినది. మంచిదే- సాధన అనినంతనే అడవులకేగుటో, కొండలెక్కుటో, గుహలందుండుటో అనుకొనవలదు- సాధన అనగా ధ్యానశీలము. ఈ నిష్ఠలో కర్మయోగ మొకమెట్టు. దానిఫలము జ్ఞానసిద్ధి. ఆ సిద్ధినందిన యోగికి కర్మలతో అవసరము లేదు- ఇది సక్రమముగా సాగు మార్గమాలోచింపవలెను. ఈ సోపాన సరణి వేర్వేఱు కట్టుబడులు కావు. నది ముందునకు ప్రవహించినట్లు సిద్ధిగలుగువరకు యోగము ముందునకు సాగుచునే యుండును. నది వడిగా ప్రవహించుటకు ఇరుప్రక్కల నున్న గట్లు గట్టిగా ఎత్తుగనుండుట అవసరముగదా. అట్లే మనస్సు కట్టడిలో ఉండి ఇంద్రియములను విషయసుఖములవెంట ప్రక్కదారులకు పోకుండ చూడవలెను. అర్జునా! నీకు శత్రువయినా మిత్రుడయినా నీ యాత్మయేసుమా. అది వశమందు లేకపోయినచో జీవితము వ్యర్థమే. వశమందు ఉన్నదా- ఇంద్రియములపై విజయము సాధించినట్లే. అట్లు నిర్వికారమయిన మనస్సునకు ఎల్లెడల ఎల్లపుడు *పరమాత్మ రూపదర్శనమే అగును. వానికి బంగరైనను, మట్టిముద్దయినను ఒకటే. శత్రువు మిత్రుడు ఒకటే; ఉత్తముడు పాపి ఒకటే.

---

6-8 జ్ఞానవిజ్ఞాన తృప్తాత్మా కూటస్థో విజితేన్ద్రియః
యుక్త ఇత్యుచ్యతే యోగీ సమలోష్టాశ్మకాఞ్చనః॥

అర్జునా! నా మాటలు విని ఏదో ఆందోళన పడుచున్నట్లున్నావు. తొందరపడకు, శాంతముగా యోచించుము. నేననినది పాపిని శత్రువునూ కౌగలించుకొని, గౌరవించమని కాదు. ఇతనివలన నాకు సుఖము, అతనివలన నాకు కష్టము అను రాగద్వేషముల కతీతమైన సమబుద్ధి ధ్యానశీలికి కావలెను.

ఈ మనస్సాధనలో కొన్ని బాహ్యపరిస్థితులు, ఆహార విహారములలో నియమము ముఖ్యము. స్థలము నిర్జనమైనచో బాహ్యాకర్షణల బాధ ఉండదు. ఏకాకిగా ఉన్నచో మఱింత అనుకూలము. సమతలమగు ప్రదేశమున దర్భలు, వానిపై మృగాజినము, దానిపై శుభ్రవస్త్రముగల ఆసనమున కూర్చుండి– శరీరము, కంఠము, శిరస్సు స్థిరముగా నిట్టనిలువుగా నుంచుకొని, దృష్టిని నాసికాగ్రమున కేంద్రీకరించి కోరికలు, ఆశలు లేకుండ మనస్సును నాపై లగ్నముచేసి నన్నే లక్ష్యముగా నెంచుకొని యోగమున నుండవలెను. మనస్సున సుస్థిరత్వము, నిర్భయము, ఏకాగ్రత, బ్రహ్మచర్యము ఈధ్యాననిష్ఠకు తగిన బలము– ఇంతేకాదు, మఱియొక విషయమున్నది. ఆహారపద్ధతులుకూడ ఈనిష్ఠ కనుగుణముగనే పాటింపవలెను. తిండిపోతుగాని, నిద్రమత్తుడుగాని కాకూడదు. అట్లని వానిని పూర్తిగ తగ్గించి దేహమును బాధింపరాదు. మితాహార నిద్రాదులు మనోదేహములకు ఉల్లాసకరములు. ఏకాగ్రధ్యానమునకే మితములైన పద్ధతులు తోడైనప్పుడు మనస్సు ఆత్మయందే ప్రశాంతముగ ప్రతిష్ఠితమై ఆమనస్సు

నకు మాత్రమే గోచరమగు ఆనందానుభూతి నిచ్చును. అదియే ధ్యానయోగసిద్ధి పరమాత్మభావము.

ఇట్టిది, అట్టిది అని ఈ ఆనందానుభూతిని వర్ణించి చెప్పుట చాలకష్టము. అర్జునా! జాగరూకుడవై వినుము. ఈసాధకుడు ఏస్థితియందు సుప్రతిష్ఠితుడై ఎప్పుడును చలింపకుండ ఉండునో, ఏది లభించినపిదప అంతకన్న అధికమైనది ఉత్తమమైనది విశ్వమున కానుపింపదో ఆ ఆనందానుభూతియే యోగసిద్ధి- సర్వము బ్రహ్మమే అను భావసుఖప్రాప్తి ఆసిద్ధి. అది పరమాత్మసాయుజ్యము- రాగద్వేషములుగాని, కోరికలు, విషయవాంఛలుగాని లేని ఆనిర్వికారనిర్గుణ స్థితియందు యోగి సమబుద్ధితో *సర్వభూతము లందును తన యాత్మను, తన యాత్మయందు సర్వభూతములను జూచును. సర్వభూతముల సుఖదుఃఖములు తన సుఖదుఃఖములుగా చూచును. ఇట్టి ఏకత్వదృష్టితో – అన్నిభూతములందున్న నన్ను భజించువాడే ఉత్తమయోగి. అర్జునా! అది ఇంద్రియవ్యాపారములకు అందని సమాధిస్థితి. ఆస్థితిలో ఆయోగి ధ్యానమంతయు నాయందే ఉండును. అతనిపై మిన్నువిఱిగిపడినను తెలియని నిశ్చల సమాధి అది.

---

6–29 సర్వభూతస్థమాత్మానం యోగీవిగతకల్మషః
సుఖేన బ్రహ్మసంస్పర్శమత్యన్తం సుఖమశ్నుతే॥

అర్జును డీమాటలు వినినాడు. ఆలోచించిన కొలది ఎప్పటికప్పుడే క్రొత్తగా కనుపించుచున్న కృష్ణునిమాటల కాశ్చర్యపడి అర్జునుడు– "కృష్ణా నాకుమరల అంతయు ఆశ్చర్యముగా నున్నదయ్యా. ప్రాతిసంగతు లనుచునే ఒకదాని కొకటి క్రొత్తవిషయముల జేర్చుచున్నావు. ఏకాగ్రత అనెదవు నిశ్చలసమాధి అనెదవు సరే. మనస్సు గాలికంటె చంచల మైనదిగదా. ఎటుఆకర్షణ కనుపడిన అచటకే పరుగెత్తు మనస్సున కీయేకాగ్రత కుదురునని తోచదు, అనిన వెంటనే కృష్ణుడు అర్జునునిజూచి 'పార్థా! నీవు చెప్పినట్లు మనస్సు చంచలమైనదే. దానిని సుస్థిరముగా ఉంచుట కష్టమే కాని అభ్యాసము వలనను లౌకికాకర్షణల యందు విరక్తిని పెంచుకొనుట వలనను ఆత్మనిగ్రహము అలవడి యోగసాధన సుకరమగును. నీకేమయిన ఇంకను సందేహమున్నదా అని నుడువగానే అర్జునునకు బాధ్యత సర్వము తనమీదనే ఉన్నటు లనిపించి కృష్ణా! సందియము లేకేమి నీవుచెప్పిన ఈధ్యాన సమాధి విషయములో ఒకపెద్ద సందేహామే ఉన్నది. దానిని నీవే తీర్చగలవాడవు. అభిలాష శ్రద్ధ రెండును పూర్ణముగా సాధకునకు కలవనుకొనుము. అభ్యాసము ప్రారంభించి తుదకు ఆత్మనిగ్రహము సరిగా కుదరనిమనిషి ఎందునకుగాక భ్రష్టుడు కావలసిన దేనా. వానికి మతి దారిలేదా. కృష్ణా ఈవిషయము కొంచెము చెప్పగలవా అని ఊరకుండిన అర్జునుని జూచి శ్రీకృష్ణుడు పార్థా ఆ భయ మక్కఱలేదు. నేను నుడి

విన * యోగాభ్యాస పరాయణుడు ఎన్నటికిని చెడడు. అతడు యెక్కువైనను తక్కువైనను చేయగలిగినంత ప్రయత్నము నకు ప్రతిఫలముగా పుణ్యలోకములకు పోయి చాలకాలము వసించి తిరిగి పవిత్రవర్తనులుగాని శ్రీమంతులుగాని విద్యా వంతులుగాని అయినవారియింట జన్మించి తనపూర్వవాసనల వలన మరల అధికముగ యోగాభ్యాస పరాయణుడై సిద్ధి నందును. కొన్నిజన్మలు పట్టునుగాక, అతనికి క్రమక్రమముగా పాపవిమోచనముగలిగి పరమపదము లభించుట తథ్యము- అతనిసిద్ధికి ఏ తపము ఏ వేదకర్మాచరణముకూడ చాలదు. ముఖ్యముగ కావలసినది సాధకుని అంతరాత్మ నాయందు లగ్నమై నన్నేశరణ్యునిగా నెంచి అతడు భజించుచున్నచో అతనిని నేను పడుపను, యోగులలో ఉత్తమునిగా భావింతును, అర్జునా ఈమాటలు విశ్వసించి నీసందేహము లన్నిటినీ త్యజించి నీవు అట్టిసాధకుడవు కమ్ము.

## ౭. జ్ఞానవిజ్ఞానయోగము

అర్జునా నామాటలందు నీకు క్రమక్రమముగా సమ్మ కము కుదురుచున్నట్లున్నది. శ్రద్ధగా వినుటయేకాక సంద ర్భోచితముగా మంచి సందేహములనే అడుగుచున్నావు- ఆ

---

6-41 ప్రాప్య పుణ్యకృతాం లోకానుషిత్వా శాశ్వతీస్సమాః
శుచీనాం శ్రీమతాం గేహే యోగభ్రష్టోఽభిజాయతే॥

విషయములను గూర్చి స్పష్టముగ తెలిసికొనుచున్నావుగూడ. యోగాభ్యాసమునుగూర్చి వివరముగనే నీకు తెలిపితిని. ఇక ఈ యోగము వలన నన్ను సంపూర్ణముగ తెలిసికొను జ్ఞాన మార్గము నుడివెదను వినుము. ఈ జ్ఞానము గ్రహించినచో మఱి తెలిసికొనవలసిన దేమియు లేనట్లే. యదార్థమునకు ఈ జ్ఞానపిపాస గలవారు అరుదు- *వేయిమందిలో ఒకడుండు నేమో. అట్టి పిపాసువులు వేయిమందిలో ఏఒక్కనికో సిద్ధి లభించును-

ఒక్కసారి ఆ బయటకు చూడుము. భూమి నీరు అగ్ని వాయువు ఆకాశము ఉన్నవిగదా అవికాక నరునికి మనస్సు బుద్ధి అహంకారము ఉన్నవి. ఈ యెనిమిది- నాసంబంధమైన అపరాప్రకృతి. కేవలము జడమైనది- దీనికి అన్యమైన నా పరాప్రకృతి ఉన్నది. అది చైతన్యరూపము జగత్తున కంతకు ఆధారము- ఈరెండు ప్రకృతుల చేతనే సర్వచరాచర సృష్టి యేకాదు జగత్పోషణ విలయాది సర్వజగత్ప్రవర్తనము జరుగుచున్నది- ఏవస్తువునం దేగుణము భాసించునో- నీటి యందు రసము, సూర్యచంద్రుల కాంతి, ఆకాశమున శబ్దము వేదమున ఓంకారము, మేధావుల మేధ, బలవంతులలోని బలము ఇత్యాదు లన్నియు నేనే.

---

7-3 మనుష్యాణాం సహస్రేషు కశ్చిద్యతతి సిద్ధయే
యతతామపి సిద్ధానాం కశ్చిన్మాం వేత్తి తత్త్వతః॥

ఆమాట నటులుండనిమ్ము. సత్వరజస్తమో గుణము లనునవికూడ నాప్రకృతినుండి వచ్చినవే. కాని వానియందు నేను లేను. సముద్రమున తరంగము లున్నవి తరంగములందు సముద్రము లేనట్లే- ఈగుణములకు లోబడి ప్రజలనేకులు ఈ గుణప్రభావమగు మాయకు వశులై నన్ను తెలిసికొనలేకున్నారు. ఈ గుణములనుండి బయటపడుట కష్టము- మూఢులు దుశ్చరితు లయినవారిమాట చెప్పకుము. వారకి నేనక్కర లేదు- ఆపదలోనున్నవారు, సౌఖ్యమును కోరువారు, జ్ఞానాభిలాషి, జ్ఞాని, ఈనాలుగు తరగతులవారు నన్నుతలచి భజించుచునే ఉందురు. వారందఱు నాకిష్టులే. జ్ఞాని అనెదవా అతడే నేను. నేనే అతడు- పెక్కుజన్మములెత్తి సదా నన్ను ఆశ్రయముగోరి సర్వము వాసుదేవుడని తెలిసికొనిన మహాత్ముడు జ్ఞాని.

అర్జునా కొంద ఱవివేకు లుందురు. ఏవో వాంఛలు మనసులో పెట్టుకొని వానికిసంబంధించిన అన్యదేవతలను పూజింతురు. అయినను వారిని విడువను. వారి కాదేవతయందే భక్తిని పెంపొందింపజేసి దానికి తగినఫలమును ఇచ్చువాడను నేనే. కాని ఆఫలములు తాత్కాలికములు అల్పములు. నన్నుపూజించు వారిని తప్పక నాకడకే చేర్చుకొందును-

మాయకు లోనై నమూఢులు నన్నెఱుగరు. నన్ను సామాన్యునిగానే తలంతురు- నాకుమాత్రము భూతభవిష్య

ద్వర్తమానము లన్నియు ఎఱుకే. నాకు పుట్టుక అనునదే లేదు- సర్వజీవులు పుట్టుకతోడనే మాయామగ్నులై నన్ను విస్మరింతురు-

అందరూ అట్లుందురని అర్జునా తలంపకు- ఈ మాయా భ్రాంతినుండి బయటపడి నిశ్చలభక్తితో నన్నాశ్రయించు వారును ఉన్నారు- అభ్యాసఫలితముగ జరామరణముల నుండి కూడ వారు విముక్తులై, కర్మ బ్రహ్మము ఆధ్యాత్మ ఆ విష యముల సత్యమును గ్రహింతురు- నేనే అధిభూతుడను అధి దైవమును అధియజ్ఞమును. ఈభావమును కలిగి యున్న వానిగా నన్నెరిగినవాడు మరణకాలమునగూడ నన్ను మఱువక స్మరించును. అట్టివాని జన్మమే సఫలమైనది-

## ౮. అక్షర పరబ్రహ్మ యోగము

ఇంతవరకు శ్రీకృష్ణుడు చెప్పినది విని అర్జునున కిట్లు తోచినది- అంతకంతకు కృష్ణునిమాటలు చిత్రముగ నున్నవి- అద్భుతముగగూడ నున్నవి. అతడు సామాన్యుడుకాదు. ఋషీశ్వరుడు, గురువు. అదిగాక తానే లోకమహేశ్వరుడనను చున్నాడు. నిజమున కీయుద్ధములో నాస్వజనమును నాచేతు లతో చంపలేను వెనుకకుపోదును అనిన నన్ను వదలవచ్చునా, వదలడు. ఏవేవియో చెవులలో సూరి పోయుచున్నాడు- అతని ప్రబోధములు సముద్ర తరంగములవలె వచ్చి ముంచెత్తు చున్నవి.

మారణాస్త్రములు కాదు, అగ్నిలో పడవైచినను చచ్చువాడు లేడట; చంపువాడును లేడట. దేహమే నశించునది. ఆత్మ మఱియొక దేహమునకు పోవును. ఈయుద్ధము ధర్మయుద్ధము, నాస్వధర్మముగ నెంచి జయాపజయములపై ఆసక్తి లేకుండ నిష్కామముగ భగవత్ప్రీతి కార్యమని యెంచి చేయవలెను. ఈకర్మ నన్నంటదు. అట్లు నిష్కామముగ కర్మనొనర్చి మనస్సును నహంకారరహితమొనర్చి పరమాత్మయందు లగ్నముచేసి అతడే శరణ్యమని భావించి ధ్యానించుచో నిరుపమానము అవ్యయమగు శాంతి లభించును. పరమాత్మ సర్వాంతర్యామి. అన్నిభూతములం దుండును. ఆ సమాధిస్థితిలో సాధకునకు అన్నియు సమానమై తనలోనున్నట్లు తానన్నిటియం దున్నట్లు గోచరమగును. ఆ దివ్యదర్శనములో ఒక ఆనందానుభూతి యున్నది. ఆసిద్ధికి మించినది లేదు. అది పరమాత్మతో కూడికయే. ఇవి కృష్ణుని మాటలు. కృష్ణుడు సామాన్యుడు గాదు అతనిలోనుండి ఏదో అనిర్వాచ్యమైన మహాతేజ మిా సందేశమిచ్చుచున్నది. నమ్మదగినవిగనే ఉన్నవి. అయినను ఇంకను ఏమనునో చూచెదను. ఈరీతిగా ఆలోచించితుదకు అర్జునుడు ఏమియు తెలియని వానివలె

"కృష్ణా! ఇది యేమయ్యా నాకర్థముగాని మాటలు నుడువుచున్నావు. బ్రహ్మము కర్మ అధిభూతము అధిదైవము అధియజ్ఞము అని ఏవేవో పదాలు విసురుచున్నావు. ఆపైని ప్రాణం కడముట్టి మనిషి గిలగిల లాడుచున్నప్పుడు పరమా

త్మను స్మరించ మనెదవు ఇది సాధ్యమా ఇవన్నీనాకు తెలియు నట్లు కొంచెము వివరించి చెప్పు." అనిన పార్థునిమాటలు విని శ్రీకృష్ణుడు

"ఔను పార్థా! ఈమాటలు, ఈమాటల వెనుకనున తత్త్వమూ తేలికగా అర్థమయేదికాదు. నీవు శ్రద్ధగా వినెద ననుచున్నావు. నాకామాట చాలును. సంతోషముగా చెప్పె దను విను- ఇప్పుడేకదా నీకు పరాపర ప్రకృతి భావములను గూర్చి చెప్పినాను. వానికి సూక్ష్మమైన వివరణమే నేను చెప్ప బోవునది- బ్రహ్మమనగా విశ్వమునకు మూలకారణము నాశ రహితము సర్వోత్తమమైనది- ఆ ప్రత్యగాత్మ భావము జీవ సంజ్ఞతో భూతకోటి దేహములందు అంతర్వర్తిగానుండి అధ్యాత్మ అనబడుచున్నది- భూతకోటి ఉత్పత్తికి మూలములై దాన ధర్మాది త్యాగములతో కూడిన యజ్ఞ యాగములు కర్మలు. పుట్టుక చావు గలిగి నశించు స్వభావము గలిగిన వస్తువులు అధిభూతములు- శరీరములందు అంతర్యామిగా నుండుచు యజ్ఞప్రేరేపకుడనై యజ్ఞములందారాధింపబడు పరమాత్మరూపము అధియజ్ఞమనబడుదును నేనే. నిర్విరామ అభ్యాసము వలన మరణకాల మందైనను పరమాత్మనగు నన్ను స్మరించు బలము మనస్సున కేర్పడును. అట్లవసానసమ యమున నన్ను స్మరించువాడు నన్ను పొందును. ఇది నిస్సంశ యము- అర్జునా! అవసానదశ జన్మమునందలి ముఖ్యమైనది-

మరణదశయందు మానవున కేభావము కలదో మఱుజన్మమున అతడా భావమునే పొందును- నీకొఱకై ఇంత చెప్పుచున్నాను. యుద్ధము చేయుచుగూడా నన్నే స్మరింపుము. నీమనోబుద్ధులు నాయందే ఉండవలయును-

అర్జునా! సదా ధ్యానమునందుంచి స్మరింపవలసిన ఆ పరమాత్మరూపము ఎట్టిదనుకొనుచున్నావు. దానివర్ణనము జాగ్రతగా విని మనస్సున నిలిపి ఉంచు. అది మాయాతీతము భావాతీతము జ్యోతిర్మయము. ఎన్నిసూర్యబింబములైనను ఆప్రకాశమునకు చాలవు. వేదవేత్తలు అవ్యయము అవినాశి అనునదియు బ్రహ్మచర్యనిష్ఠులై యతులు ధ్యానించి పొంద గోరునదియు అదే. అదియే బ్రహ్మపదము-

ఇంద్రియముల నిగ్రహించి మనోబుద్ధులను స్థిరముగా ఏకాగ్రమొనర్చి ఆత్మయోగాభ్యాసమున ఓమ్ అనుప్రణవము నుచ్చరించుచు కుండలినీశక్తిని మేల్కొలిపి శిరమందున్న సహస్రారమువరకూ తీసికొనివచ్చి దేహమును వీడు యోగి పరమపదసిద్ధిని నిశ్చయముగ పొందును-

*నన్ను ఏకాగ్రచిత్తముతో అనుదినము నిరంతరము స్మరించువారికి నేను సులభసాధ్యుడనే. బ్రహ్మలోకమును

---

8-14 అనన్యచేతాః సతతం యో మాం స్మరతి నిత్యశః
తస్యాహం సులభః పార్థ నిత్యయుక్తస్య యోగినః ॥

చేరినవారికైనను పునర్జన్మ తప్పదు. కాని నన్ను పొంద గలిగిన వారి కిక జన్మసంసారబాధ అనేది ఉండదు- నా సాయుజ్య మనదగు పరమపదము యొక్క గొప్పతనమును కూడచెప్పెదను వినుము. సృష్టికార్యము నిర్వహించు బ్రహ్మకు ఒకపగలుఅనగా వేయియుగములు, రాత్రియుఅంతే. ఈపగటి కాలములో సకల బ్రహ్మాండోత్పత్తి జరిగి రాత్రి యగు సరికది లయము చెందును. తిరిగి దివారాత్రము లిట్లు సృష్టి లయములు పునరావృత్తము లగుచునేయుండును. ఆవిధముగ లయముగాని సద్వస్తువు అన్నిప్రమాణాలకు అతీతమైనది ఉన్నది. అది అక్షరము అవ్యక్తము పరమగమ్యము. నా యొక్క పరమధామ మదియే. దానిని చేరుకొనినచో తిరిగి పునర్జన్మము మాటయే లేదు-

ఇచ్చట మఱియొక సంగతినికూడ జాగరూకుడవై విను అర్జునా. సర్వాంతర్యామి, సర్వభూతాత్మకుడైన పరమాత్మను పొందుటకు భక్తి సులభమార్గము. దేహావిసర్జనకు యోగ్యము లైన సమయములున్నవి- అగ్ని జ్యోతి పగలు శుక్లపక్షము ఉత్త రాయణము ఆఱునెలలు పుణ్యదినములు బ్రహ్మమును చేరుటకు పవిత్రమైనకాలము. పొగ, రాత్రి, కృష్ణపక్షము దక్షిణాయన దినములలో మృతివలన చంద్రలోకప్రాప్తి కలిగి పునర్జన్మము కలుగును- వీనినే దేవయాన పితృయాన మార్గము లందురు కూడ. వీనియొక్క మహాత్మ్యము నిజము గ్రహింపగలిగినవాడు

మాయలోనుండి బయటపడినట్లే. వేదపాఠమును యజ్ఞ తపో దానములను మించిన ఫలము ఇందున్నది- కావున అర్జునా ఈ యోగవిధానమును విస్మరింపవలదుసుమా-

## ౯ రాజవిద్యా రాజగుహ్యా యోగము

తాను చెప్పిన మాటలన్నిటిని అర్జునుడు శ్రద్ధగావినుచు తిరిగి మనస్సులో మననము చేసికొనుచున్నట్లు శ్రీకృష్ణుడు గ్రహించగలిగినాడు. అర్జునుని ముఖమున సంతృప్తి ప్రస్ఫుటముగా కనుపించుచున్నది- ఈపట్టు విడువకూడదని భావించి శ్రీకృష్ణుడు కొంత చమత్కారముతో ఇట్లనెను-

"అర్జునా! నేను చెప్పుచున్నది నీవు శ్రద్ధగా ఏవిధమైన వ్యతిరేకభావము లేక వినుచున్నావు. ఇది నాకు చాలసమ్మత మైన విషయము- నీవిట్లు వినయవిధేయతలతో వినుచున్నావు గాబట్టె విద్యలలో రాజు అనదగినది అతిరహస్యమైన జ్ఞానవిషయమును గూడ నీకు చెప్పుచున్నాను. దీనిని సమగ్రముగా నీవు తెలిసికొనగలిగిన చాలు. నీకు భవముక్తిసంపద లభ్యమయినటులే. ఇది ఏదైన కష్టసాధ్యమయినవిద్య అనుకొనెదవేమో ఎంతమాత్రముకాదు సుమా. అతిపవిత్రమైనది అనంతమైనఫలమునిచ్చునది అనుమాట అటుంచి ఇది సులభముగ ఆచరింపదగినది అనుభవమున తెలిసికొనదగినది అని విశ్వసించు-

ఈ ధర్మవిషయమందు ఈమాత్రము శ్రద్ధ, నమ్మకము లేని వారందరు జననమరణ బాధాయుతమైన సంసారమునబడి కొట్టుమిట్టాడుచుండ వలసినదే—

నేను ఇంతకును చెప్పవచ్చిన ముఖ్యవిషయము ఇది. విశ్వమంతటను వ్యాపించియున్న నారూపము ఇంద్రియాలకు గోచరముగాదు. అన్ని భూతములు నాయందున్నవి. వానికి మూలహేతువును రక్షకుడనయి యుండియు నేను వానియందుండను– ఇది ఎలా సాధ్య మనుకొందువేమో వాయువు అన్ని చోటుల ఆకాశమున వ్యాపించి యుండునేగాని దానినంటుకొని నిలిచి ఉండదు. అట్లే సర్వభూతములందు నాఉనికియును నేనే కారణముగా ప్రకృతి ప్రభావము వలన ఈజగత్ సృష్టియు జగత్ ప్రవర్తనము సాగుచున్నది. నా నిజమైన రూపము సర్వభూతమహేశ్వరుడను. నాతత్త్వము గాని స్వభావముగాని తెలియని, తెలియలేనిమూఢులు నన్నొకసామాన్య మానవునిగ నే వీనిలో ఏమున్నది అని ఈసడించి చూతురు. అట్టివారందరు తామసికమగు రాక్షసస్వభావము కలవారు. వారి కాంక్షలు వేఱు వారివికర్మలు వేఱు వారిబుద్ధివేఱు. అవి యన్నియు వ్యర్థమైనవియే.

కాని, అర్జునా నన్నెఱిగిన సాత్వికగుణుల స్వభావమే వేఱు. వీరు దైవీప్రకృతిగల మహాత్ములు– నన్ను నిర్వికారుడిగను జగత్కారణునిగను ఉపాసింతురు– ఎల్లపుడు భగవత్

చింతనాతత్పరులయి విశ్వరూపుడనగు నన్ను ఏకీభావముతో పూజించి ధన్యులగుదురు-

వివిధ రూపములతో వివిధ నామములతో కనుపించు విశ్వమంతయు నేనే. ఈసృష్టికంతకు మాత,పిత నేనే. జగత్తు నకు సూర్యునిద్వారా వేడి మేఘములద్వారా వర్షములు కలిగించునది నేనే. జీవకోటికి రక్షకుడు, ఆశ్రయము, సఖుడు తుదకు సృష్టికారణమునుండి మృత్యువు ప్రళయమువరకు నేనే అందరితో పాటుగాఉండి సర్వజగత్ప్రవర్తనకు సాక్షిని. యజ్ఞము హోమము మంత్రము యజ్ఞఫలము నేనే- అయినప్పటికి వేద విదులు యజ్ఞయాగాదులలో ఇంద్రాది ఇతర దేవతలను ఆరాధించి తత్పుణ్యఫలముగ స్వర్గమునకేగి అచ్చటి భోగ భాగ్యములు కొంతకాల మనుభవించి ఆపుణ్య ముగియ గానే తిరిగి భూమిపై జన్మింతురు- కొందరు యక్ష రాక్షస పిశాచముల నారాధింతురు. ఆలోకములకు వారేగుదురు- ఆ విధముగనే పితృదేవతల నారాధించు వారాలోకముల కేగు దురు-

ఇందున్న రహస్యము విస్పష్టముగా చెప్పెదను విను అర్జునా. సర్వజీవకోటికి పరమగమ్యస్థానము నేనే అని నీకు వివ రించితినిగదా. తాత్కాలికములు అశాశ్వతములైన సుఖముల కొఱకు ఇతర దేవతల నారాధించుటకంటె శాశ్వత శాంతి సౌఖ్య ములకయిన మార్గము లనుసరింప వచ్చునుగదా. ఏది శ్రేష్ఠ తరమైనదో దానినాచరించుటయే మేలు- అన్యదేవతాచింతన

వదలి నన్ను సర్వాంతర్యామిగా యెఱిగి ఉపాసించుచు వారు * చేయుపనులు రాగద్వేష రహితములై భగవత్ప్రీతి కొఱకే అని చిత్తశుద్ధితో విశ్వసించి ఆచరించువారు ఎల్లపుడు నాహృదయమునందే ఉందురు. వారి యోగక్షేమములు నేనె వహింతును అని.

మఱొక ముఖ్యవిషయము గూడ నేనుచెప్పవలసినది ఉన్నది అర్జునా. అనన్యచింతనతో నన్ను నిర్మలమనముతో ఉపాసించమనుచున్నాను. నాకొఱకు ధనధాన్యములు బంగారు రాశులు అర్పింపవలసిన ఆవశ్యకతగూడ లేదు. భక్తి పూర్వకముగా తుదకొక *పత్రమో ఫలమో జలమో నాకు సమర్పించిన చాలు. ఆదరముతో స్వీకరింతును— ఇందు శ్రమప్రదమైనది కూడ ఏమియు లేదు. నాస్వరూప స్వభావములుగూడ ఎట్టివో స్పష్టముగ చెప్పినాను. నాకు కావలసినది నేను చేయునది గూడ వివరించితిని—

---

9–22 అనన్యాశ్చింతయన్తో మాం యేజనాః పర్యుపాసతే
తేషాం నిత్యాభియుక్తానాం యోగక్షేమం వహామ్యహం

9–26 పత్రం పుష్పం ఫలంతోయం యో మే భక్త్యాప్రయచ్ఛతి
తదహం భక్త్యుపహృతమశ్నామి ప్రయతాత్మనః॥

9–30 అపిచేత్ సుదురాచారో భజతే మామనన్యభాక్।
సాధురేవ సమన్తవ్యః సమ్యగ్వ్యవసి తో హి సః॥

9–31 క్షిప్రం భవతి ధర్మాత్మా శశ్వచ్ఛాన్తిం నిగచ్ఛతి
కౌన్తేయ ప్రతిజానీహి న మే భక్తః ప్రణశ్యతి॥

కావున, అర్జునా! నీవేది చేయుచున్నను, యజ్ఞమో తపమో దానమో అన్నపానములో సర్వము నా ప్రీతి కొఱకు చేయుచున్నట్లు చిత్తశుద్ధితో భావింపుము- నీ కే కర్మబంధము ఉండదు. మరణానంతరము నన్నే చేరుదువు. నాకు మిత్రులని శత్రువులని భేదాభిప్రాయము లేదు. నా భక్తులు నాయందుందురు. వారియందు నేనుందును- ఘోర పాపమొనర్చిన వానికైనను నిరాశ అక్కఱ లేదు. నాయెడల భక్తి అలవడినచో సాధువే అగును. క్రమముగ అతడే యోగమున సుస్థితుడగును- నాభక్తున కెన్నటికిని నాశము లేదు లేదు అని నీవు ప్రతిజ్ఞ చేసి చెప్పవచ్చును. అర్జునా ఇందు సందేహము అణుమాత్రము లేదు-

ఇట్లు భక్తులను సాధుజనులను రక్షించుటయందు నాకు విచక్షణము ఏవంతకూడ లేదు- స్త్రీలు వైశ్యులు శూద్రులు కూడ మద్భక్తులై మోక్షార్హులగుదురు అనినచో ఉత్తమజన్ములయిన బ్రాహ్మణుల గూర్చి గాని రాజర్షుల గూర్చి గాని వేఱుగ చెప్పవలసినదేమున్నది- ఈ లోకము ఎటువంటిది? కలుషము బాధాపూరితము. అనిత్యములే యిందలి సుఖము లన్నియును. నీవిచ్చట జన్మము నందితివిగాన నీయాత్మసుఖము నీవు చూచుకొనుము. * సర్వదా నాభక్తుడవు కమ్ము. నన్ను

---

9-34. మన్మనాభవ మద్భక్తో మద్యాజీ మాం నమస్కురు
మామేవైష్యసి యుక్త్వైవమాత్మానం మత్పరాయణః॥

పాసించు నాకు నమస్కరించుము, నీమనస్సు తలపులు సర్వము నాయందు మగ్నము కావలెను- నీకు పరమగమ్యం నేనే. ఈవిధముగ ఆలోచన ఆచరణములందు సుస్థిరుడవై యున్నచో నీవు నిశ్చయముగా నన్ను చేరుదువు. ఇది నిస్సందేహ మయిన మార్గము పార్థా!

## ౧౦ విభూతి యోగము

తనవచనముల నాసక్తిగ వినుచున్న అర్జునునిగూర్చి శ్రీకృష్ణున కిట్లుతోచినది- తొల్దొల్త అత్యంతమైన విషాదములో వికలమనస్కుడైన అర్జునుని మొగమిప్పుడు బాగుగ తేఱుకొనినట్లు కన్పడుచున్నది- తనమాటలయందు నమ్మకము గలుగుచున్న తృప్తి యాతని మొగములో స్పష్టముగానున్నది ఆతడు వెలిబుచ్చుచున్న సందియములలో గూడ ఇంకను తెలిసికొనవలెనను ఒక నిశ్చితమయిన ఆకాంక్ష పొడగట్టుచున్నది- అర్జునుని ఈనమ్మకము దృఢపడునట్లు చేయదలచి శ్రీకృష్ణుడు తన మాహాత్మ్యము నింకను తేటతెల్లముగ విశదీకరించుటకై యిట్లనినాడు.

'అర్జునా! నామాటలను నీవెంతో ప్రీతితో వినుచున్నావు. నీశ్రద్ధాభక్తులకు సంతసించితిని- నీశ్రేయస్సుకోరి నామహిమనుగూర్చి నీకింకను విపులముగ జెప్పెదను వినుము. మహర్షులకు దేవతలకుగూడ నాపుట్టుకనుగూర్చి తెలియనే

తెలియదు. వీరికేగాదు జగత్తునకంతకు నేను కారణమైన వాడను గనుక నాకు పుట్టుక అనునదే లేదు. సర్వలోకమహేశ్వరుడు ఆది అనేది లేనివాడు అని నన్ను నెఱిగినవాడు పాపవిముక్తుడే. ప్రాణికోటికి గలుగు వివిధభావములు బుద్ధి జ్ఞానము వివేకము ఓర్పు ఇంద్రియనిగ్రహము శాంతి సుఖము అహింస తృప్తి దానము తపము సమబుద్ధి కీర్తి అపకీర్తి భయము దుఃఖము నాశము నానుండియే ఉత్పత్తియగుచున్నవి. దుఃఖాది ప్రతికూలభావములు వారి వారి కర్మఫలములే. ఆఫల మట్లు కలుగుటకు నేను కారణము. ఈజగత్తున ఇంత ప్రజాసంతతి యున్నది. దీనికి మూలపురుషులు సప్తఋషులు సనకాదులు మనువులు నాసంకల్పబలమున ఉదయించినవారే. ఈవిధముగ సమస్త జగదుత్పత్తికి సర్వజగత్తు నడచుటకు కారణుడనైన నాగొప్పతనము నెఱిగిన వివేకులు నన్నెపుడు భక్తితో ఉపాసించుచున్నారు. అంతియేకాదు వారి మనః ప్రాణములు నాయందు లగ్నము చేసి నన్ను గురించియే ఆనందముతో చర్చించుచుందురు. నన్నుపాసించుట యందు ఆవిధముగ భక్తిశ్రద్ధలు గలిగినవారి యెడల దయతో నన్ను పొందగలిగిన జ్ఞానశక్తిని నేను ప్రసాదించుచున్నాను. వారి అజ్ఞానము సంపూర్ణముగ నశించి వారు దివ్యానంద మనస్కులై విలసిల్లెదరు.

శ్రీకృష్ణుని తత్వము మహిమ అర్జునునికి సంపూర్ణముగ ఇపుడవగతమైనది. తనయెదుట మానవాకృతినున్న శ్రీకృష్ణుడు సాక్షాత్ భగవంతుడు, అణువు మొదలు అజాం

డము వఱకు సర్వము శ్రీకృష్ణుని మాయయే. ఆ తేజములో అన్నియు నున్నవి. ఆ తేజము తనలోనున్నది. తానా తేజములో నున్నాడు. అంతయు కృష్ణమయము – తనమనస్సు తలపులు ఉచ్ఛ్వాస నిశ్వాసము లన్నియు కృష్ణునివే– అహా! యని పించుచున్నది. ఈ యనుభూతిలో ఒకనూతన ఆనందము తనను ముంచెత్తుచున్నట్లు తోచినది. తనమనస్సున కిప్పుడు మహా మహోన్నతుడుగా కనుపించు శ్రీకృష్ణుని గొప్పతనమునందు తాను గ్రహించగలిగినది స్వల్పము. ఆమహాత్మ్యవిభూతి నిం కను తెలిసికొనవలయునని హృదయము తహతహలాడినది. అర్జునుడు వెంటనే లేచి నిలచి నమస్కరించి–

"శ్రీకృష్ణా! పరబ్రహ్మము పరంధామము పరమాత్మవు నీవే. మహర్షులగు నారదుడు అసితుడు దేవలుడు వ్యాసాదులు నీవు శాశ్వతుడవు ఆదిదేవుడవు జన్మరహితుడవు సర్వాంతరాత్మ మివని వర్ణించుచున్నారు. నీకీర్తి త్రిజగద్గేయమై ప్రకాశించు చున్నది– ఆవిషయమే స్వయముగా నీ విపుడు చెప్పగా విన్నాను. నీవు చెప్పినదంతయు యథార్థము. నీతత్వము దేవ దానవుల కెవరికిని తెలియ శక్యముగాదు. నీవు భగవాను డవు నిస్సందేహముగ; నిన్ను నీవే తెలిసికొనగలవు. పురుషో త్తమా! సర్వోత్పత్తి కారణా! సర్వభూతేశ్వరా! దేవ దేవా! జగన్నాథా! నీవాక్యములు మధురాతి మధురములు. ఎంత విన్నను తనివి తీరుట లేదు కృష్ణా. నీదివ్యమహాత్మ్యము, నీయే

రూపములలో ఈ జగత్తంతయు నిండియున్నదో, ఏయే వస్తు రూపమున నిన్ను భావించి చూచి, అవిరామముగ నిన్నెట్లు ధ్యానింప గలుగుదునో ఆ విషయములు సవిస్తరముగ నాకు నీ నోటి మాటలద్వారా ప్రసాదింపుము దేవా! అని అర్జునుడు ప్రార్థించెను- తేనెసోనలకై వసంత వికసిత పుష్పములపై మధుపము లెట్లు వ్రాలునో అట్లే అర్జునుని చూపులు శ్రీకృష్ణుని వదనారవిందము పైననే నిలచియున్నవి.

శ్రీకృష్ణునకు మనస్సున ఒకటిమాత్రము స్పష్టమైనది- తా నేయుద్దేశముతో ఈప్రబోధము నారంభించెనో ఆ యత్నము ఫలించినది. రంగము సిద్ధమైనది. అర్జును నాదరమున జూచి శ్రీకృష్ణు డిట్లనెను-

"అర్జునా! నీ వనినది బాగుగనే ఉన్నది. అన్ని విషయములు నీకు విశదీకరింపవలయు ననియే ప్రారంభించితిని. నా మహిమ, వైభవము అనంతమైనవి. ఎంతచెప్పినను చెప్ప వచ్చును. కాని మనకంతవ్యవధి యెక్కడున్నది. ఈమాటలలో బడి మనము యుద్ధరంగమున నున్నవిషయము మఱవ కూడదు. అయినను కొన్నముఖ్యమైన విషయములే చెప్పెదను వినుము-

ఈజగత్తులోనున్న ప్రాణికోటి అనంతము గదా. అయినప్పటికి ప్రతిజీవికి హృదయ మున్నది. ఆహృదయమందంతర్వర్తిగ సూక్ష్మరూపమున నా తేజమువిలసిల్లు చున్నది.

ప్రాణికోటి చైతన్యవంతముగ నుండుట కదియే కారణము. ఆదిని ఈప్రాణికోటి యెట్లుత్పత్తి యైనది? పరబ్రహ్మము ఏకైకము అగు నాఆత్మ అనేకము కావలెనని సర్వచరాచర భూతముల ఉత్పత్తిని సంకల్పించితిని. ఆ సంకల్పఫలముగ ఈ విశ్వోత్పత్తి జరిగినది. విశ్వమునందున్న సంపద సర్వము ప్రాణుల రక్షణకొరకే. ఈప్రాణికోటిలో మానవునిది అత్యుత్తమమైన జన్మ- ఏయితర ప్రాణికిని లేని ఉత్తమశక్తులు మనస్సు బుద్ధి హృదయము మనుజుల కున్నవి- వారివారి కర్మాచరణమును బట్టియే అటుపై వారి సర్వము నడచును. తుదకంతయు నాలో లీనము గావలసినదే. ఇది స్థూలముగ నా జగల్లీల.

అర్జునా! నామహిమ వింటివి- ఇక నావిభూతులను వినుము. ద్వాదశాదిత్యులలో నేను విష్ణువును. వెలుగులలో సూర్యుడను. చుక్కలందు చంద్రుడను. వేదములలో సామ వేదమును; దేవతలలో ఇంద్రుడు. ఇంద్రియములలో మనస్సు ప్రాణులలో తెలివి రుద్రులలో శంకరుడు యక్షరాక్షసులలో ధనపతియగు కుబేరుడు, పురోహితులలో బృహస్పతి. సేనానులలో కుమారస్వామి, నీరములలో సముద్రుడు మహర్షులలో భృగుడు శబ్దములలో ఓంకారము యజ్ఞములలో జపయజ్ఞము స్థావరములలో హిమాచలము వృక్షములలో అశ్వత్థము దేవమునులలో నారదుడు గంధర్వులలో చిత్రరథుడు సిద్ధులలో కపిలుడు అశ్వములలో అమృతముతో పాటు వచ్చిన ఉచ్చై

చ్ఛ్రైవము ఏనుగులలో ఐరావతము నరులలో భూపాలుడు నేనే అర్జునా. ఇంకను ఉన్నవి వినుము.

ఆయుధములలో వజ్రాయుధము, గోవులలో కామధేనువు, సంతానకారకులలో మన్మధుడు, సర్పములలో వాసుకి పవిత్రమొనర్చు వానిలో పవనము ధనుర్ధరులలో శ్రీరాముడు మత్స్యములలో మకరము నదులలో గంగానది గోచరవస్తువుల కన్నిటికి ఆదిమాధ్యాంతము విద్యలలో ఆత్మవిద్య తర్కములలో వాదము అక్షరములలో అకారము సమాసములలో ద్వంద్వము నాగులలో అనంతుడు జలదేవతలలో వరుణుడు పితృదేవతలలో అర్యముడు దైత్యులలో ప్రహ్లాదుడు లెక్కించువిధములో కాలప్రమాణము మృగములలో సింహము పక్షులలో గరుడుడు అనంతమగు కాలము కర్మఫల ప్రధాతయగు ధాత సర్వసంహారకమగు మృత్యువు వర్ధమానులలో అభ్యుదయము స్త్రీగుణములలో కీర్తి సంపద వాక్కు జ్ఞప్తి తెలివి స్థైర్యము ఓరిమి, సామగీతములలో బృహత్సామము, ఛందస్సులలో గాయత్రి మాసములలో మార్గశిరము ఋతువులలో వసంతము మోసగాండ్రజూదము తేజస్సుల ప్రభావము సత్వగుణము ప్రయత్నము విజయము, వృష్ణివంశమున వాసుదేవుడు పాండవులలో అర్జునుడు మునులలో వ్యాసుడు వివేకవంతులలో శుక్రుడు శిక్షలలో రాజదండము విజయశీలులలో నీతి రహస్యములలో మౌనము జ్ఞానులలో

జ్ఞానము - ఇవన్నీ నేనే అర్జునా- నావిభూతులు అనంతమని చెప్పితినిగదా. పేరుపేరున వేవిధములుగా చెప్పుటెందులకు సర్వభూతములకు మూలమును నేనే. నేనుకానిది నేను లేనిది ఈవిశ్వమున ఏదియు లేదు- కీర్తి, మహిమ, సంపద, శక్తి, నీ కెక్కడ కనుపించినను అది నా అంశవలననే కలిగినదని గ్రహించు- ఇంత *వైవిధ్యము గలిగిన రూపములన్నియు నేనే, వేయేల ఈసర్వజగత్తు నాలోనున్న ఒక అంశమాత్రముచేత నేను నిండియున్నాను-

## ౧౧ విశ్వరూపసందర్శన యోగము

ఆహా! శ్రీకృష్ణుడు తనవిభూతులను చెప్పుటయేకాదు తనకండ్లముందు ప్రదర్శించుచున్నట్లయినది అర్జునకు- జ్యోతిస్సులలో సూర్యుడను నేను అనినంతనే శ్రీకృష్ణునిలో వేయిసూర్యులవెలుగు గోచరించినది. చుక్కలలో చంద్రుడను అనినంతనే చల్లని ప్రసన్నకాంతిస్వరూపము వెల్గినది. స్థావరములలో హిమాద్రిని నేను అనినంత చూపుంకందని మహోన్నతమూర్తియైనాడు కృష్ణుడు. నీరములలో సముద్రుడను నేనే అనినంత ఆప్రశాంతగంభీరాకృతి అర్జునుని బహిరంతరము లావరించినట్లయినది- పాండవులలో అర్జునుడనుగూడ నేను అనిన శ్రీకృష్ణునిమాటలు అర్జునుని కస్మృతప్రాయము లై

---

10-42 అథవా బహునైతేన కిం జ్ఞాతేన తవార్జున
విష్టభ్యాహమిదం కృత్స్నమేకాంశేన స్థితో జగత్ ॥

ఒడలు వివశమైనది. తనలోనున్న పరమాత్మ బహిరంతరములలోను అన్నిటిలోనున్న పరమాత్మ స్వరూపము తనలో అనుభవించు తాదాత్మ్యములోఉన్న అర్జునునకు "అర్జునా! సర్వము నేనే, నేను కానిది లేనిది ఈవిశ్వమున లేదు" అనిన శ్రీకృష్ణునిమాటలు అర్జునుని చెవులలో మరల మరల మార్మోగి మేల్కొల్పినవి- ఎదుట శ్రీకృష్ణుడు చిరునవ్వు చిలికించినాడు. తన రథాశ్వములకు బూన్చిన పగ్గములతని చేతులలోనున్నవి. నిజమున కాగుఱ్ఱములు తనమనస్సు మాటలతో తనమనస్సు నాతనివైపునకు లాగి తనజీవితమునకే సారథియైనాడు శ్రీకృష్ణుడు- అర్జునుడు మరల చేతులు జోడించి-

"శ్రీకృష్ణా మహానుభావా! అహంకార మమకార మోహ పాశములలో జిక్కి మూఢుడనైన నాయందు దయజూపి జ్ఞానోపదేశము చేసినావు. నా అజ్ఞానము నశించినది- పరమధర్మమయిన ఆత్మతత్వమును నీవలన తెలిసికొన్నాను. ఈ విశ్వసృష్టి స్థితి లయకార్యాలు నీలీలలు. నీరూపవైభవము సర్వము నీవు నుడువగా వింటిని. ఎట్టివానిగా నీవు నిన్ను వర్ణించి పలికితివో యథార్థముగా నీవు అట్టివాడవే. ఓకృష్ణా యోగేశ్వరా ప్రభూ ఇంకను ఒకకోరిక నామనస్సును బట్టియున్నది. సర్వమూ నీవైన నీఈశ్వరరూపము చూడగోరెదను. నేనది చూడగల్గుదునని నీవు భావించుచో ఆ విశ్వరూపదర్శన భాగ్యము నాకు ప్రసాదింపుము దేవా! అని తదేకధ్యానమున అర్జును డుండెను-

శ్రీకృష్ణుడర్జునుని జూచి పార్థా! నావిశ్వతేజోరూపము విలోకింప నీవభిలషించుచున్నావు, మంచిదే. కాని ఆవిశ్వరూపము ఒక్క ఆకారమా? కాదు. వందలు వేలు వివిధవర్ణములు వివిధాకృతులు దివ్యదేదీప్యమానములు, ఆదిత్యులు వసువులు రుద్రులు అశ్వనులు మరుత్తులు అందరు నచటనే ఉందురు. చరాచరాత్మకమైన సర్వజగత్తు ఆరూపములో తేజరిల్లుచుండును. నీవింకను చూడగోరిన సర్వము అచట చూడుము- కాని నీమానవనేత్రములతో నీవు దానిని చూడజాలవు. అద్భుతాశ్చర్యపరీతము, ఇంతవర కెవ్వరునుచూడని రూపమది. నీకు దివ్యదృష్టి నొసగుచున్నాను. యోగవైభవశోభితమైన నా ఈశ్వరాకారమును దర్శించు అర్జునా- దర్శించుము.

యుద్ధరంగమున తానుచూచిన దంతయు సంజయుడు ధృతరాష్ట్రమహారాజునకు నుడువుచున్నాడు. వ్యాసఋషి యొసగిన దివ్యదృష్టిచే శ్రీకృష్ణుని విశ్వరూపమును తానును చూడకలిగిన వాడయి సంజయుడిట్లు నుడివెను- మహారాజా మహాయోగీశ్వరుడగు హరి అర్జునునకు చూపిన ఈశ్వరాకార మీావిధముగ నున్నది- ఆరూపములో అనేక వక్త్రములు అనేక నయనములు అనేక అద్భుత దృశ్యములు శరీరమంతటను దివ్యాభరణములు, పైకెత్తిన హస్తములలో అనేక దివ్యాయుధములు, దేహమున దివ్యపుష్పమాలలు దివ్యచందన గంధములు దివ్యవస్త్రములు, అది అనంతము తేజోమయము సర్వ

జగదాత్మకము వేయిసూర్యులు ఒకేసారి ఉదయించిన కాంతి గలిగి పరమాద్భుతముగ నున్నది- ఆమహాకృతి జూచి అర్జునుని ఒడలు రోమాంచమైనది. అతని యాశ్చర్యమునకు మేర లేదు- చేతులు జోడించి, శిరమువాల్చి ప్రణామము లర్పించి యిట్లనినాడు-

"శ్రీకృష్ణదేవా, జగదీశ్వరా, నీరూపము నందున్న వివిధ దృశ్యములు ఒకదానిని మించి వేఱొకటి తేజరిల్లుచున్నది స్వామీ. కమలాసనుడైన బ్రహ్మను, దేవతలను, మునులను, సర్పములను సర్వచరాచర జగత్తునంతటిని అందు చూచుచున్నాను. ఆహా! ఎన్నివదనములు, ఎన్ని నేత్రములు ఎన్నిబుజములు, ఎన్నిఉదరములు, ఆదిమధ్యాంతములు లేని ఆరూపము దశదిశలనిండి యున్నట్లు చూచుచున్నాను-

నీచేతులలో గధా చక్రములు నీశిరమున కిరీటము నీవొక మహాతేజోరాశివి కృష్ణా! సప్తజిహ్వాలతో అగ్ని ప్రజ్వలించు చున్నట్లు, సూర్యుడు దశదిశలందు ప్రకాశించు చున్నట్లున్న నీ కాంతిపుంజము దుర్నిరీక్ష్యము దేవా. నీవు పరాత్పరుడవు అవినాశివి ధర్మరక్షకుడవు పురాణ పురుషుడవు. నీనేత్రములు సూర్యచంద్రులు, నీనోటినుండి వెలువడు మహాగ్నికీలలతో జగత్తు సంతప్తమైపోవుచున్నది. ఇది నిజమాస్వామి, దశదిశలూ భూనభోంతరము నీజ్వాలస్ఫూర్తితో నిండిపోయినది. ముల్లోకములు నీభయంకరాకృతికి వణకి పోవుచున్నది.

దేవతాశ్రేణి నీలో ప్రవేశించు చున్నది. కొందఱునిన్ను కీర్తిం చుచున్నారు. భీతితో నమస్కారములు సల్పుచు ముని సిద్ధ సాధ్యగణములు నిన్ను స్తోత్రము చేయుచున్నారు. దేవతాగణ ములెల్లరు ఆశ్చర్యముతో నిస్పృహులై నిన్ను చూచు చున్నారు– నీకన్నులు, నీఉదరములు, నీబాహువులు త్రిభువన ములకు భయంకరముగానున్నవి– నీనోళ్ళు విశాలాకాశ ముల వలెను, నీనాలుకలు మహాజ్వాలలవలె నున్నవి. నీ కోఱలు ప్రళయాగ్నులవలె నున్నవి. ఈభయంకర దృశ్యము నకు త్రిలోకములు భయమున వణకిపోవుచున్నవి ప్రభూ! ఈ మండుచున్న ఆకారముజూచి నాకు శాంతిలేదు ప్రభు! మహా భయము నన్ను గ్రసించు చున్నది– కరుణించి నన్ను కాపాడు.

అయ్యయో! ఇది యేమిటయా. ఆ కౌరవులందరూ భీష్మద్రోణ కర్ణులతో సహా సర్వనరపాలురు మండుచున్ననీనోళ్ళ లోనికి లాగబడుచున్నారు. పెక్కుమంది నీకోఱలమధ్య నలిగి పిండి పిండి అగుచున్నారు– మావైపు యుద్ధవీరులు కూడ అందుబడి నశించుచున్నారు– నదులు సముద్రములో కలిసి పోయినట్లు మిణుగురులు అగ్నిమంటలలో బడి దగ్ధమైనట్లు వీరందఱు నీనోళ్ళలో జేరి నశించి పోవుచున్నారు. నీనోటినుండి మంటలమధ్య సుదీర్ఘమైన నాలుకలు దిగంతములవరకు సాగి లోకములను మింగివేయుచున్నవి మహాదేవా! నీవే నీనాలు కలతో నీపెదవులను నాకుచున్నావు. నేనేదో భ్రాంతిలో నీ ఈశ్వరరూపము నూహించలేక చూచెదనంటిని. మన్నింపుము

దేవా నన్ను మన్నింపుము. త్రిలోకములనే మ్రింగి జీర్ణించు కొనుచున్న ఈ మహోగ్రాకారము ఎందులకు దాల్చినట్లు దేవా! యథార్థముగ నీవెవరో తెలిపి నన్ను భయము నుండి రక్షించు ఆదిపురుషా! నీకు నా నమస్కారములు.

ఈ పగిది భయపూర్ణుడైన పార్థునిజూచి భగవానుడు అర్జునా! నేను లోకసంహారమునకై వచ్చిన కాలుడను. నీవు లేకున్నను ఈ శత్రుయోధు లెవ్వరు బ్రతుకరు- భీష్మద్రోణాది వీరులందరు నాచే చంపబడినవారే. నీవు నిమిత్తమాత్రుడవు. యుద్ధమునకు లేచి వీరినందరిని పరిమార్చి శాశ్వతకీర్తి నార్జింపుము. రాజభోగము లనుభవించుము. విజయము నీదే లెమ్ము- శ్రీకృష్ణుని మహాభయంకరములగు మాటలను విని అర్జునుడు నమస్కరించుచు శ్రీకృష్ణునికి సాష్టాంగ ప్రణామములాచరించి

"ఆదిదేవా పురాణపురుషా పరంధామా సర్వవ్యాపీ నిన్నుజూచి రక్కసులు పారిపోవుచున్నారు. దేవతలందరు నిన్ను స్తుతించుచున్నారు. ఇదిసరే, వ్యక్తావ్యక్త విశ్వమునకెల్ల అతీతుడవు జగదాశ్రయుడవు. సర్వదేవతాగ్రణివి. మునులు సురాసురులు ఎవరైననేమి త్రిభువనములలో నున్న వారెల్లరును నీకు మ్రొక్కులర్పింక ఊరకుండగలరా! ఇంద్ర వాయు వరుణ అగ్ని కాలరూపములు నీవే. పృథ్వీ జలము ఆకాశములు నీవే. చతుర్ముఖుని తండ్రివి. నీకివే పునః పునః సహస్ర వందనములు స్వామీ. అన్నివైపుల నుండియు నీకు

నానమస్కారము అమేయశక్తి, సర్వాత్మ నామొకనొక్కటి వినుము. శ్రీకృష్ణపరమాత్మా! నీమహిమ నెఱుగక నిన్ను మిత్రునిగ, బంధువునిగ భావించి, కృష్ణా యాదవసఖా బావా అని పొరపాటుననో చనువు మూలముననో హేళనగ చాలసార్లు ఇతరుల ఎదుటగూడ పరిహాసముగ నిన్ను పలుకరించి మాటాడితిని. దేవా ఈ మహానేరమును క్షమింపుము- ఇదిగో మరల నీపాదములపై పడి వేడుచున్నాను- తప్పుజేసినను తండ్రి పుత్రుని, సఖుడు మిత్రుని, ప్రియుడు ప్రేయసిని క్షమించునట్లు నన్ను క్షమింపుము. మున్నెవరు ఎప్పుడును చూడని నీఈశ్వరాకారము నామనోరథఫలముగ చూచితిని. కాని ఈ భయంకరాకృతియందు నేను నిలువలేను. దేవా దేవా విశ్వరూపా! ఈ మహోగ్రరూప ముపసంహరించి నీమనోహార చతుర్భుజాకృతి గదాచక్ర కిరీటధారివై ధరింపుము స్వామీ- అని పదింబడి వేడిన పార్థుని ప్రార్థన నాలించి శ్రీకృష్ణుడు-

'పార్థా! నీపై దయతో నా యోగశక్తిచే ఆద్యము అనంతము మహాతేజోమయము అయిన నావిశ్వరూపము ఇతః పూర్వమెవరును చూడనిది నీకు చూపితిని. వేదములభ్యసించి యజ్ఞతపోజపాగ్ని హోత్రానుష్ఠానముల నొనర్చిన వారైనను నాయీ విశ్వరూపమును చూడలేదు- ఈ ఉగ్రాకృతినిజూచి భయపడకుము. విహ్వలుడవు కాకుము. దానినీక్షణమే ఉపసంహరించి నా పూర్వరూపమును గైకొనుచున్నాను చూడుము.

కృష్ణుని నోటివెంట ఈమాటలు వెలువడెనో లేదో ఆ దేవుని సౌమ్యరూపము అర్జునునిముందు ప్రత్యక్షమైనది- అర్జునుని భయమణగినది. మనస్సునకు స్వస్థత యేర్పడినది. ప్రీతచిత్తుడై సంతసముగ తన మనోభావములు వెల్లడించిన అర్జునునిజూచి మరల శ్రీకృష్ణుడు-

పార్థా! నీవిపుడు చూచిన నాఅద్భుత విశ్వరూపమును జూచుటకు దేవతలెప్పుడు కాంక్షించు చుందురు. కాని యిది దుర్లభము. వేదపఠనము యజ్ఞ తపోదానాదులవల్ల కూడ ఇది అలభ్యము. ఏకాగ్రమగు నిశ్చల నిర్మల భక్తిమార్గమొకటే సాధనము నాయీ రూపము తెలిసికొనుటకు నన్ను చేరుటకును కూడ. మఱియొకసారి చెప్పుచున్నాను. రాగద్వేషరహితుడై నిస్సంగియై సర్వభూతహితుడై నన్నే పరమగమ్యముగనెంచి నిష్కామముగ *కర్మల నాకొఱకాచరించువాడు నిశ్చయముగ నన్ను జేరగలడు- ఈ ధర్మసిద్ధాంతము నెపుడును విస్మరింపకుము. నీయుద్ధకార్యమునగూడ ఈ ధర్మపద్ధతియే మనసునం దుండవలెను సుమా-

## ౧౨ భక్తియోగము

శ్రీకృష్ణుడు తన విశ్వరూపము నుపసంహరించి సౌమ్యరూపమున యథాపూర్వము తనయెదుట నున్నాడు- కాని

---

11-55 మత్కర్మ కృన్మత్పరమో మద్భక్తః సఙ్గవర్జితః।
నిర్వైరః సర్వభూతేషు యః సమామేతి పాణ్డవ॥

అర్జునకింకను జాజ్వల్యమానములగు ఆవిశ్వరూప దృశ్యము తే కనులలో మెఱయుచున్నవి. మాటవరుసకు మాత్రము తన మనస్సునకు స్వస్థత చేకూరినదని నుడివెను గాని ఆమహోగ్ర రూపప్రభావము నుండి తేరుకొనుటకు కొన్ని క్షణములు గడచిన తరువాతనే మరల ఈ ప్రపంచములోనికి వచ్చినట్లయి నది— విశ్వరూపము నుపసంహరించుచు "అర్జునా నిర్మలమగు అనన్యభక్తితో నాకు ప్రీతికరముగ వివిధ హితకార్యములొన రించువాడు నన్ను తథ్యముగపొందును" అని నొక్కి చెప్పిన పలుకులు అర్జునుని హృదయమున నాటినవి. శ్రీకృష్ణునిజూచి మోమోటము వీడి—

"దేవా, నీయందు భక్తితో నిన్నుపాసించువాడు నిన్ను పొందునని సెలవిచ్చితివి— సరే. ఇట్లు సగుణసాకార రూపుడవైన నిన్నుపాసించువారు, ఇంద్రియములకందక అక్ష రము అవ్యక్తము అయినపరమాత్మగా నిన్నుపాసించువారు ఈ యిరుతెగలలో యెవరికి శీఘ్రముగ యోగసిద్ధిలభించునో ఈవిషయము మఱికొంత స్పష్టముగ జేసి నన్ననుగ్రహిం పుము" అని ప్రార్థించినాడు—

శ్రీకృష్ణున కీమాటలు నచ్చినవి— ఇట్లుపదేశించెను "అర్జునా! ఏకైకనిష్ఠుడవై నన్నే భావించుచు నాసాకారరూప మును మనస్సుననిల్పి నన్ను సదా ఉపాసించుభక్తుడు యోగ జ్ఞులలో శ్రేష్ఠుడు. శీఘ్రముగ సిద్ధి నందగలడు.

కాని, ఇంద్రియనిగ్రహముకలిగి, సర్వభూతహితుడై ఇంద్రియములకు అగోచరము అవ్యయము సుస్థిరము శాశ్వతము నయి అన్నిజీవాత్మలలో అంతర్యామిగా నున్న నన్నెఱిగి భజించువారికిని యోగసిద్ధిలభ్యమే. ఈమార్గము కష్టతరమైనది- ఇదమిత్థమని చెప్పరానిది అవ్యక్తమైన పరమాత్మ రూపమునందు మనస్సునిల్పుట శరీరధారులకు కష్టము-

సులభమైనమార్గము చెప్పెదనిగదా. సర్వకర్మలను నాకర్పించి ఏకాగ్రనిష్ఠతో నన్ను భజించు వారిని శీఘ్రముగ జన్మజరామృత్యు బాధలనుండి రక్షింతును- నీమనోబుద్ధులను నాయందులగ్నముజేసి నీవు అనుసరింతువేని నా యందు నీవు నిశ్చయముగ నివసింతువు- నిజమునకు ఒక్కసారిగ మనస్సు నాయందు నిశ్చలముగ నిలువదు- నిరంతరమగు అభ్యాసమిందులకు కావలెను. నాకథలు, గాథలు విను నన్ను కీర్తించు, నన్నుకీర్తించు భక్తులతో చేరు. ఈ అభ్యాసముగూడ నీకు అలవడకపోయినచో నీవు చేయుపనులన్నియు నాకొఱకే చేయుచుంటినను ఆసక్తి పెంపొందించుకొనుము. ఇదికూడ కుదరక పోయినచో, ఇక ఒక్కటేమార్గము. నన్నే శరణుజొచ్చి నీవు చేయుపనులయందు నీకేమియు సంబంధము లేదనుకొని ఆ కర్మలన్నింటిఫలము నాకే అర్పింపుము- భక్తిభావము తెలియకుండ జేసిన అభ్యాసముకంటె ఆత్మతత్త్వజ్ఞానము, జ్ఞానము కంటె ధ్యానము, ధ్యానముకంటె నే నిప్పుడు చెప్పిన కర్మఫలము లన్నిటిని నాకు కైంకర్యము చేయుట శ్రేష్ఠము.

పరమపదశాంతి లభించుట కిదియే సాధనము- ఫలత్యాగ రూపములైన ఈకర్మాచరణముల కాలంబముగ సత్ప్రవర్తనము ముఖ్యము. మానవుడు సంఘజీవి. తనవర్తనము నా మార్గమున మలచుకొన వలయును. ఇందులకు ఎలయు గుణములున్నవి వినుము-

ఎవరియందును ద్వేషము లేకుండుట, సర్వప్రాణుల యందు దయ, ఎల్లరతో మైత్రి, సహనము, సుఖదుఃఖముల యందు సమబుద్ధి, నిత్యము సంతృప్తి, వీనికితోడు దృఢమైన సంకల్పముతో ఆత్మనిగ్రహము కలిగి మనోబుద్ధుల నాకర్పించిన * భక్తుడు నాకు ప్రియుడు- ఇంకను కొన్నిసుగుణములు కావలయును అర్జునా. తా నెవరికిని అప్రియ మొనర్పక లౌకిక విషయములకు తా నాందోళన చెందక, అసూయ భయము దిగులు లేక, ప్రతి చిన్నవిషయమునకు అనవసరముగ ఉప్పొంగక, ఇతరులనుండి గ్రహింపవలయునని అపేక్ష ఇతరవిషయములం దాసక్తి లేనిభక్తుడు నాకిష్టుడు- ఇంకను మఱికొన్ని లక్షణములు కావలయును అర్జునా! భక్తుడు పరిపూర్ణమనీషి యగుటకు పవిత్రమైన బుద్ధికుశలత, శత్రుమిత్రులయందు,

---

12-13 అద్వేష్టా సర్వభూతానాం మైత్రః కరుణ ఏవచ
నిర్మమో నిరహంకారః సమదుఃఖ సుఖః క్షమీ ॥

12-14 సన్తుష్టః సతతంయోగీ యతాత్మా దృఢనిశ్చయః
మయ్యర్పిత మనోబుద్ధిర్యో మద్భక్తః స మే ప్రియః॥

సమ్మాన తిరస్కారములందు సమబుద్ధి, నిందాస్తుతులందు సమభావము, తనది అను అహంకార మమకార సంగము లేని ఆచరణ, మౌనము, లభించినదానితో సంతోషము, ఒకే నివాసమునకు అంటిపెట్టుకొని ఉండకపోవుట, సుస్థిరసంకల్పము ఇవియన్నియు భక్తుని లక్షణములు. ఇట్టి సుగుణశోభితుడైన భక్తుడు నా కత్యంతప్రియుడు, ఆతని క్షేమము నా నీ యను-

అర్జునా! ఇప్పుడు నీకుచెప్పినది, భక్తునికి కావలసిన లక్షణములు. భక్తునకు శీఘ్రముగ యోగసిద్ధి నొసగు మార్గములును, ఇవి చాలముఖ్యమైనవి. అమృతప్రాయమైన ఈ ధర్మము ననుష్ఠించిన భక్తులకు మఱి జననమరణము లుండవు. శాశ్వతముగ నన్ను పొందగల చరితార్థుడతడు. నీవును అట్టి వాడవు కావలయును-

క్రమక్రమముగా తనను శ్రీకృష్ణు డొకసోపానము నుండి మఱియొకసోపాన మెక్కించినాడు. తన గమ్యస్థానము సుస్పష్టముగ మనస్సునకు తోచుచున్నది- ఆహా! ఎంతమార్పు, ఎంతమార్పు, తనలో తనకే అద్భుతమనిపించుచున్నది- తానేదో యేదో భావించుకొనుచు యుద్ధము చేయజాలననుకొనినవానికి తనకర్తవ్యము మఱొకవిధముగ గన్పట్టుచున్నది- శ్రీకృష్ణుడు తనకు బంధువే. ఈక్షణములో శ్రీకృష్ణునిలో తాను చూడ గలిగిన హృదయబాంధవ్యము వేఱు. ఇదియేదో అన్నిటికినీ

అతీతమైనది- వెనుకటి తొందర లేదు అర్జునునిలో. ఇంకను ఇంకను తనకాత డేమిచెప్పునో అను ఆసక్తి మెండైనది-

## ౧౩ క్షేత్రక్షేత్రజ్ఞాన విభాగ యోగము

తన ఆకాంక్షల కనుకూలమైన సుస్పష్టమార్గ మొకటి అర్జునునకు దొరికినది. ఆమార్గమును బట్టి యేగుటకు తానెట్లు ప్రవర్తింపవలయునో తనయందెట్టి లక్షణములు ఉండవలయునో కూడ తెలిసినది- తాత్త్విక చింతనలో తా నిదివరకు వినిన కొన్నిమాట లున్నవి. ఆశబ్దముల యథార్థభావము అందున్న ధర్మవిషయములు తెలిసికొనవలయునను ఆసక్తి జన్మించినది- వెంటనే ఇట్లడిగినాడు.

"శ్రీకృష్ణా! నాకు మఱికొన్ని విషయములు తెలిసికొనవలయు నని యున్నది- ప్రకృతి పురుషుడు, క్షేత్రము క్షేత్రజ్ఞుడు, జ్ఞానము జ్ఞేయము అనగా నేమి. నన్ను గ్రహించి ఈవిషయములుగూడ బోధింపుము." ఈమాటలు విని అర్జునుని శ్రద్ధాసక్తులకు మరింత సమ్మోదితస్వాంతుడై శ్రీకృష్ణుడు—

'అర్జునా! వినుము. నీవడిగిన విషయములను గూర్చి సవిస్తరముగ చెప్పెదను- ఇచ్చట నీవు తెలిసికొనవలసినవి గూడ చాల సంగతు లున్నవి. ఈపదాలనుగూర్చి చెప్పేవిషయములుగూడ నీవు సూక్ష్మంగా గ్రహించవలె. అప్పుడుగాని

వీని యథార్థస్వరూపము బోధపడదు- మనకు కొన్నివస్తు వులు ఒక ఆకారముతో ఇంద్రియములకు గోచరించును. కొన్ని గోచరించవు. వాని గుణధర్మములనుబట్టి వాని యథా ర్థము గ్రహించవలసి ఉండును. సర్వఅవయవములతో కూడి నీకు కనుపించు శరీరము క్షేత్రము. సంసారప్రవర్తనమునకిది పాదుగానున్న వస్తువుగాన క్షేత్ర మనుమాటను వాడిరి- శరీ రావయవములు పని చేయుచున్నవి, కాళ్ళునడచును, కనులు చూచును, చెవులు వినును. ఈప్రవర్తనము జరుగుటకు ఈ యవయవ మొక్కటే శక్తిమంతముకాదు. వీనిని కావలసిన విధముగా నడపు ఒక జీవచైతన్యము లోపలనున్నది- ఇట్లు ఈ క్షేత్రము నెఱిగి నడిపించువాడు క్షేత్రజ్ఞుడు- ఈరెండింటి యొక్క స్వభావమును పరిపూర్ణముగ నెఱిగినవారు చెప్పిన మాటయే యిది. ఈక్షేత్రజ్ఞుడే అవినాశియగు ఆత్మవస్తువు. క్షేత్రమైన దేహముకంటె వేఱయి శరీరమునందు సాక్షిగ నున్న ప్రత్యగాత్మ క్షేత్రజ్ఞుడు- నేనే ఆ క్షేత్రజ్ఞుడను- ఈ క్షేత్రము(దేహము)ను గూర్చియు క్షేత్రజ్ఞ(ఆత్మ)ని గూర్చి యు తెలుపుజ్ఞానమే నిజమైనజ్ఞానము. ఆరెండింటినిగూర్చిన వివరములు వినుము- వీటినిగూర్చిన వివరములు వేదముల లోను ఉపనిషత్తులలోను ఉన్నవి.

ఈ కనుపడే శరీరములు 24 తత్వములతో కూడుకొని యున్నవి. అవి పంచభూతములు- భూమి నీరు అగ్ని వాయు వు ఆకాశము, వానిగుణములు గంధము, రస, రూప, స్పర్శ,

శబ్దములు; జ్ఞానేంద్రియములు చర్మము కండ్లు చెవులు నాలుక ముక్కు, కర్మేంద్రియములు వాక్కు చేతులు కాళ్ళు ఆసనము, ఉపస్థ; అహంకారము, బుద్ధి, మూలప్రకృతి(అవ్యక్తము) ఇచ్ఛ ద్వేషము సుఖము దుఃఖము తెలివి ధైర్యము వీని సమీకృతిరూపమే క్షేత్రము- కనుపడే అవయవాలు కనుపించని గుణవికారములు వీనిగూడు శరీరము. శరీరసంబంధము వలన శరీరములోవున్న జీవునకీగుణవికారముల ప్రభావము కలుగును-

ఇక జ్ఞానమునుగూర్చి విను- అభిమానము లేకపోవుట అనగా వంశము పదవి ఆధారముగా గొప్పవాడనను అతిశయము లేకపోవుట, దంభము గర్వపుమాటలు లేకపోవుట, అహింస ఒకరికిబాధ కలిగింపకుండుట, ఓర్పు, నెమ్మది. పెద్దల సేవ, మనశ్శరీర పరిశుభ్రత, స్థిరత్వము, మనోనిగ్రహము, ఇంద్రియ సుఖములందు అనాసక్తి. నేను నాది అను అహంకారరాహిత్యము, చావుపుట్టుకలు వీనివలన కలుగు దోష దుఃఖములగూర్చిన చింతనము. భార్య సంతతుల యందు నిస్సంగము, శుభాశుభములయందు సమబుద్ధి, ఏకాంతవాసము, దుర్జనసాంగత్యము లేకుండుట, నిరంతరము నాయందు భక్తిధ్యానములు కలిగి ఆధ్యాత్మతత్వస్వరూపమును గ్రహించుట ఈసద్గుణ సముదాయమంతయు జ్ఞానము- దీనికి విరుద్ధమైనది అజ్ఞానము.

ఇక జ్ఞేయమనగా తెలిసికొనదగినది- ఏది తెలిసికొన దగిన బ్రహ్మస్వరూపమో, ఏది తెలిసినట్లయిన మనుజునకు మోక్షసిద్ధి కలుగునో దానినిగూర్చి చెప్పెదను- ఆదిలేని పర బ్రహ్మపదార్థమది- ఉన్నదనిగాని లేదనిగాని చెప్పబడదు. సదసదతీత మైనది. సర్వవ్యాపి సర్వసాక్షిఅయిన ఆ పర బ్రహ్మ పదార్థముయొక్క వర్ణన మర్జునా ఆలకింపుము-

లోకమునందంతటను ఆవరించిన కాలుసేతులు కన్ను లు చెవులు నోళ్ళు కలిగి ఇంద్రియగుణదీపిత మయ్యును ఇం ద్రియములు లేనిది- నిర్గుణమయ్యును గుణముల ననుభవించు నది- నిస్సంగియయ్యు సర్వలోకాధార మగునది- సర్వభూ తములకు లోపల వెలుపల నుండునది- చరాచరాత్మక మై నది- అతి సూక్ష్మమై అవ్యక్తమైనది- దగ్గఱనుండియు దూరమైనది- విభజించుటకు వీలుకానిదియయ్యు వేఱువేఱుగ సర్వభూతములందుండునది- భూతముల సృష్టించి పోషించు నదియు ప్రళయవేళల లయమొనర్చునదియును- సూర్య చంద్రాది జ్యోతిరూపము లన్నిటిని ప్రకాశవంతముజేసి తాను అన్నిచీకటులకు ఆవల నుండునది- జ్ఞానము, జ్ఞేయము జ్ఞానముచే పొందబడునది- అందఱి హృదయము లందుండు నది- అదియే నాభక్తు లీ పరమార్థము నెఱిగినచో నన్ను పొందగల్గుదురు-

ఇక ప్రకృతిపురుషులనుగూర్చిగదా నీవడిగినది అర్జునా వినుము. వీరిరువురికి ఆది యనునది లేదు- మార్పులు గుణములు

ప్రకృతివలన కలిగినవే- మార్పులనగా మనోబుద్ధీంద్రియాదుల వికారములు. గుణములా సత్వరజస్తమములు- దేహేంద్రియాదుల ఉత్పత్తికి ప్రకృతి కారణము. ప్రకృతి జడమగుట వలన సుఖదుఃఖానుభూతి నెఱుగదు- ప్రకృతిసంయోగమున ఆ యనుభూతి సుఖదుఃఖాదులను పురుషు డనుభవించునట్లు కన్పట్టును- ప్రకృతియందున్న పురుషు డనగా జీవుడే. సుఖ దుఃఖానుభూతి కలవాడయి పడపడి ఉత్తమ నీచజన్మములెత్తుటకు హేతు వగుచున్నాడు- ఈపురుషుడే పరమాత్మ; శరీరములం దున్నప్పటికి సర్వజగద్భర్తయై సర్వనియామకుడై వెలుగొందు పరమేశ్వరుడు. ఆత్మరూపుడైన పురుషుని గుణములతో గూడిన ప్రకృతిని తత్త్వతః యథార్థముగ నెఱుగజాలినవాని కీలోకమున మరల జననమరణములు లేవు- నిర్మలము నిశ్చలము అయిన హృదయమున ధ్యానించి కొందఱును, జ్ఞానయోగముచే కొందఱును, నిష్కామకర్మయోగముచే ఇతరులును ఈఆత్మను దర్శించి ధన్యులగుదురు. అర్జునా! అందఱికిని ఇట్టిజ్ఞానము స్వయముగ నెఱుగుట కవకాశము గాని, పాండిత్యముగాని లేకపోవచ్చును. గురూపదేశము నంది తాము వినినది పరమశరణ్యముగ భావించి ఏకాగ్రదీక్షతో భగవానుని పూజించుచు భవాబ్ధినుండి తరించుటకు అవకాశమున్నది-

అర్జునా! మఱికొన్ని ముఖ్యవిషయము సందర్భమున చెప్పవలసినవి ఉన్నవి. ఈవిశ్వమునయున్న స్థావర జంగమము

లన్నియు క్షేత్రక్షేత్రజ్ఞుల సంయోగమువలననే కలుగు చున్నవి. *సర్వభూతములందు సమముగా అవినాశియై వెలుగొందు ఈపరమేశ్వరుని చూడగలవాడే యథార్థముగ చూచువాడు. ఇట్లు చూడగల్గిన యథార్థదర్శి తన ఆత్మ యొక్క సత్యము నెఱిగి ఆ ఆత్మవస్తువున కెట్టిభంగము రానీయక జీవనగమ్యమగు పరమపథమును జేరును.

లోకములందు జరుగు సర్వకర్మములు ప్రకృతివలననే సంఘటింప బడుచున్నవి. ఆత్మతటస్థుడైన సాక్షీభూతుడే సత్యమును దర్శింపగలవానికే ఈరహస్య మవగతమగును— పార్థా! మఱియొక రహస్యమైన విషయము కూడకలదు. ఈ జగత్తునందు వివిధ రూపములుగల భూతకోటి యున్నదిగదా అవి నిజముగ భిన్నభిన్నములా? కావు. ఈజగత్తంతయు వాస్తవముగ ఒకేస్వరూపము. అది పరమేశ్వరరూపము, అందుండి కల్పితములై ఆ పరమాత్మయందే ఇవియన్నియు నిలచి యున్నవి- ఈ భూతవిస్తృతియొక్క సత్యము నెఱిగినవాడు ఈశ్వరసాయుజ్యము నందును- అదిలేనివాడు నిర్గుణుడయిన పరమాత్మ, శరీరమునందుండియు, దేనికిని కర్త కాడు. కర్మ లాతని నంటవు- ఒక ఉదాహరణము నుడివెదను వినుము. ఆకాశము సర్వత్ర వ్యాపించియున్నది. అయినను ఈజగత్తున

---

13-27 సమం సర్వేషుభూతేషు తిష్ఠన్తం పరమేశ్వరం।
విసశ్యత్స్వవినశ్యన్తం యః పశ్యతి పశ్యతి॥

నున్న నీటితడిగాని, ధూళిగాని దానినంటునా అంటవు. అది అంటబడదు. అట్లే కర్మ భూయిష్టమైన శరీరమునందున్న ఆత్మయును నిర్లిప్తమై ప్రకాశించును. సూర్యుడొక్కడే అయినను ఆవెలుగుచేత సర్వజగము ప్రకాశించుచున్నది. అట్లే ఆత్మపదార్థము సమస్త క్షేత్రములను ప్రకాశింపజేయుచున్నది.

పార్థా! క్షేత్రక్షేత్రజ్ఞుల భేదము నీకిపుడు తెలిసినదా! సర్వభూతములకు కారణమైన ప్రకృతి అనగా అజ్ఞానము నుండి విముక్తిని కలుగజేయు సాధనము నెఱిగినవారు పరమ పురుషపరమైన మోక్షస్థితి నందుచున్నారు-

## ౧౪ గుణత్రయ విభాగ యోగము

ప్రకృతి పురుషులనుగూర్చి వివరించుచు శ్రీకృష్ణుడొక విషయను నుడివెను- ప్రకృతినుండి గుణము లుద్భవించినను ప్రకృతి జడపదార్థమగుటచే దానికి గుణానుభూతి లేదు. నిర్వికారుడు నిర్గుణుడైనను పురుషుడు ప్రకృతిసంయోగమున త్రిగుణములయిన సత్వరజస్తమస్సుల కారణముగా గలుగు ఇష్టానిష్టము లున్నవానివలె కనుపట్టును- ఈగుణము లెట్టివి ఇంతెటిప్రభావము వీని కెందులకున్నది. ఈవిషయములు సమగ్రముగా తెలిసికొన వలయునని అర్జును డడుగగానే శ్రీకృష్ణుడు-

"అర్జునా! నీకు వలయు విషయములన్నియు తప్పక చెప్పెదను. మరల మరల సందేహము లేకుండ వినుము. ఈ

త్రిగుణములు అనగా సత్వము రజస్సు తమస్సు మనోబుద్ధులపై అత్యధిక ప్రభావము కలవి- వీనినిగూర్చి పరిపూర్ణంగా తెలిసికొనినవారు ప్రకృతిపాశం నుండి విడివడినట్లే- ఈజ్ఞానమువలన మునులు సయితము చరితార్థులై సంసారబంధము నుండి తప్పించుకొనగల్గుచున్నారు- ఆవిషయమును నీకు మఱొకసారి విశదము చేయుచున్నాను— ఈజ్ఞానము నెఱిగి వీనిప్రభావమున కతీతులయినవారికి సృష్టికాలమున జననముగాని, ప్రళయమున విపత్తుగాని లేదు-

నీకు జ్ఞాపకమున్నదా అర్జునా! పర అపర అని ద్వివిధమైన ప్రకృతినిగూర్చి మొదటిలో చెప్పితిని. జడమైన అపర ప్రకృతి సర్వభూతోత్పత్తికి స్థానము. నాయంశగా జీవుల నెడు బీజములం దుంచుచున్నాను. సర్వజగత్తు సర్వభూతసృష్టి అందుండి జరుగుచున్నది. ఈకారణముగా సర్వమునకు ప్రకృతి తల్లి, నేను జనకుడను. నేనుచెప్పిన మూడు గుణములు జీవిని దేహామునందు బంధించుచున్నవి. ఈ బంధనము కారణముగా రాగద్వేషాదులు తత్ఫలితానుసారము తరువాతి జన్మములు కలుగుచున్నవి. ఈగుణముల స్వభావముగూడ అర్జునా వినుము-

ఈమూడింటిలో సత్వము నిర్మలము ప్రకాశవంతమైనది. దేహికి సుఖమునందు, జ్ఞానమునందును ఆసక్తి కలిగించుచున్నది. రెండవది రజస్సు. అనురాగము, ఆశ, ద్వేషము పట్టుదల మున్నగున వీ రజోగుణ సముద్భవములే. మూడవది

తమోగుణము. మూడిటియందు అధమమైనదిది- అజ్ఞానమున ముంచి జీవిని అవివేకిగా జేయును- ప్రమాదము, సోమరితనము, నిద్ర, ఈ గుణజనితములే. ఈయీగుణములకు దేహిబద్ధుడయి తదనుసారములైన కార్యములలోదగుల్కొని మఱుజన్మల నందుచుండును. అర్జునా! త్రివిధములైన ఈ గుణములు ఏకోన్ముఖముగా ప్రకోపించుచుండునని తలపకుము. దేనిప్రభావము దానిదే. సత్వగుణము ప్రబలమైనపుడు రజస్తమము లణిగియుండును. రజోగుణ మధికమగుచో సత్వతమములడుగునబడి యుండును. తమోగుణము తీవ్రించినచో సత్వరజోగుణములకు స్థానము తక్కువ- ఈగుణప్రభావ మెట్లుండునో ఈవరకే చెప్పితిని. సత్కర్మముల ఫలము నిర్మలమైన సత్వగుణము- రాజస కర్మముల ఫలము దుఃఖము, రాగద్వేషములు- తామసిక కర్మములఫలము అజ్ఞానమే- ఇట్టి తమోగుణ భూయిష్టుడు అధోగతి కావలసినదే. రజోగుణుడు మధ్యలోకముల జన్మించును. అనగా మర్త్యలోకమునందు ఏగుణమైనను బుద్ధిని పొరపెక్కమ్మి తత్సంబంధ కర్మములందు మగ్నమగునట్లు జేయును- సత్వగుణసంపన్నుడు తద్గుణప్రభావముచే సత్కర్మములొనర్చి సదాచార పరాయణులైన వారింటజన్మించి తన జ్ఞానసంపద నభివృద్ధి జేసికొనుచు, తద్గుణప్రాబల్యవేళ దేహమును విడచుచు ఊర్ధ్వలోకముల కేగగలడు- తన జ్ఞానసంపదచేత ఆధ్యాత్మిక చింతనమువలన వైరాగ్యము నొంది, ఈత్రిగుణములకు అతీతుడైనచో అనగా

తా నేపని చేసినను కర్తగాని భోక్తగాని తాను కాదనేభావనలో నిష్కాముడై కర్మఫలత్యాగి అయినవానికి మోక్షము లభించును ఆజీవికి మరల జన్మముగాని, జన్మసంబంధములైన దుఃఖములుగాని కలుగు అవకాశము లేదు-

ఈవాక్యము వినుసరికి పార్థునకొక నూతనోత్సాహము కల్గినది. మనస్సులో ఇట్లనుకొనెను. శ్రీకృష్ణ దేవియో చెప్పాచు పోవుచున్నాడు. గుణములు మూడనినాడు. వాని ప్రభావము వేర్వేరట, ఏది ప్రబలమై యుండునో తత్కార్యములు దేహికి కలుగునట ఈత్రిగుణములలో సత్వమొక్కటే నిర్మలమై ప్రకాశవంతమై వేదవిహితసత్కార్యము లొనరించుటకు దోహద మగునట- ఈమూడు గుణములను అధిగమింపగలుగుచో మోక్షప్రాప్తి యగునట" ఈమాటలు విని అర్జునుడు "శ్రీకృష్ణా, దేవా త్రిగుణములనుగూర్చి నీవు నుడివినదంతయు స్పష్టముగనే యున్నది- మోక్షప్రాప్తికి త్రిగుణముల నతిక్రమింపవలె ననుచున్నావు. అది సాధ్యమా? అట్టి గుణాతీతుని ఆచారవిచారము లెట్టివి. నావంటివాడామువానీయుని ఎట్లు తెలిసికొనగలడు. నాకీవిషయము తెలిసికొనవలె నున్నది." అని ప్రశ్నింపగానే శ్రీకృష్ణు డొకింత ఆలోచించి యిట్లనెను-

"అర్జునా! విను ఇది వినవలసిన విషయమే నేను చెప్పనే చెప్పితినిగదా ఈగుణప్రభావములు మనస్సుపై ప్రబలముగా ఉండునని- తత్కారణంగా సుఖమో దుఃఖమో

రాగమో ద్వేషమో కలుగును- వానికి వెనువెంటనే లొంగి పోక తనకు వానితో సంబంధము లేదనుకొని నిశ్చలుడై ఆత్మజ్ఞానముకల్గి యుండువాడు గుణాతీతుడు- అట్టి వివేకవంతుని లక్షణము లనెదవా, మంచి చెడ్డలందు సుఖదుఃఖము లందు సమబుద్ధి కలిగియుండుట మొదటిది. అతనిని స్తుతించుచో సంతోషముగాని నిందించుచో ద్వేషముగాని పొందడు- బంగారమును మట్టిపెళ్ళను ఎక్కువ తక్కువలు లేని సమముగనే యెంచును- మిత్రులు శత్రువులు ఒకటే అతనికి- తానుకర్తయే దేనిని చేయుచున్నట్లుగ భావించడు. అన్నిటి యెడలను నిర్లిప్తుడు-

అర్జునా! సర్వభూతములందు జీవాంశగానున్న నేను అక్షయమగు బ్రహ్మ భావమునకు నిలయమును ఈస్థానము సనాతనధర్మయుతము, సర్వాకారము, శాశ్వతానంద మయమునై విరాజిల్లుచుండును- ఈసత్యము నెఱిగి నన్ను నిశ్చల భక్తితో సేవించువాడుకూడ గుణాతీతుడై బ్రహ్మీభూతుడగుట కెట్టిసందియమును లేదు. అర్జునా! ఈవిషయము స్పష్టముగ గ్రహించితివిగదా-

## ౧౫ పురుషోత్తమ ప్రాప్తి యోగము

శ్రీకృష్ణుడు చెప్పుచున్న విషయములన్నియు అర్జునునకు ఒకదానినిమించి ఒకటి నూతనముగా కన్పట్టుచున్నవి. భక్తి జ్ఞాన కర్మయోగములైనవి. ఆమహానీయుని విశ్వరూప

దర్శనము లభించినది- త్రిగుణప్రభావము తెలిసినది- "గుణాతీతునకు అవ్యయానంద ప్రదమగు పరమపదప్రాప్తి కలుగును. ఆ బ్రహ్మపదమే తాను. తాను పురుషోత్తముడు" అనిన శ్రీకృష్ణుని సందేశము వినిన అర్జునునకు, ఆ పురుషోత్తమ తత్త్వమెట్టిదో పురుషోత్తమప్రాప్తి ప్రయోజనమెట్టిదో తెలిసికొనవలయునను కుతూకము గలిగి తనకాంక్షను శ్రీకృష్ణునడిగెను- శ్రీకృష్ణు డంతట-

అర్జునా! నీవడిగినది చాలచిత్రమైన విషయము. ఈ విషయమును చాల సూక్ష్మముగ గ్రహించవలయును కూడ. దానిని సవిస్తరముగనే చెప్పతలచినాను. ఈ సర్వజగత్తూ ఒక పెద్దసంసార మండలము. దీని ఉత్పత్తికి మూలమైన పురుషోత్తముడను నేను. ఎచ్చటనో అత్యున్నతమైన ఊర్ధ్వస్థానమున ఉందును. ఈ సంసారము నెఱిగినవాడు వేదవిద్వాంసుడే. ఆ విద్వాంసులు ఈసంసారమును ఒక పెద్ద అశ్వత్థ వృక్షముగాపోల్చి చెప్పుదురు. ఈ సంసారఉత్పత్తికి మూలస్థానము పురుషోత్తమపద మెచ్చటనో పైనున్నది. అందుచే తక్కిన వృక్షములవలెగాక ఈఅశ్వత్థమూలము (వేళ్ళు) పైనున్నవి కొమ్మలు(విస్తృతి) క్రిందనున్నవి. దీనిఆకులే వేదములు. ఆకుల పనివలెనే చెట్టునకు పోషణము జరుగుచున్నట్లు వేదకర్మములు విస్తృతిగనిన లోకముల కాధారమైనవి- సుస్థిరమై అనంతముగ కొనసాగు ఈ సంసారవృక్షము యొక్క ఉనికి అగోచరము- త్రిగుణసంబంధమై ఇంద్రియాభిమాన

మును పెంచుకొని నరులు జీవనగమ్యమును జేరుట కవరోధ ముగానున్న ఈసంసారవృక్షమును వైరాగ్యమను ఖడ్గముతో ఖండించి జ్ఞానులు ఏ పరమపదమునుజేరి జననమరణ దుఃఖావహమగు లోకమునకు మరల రారో ఆపదము ఎల్లర కాశ్రయము కావలెను. ఈసంసార మెవనినుండి వెలువడినదో ఆ పురుషోత్తముడను నేనే. నన్నే శరణముగ సర్వులును చేరవలసియున్నది- అవివేకము నణగద్రొక్కి- రాగద్వేషముల త్యజించి నిష్కాములైన జ్ఞానులు పొందకలిగిన అవ్యయపద మదియే- జ్ఞానతేజముతో మహాప్రకాశమానమైన ఆ పరమపదముముందు సూర్యచంద్రాగ్నుల వెలుగు లెందుకును చాలవు-

ఈ సంసారమంతయు నానుండియే వెలువడుచున్నదని చెప్పితిని. అర్జునా! యిది నీకు జ్ఞాపకమున్నదిగదా. నాలోనున్న ఒకఅంశమే ప్రాణిలోకమున జీవుడై పుట్టి, మనస్సుతో కూడి యున్న ఆఱింద్రియములను ఆకర్షించుచూ ఈయింద్రియముల కధిపతియై ఆ యా విషయసుఖముల ననుభవించుచుండును- వాయువుతోపాటు పుష్పసుగంధ మేగినట్లు ఒక శరీరమువిడచి ఇంకొక శరీరమునకేగు జీవాత్మతో ఆశరీరేంద్రియ వాసనలును ఏగుచుండును. గుణప్రభావమునకు లోబడు ఈ ఈశ్వరాంశమును అవివేకులు అపరిశుద్ధులు తెలిసికొన లేరు- ఆత్మజ్ఞానవికాసము చే అంతరదృష్టికల యోగులు

మాత్రమే ఈశ్వరాంశ తనులోనున్నట్లు తెలిసికొని సిద్ధులగుదురు-

పురుషోత్తముడనైన నాఅంశయొక్క ప్రకాశమెట్టిదో ఎచ్చటెచ్చట ఏవిధముగ ద్యోతక మగుచున్నదో ఆవిషయమునుగూడ చెప్పెదను వినుము- జగత్తునంతయు ప్రకాశింపజేయు సూర్యుని తేజము, చంద్రాగ్నులలోని వెలుగు నాప్రకాశము- భూలోకమున సర్వత్ర నిండి సర్వభూతజాలమును ధరించు శక్తియును నేనే. జఠరాగ్ని రూపముగ వైశ్వానరునిగ ప్రాణుల దేహములందుండి వారుభుజించు నాల్గువిధములైన ఆహారములను (నమలబడునవి, పీల్చబడునవి, త్రాగబడునవి, చప్పరింపబడునవి) జీర్ణ మొనరింతును- సర్వహృదయములందు నేనుందును- పూర్వజన్మస్మృతి, జ్ఞానము ఎచ్చటెచ్చట నున్నదో అది నావల్లనే కలుగుచున్నది. నన్ను వర్ణించి నాకీర్తి నుడువగలిగినవి వేదములే. వేదములు వెలువడుటకూడ నావల్లనే జరిగినది. వేదతత్త్వము బోధింపగలవాడను నేనే.

లోకమునందుగల ప్రాణికోటి, అర్జునా, రెండుతెగలుగా ఉన్నది- క్షరులు అక్షరులు అని- నాశనమగు స్వభావముకల జీవి క్షరుడు. అనగా కర్మబద్ధుడై తన కర్మఫలాను సారము శరీరములను ధరించుచు విడచుచూ జననమరణ బద్ధులు క్షరులు- ఆత్మజ్ఞానము నెఱిగి ఈ జననమరణముల

కతీతులైనవారు అక్షరులు. అక్షరుడు అనగా నాశములేని వాడు వానినే కూటస్థుడందురు-

ఈ యిరువెగలకన్న వేఱయిన పురుషు డొకడుకలడు అర్జునా! అతడే పురుషోత్తముడు. అవ్యయుడు, నిర్గుణుడు, అనంతుడై ముల్లోకములందు వ్యాపించియున్న ఈశ్వరుడు. ఆ రూపము నేనే- క్షరుని కతీతుడను, అక్షరునికన్న ఉత్తముడ నగుటచే నన్ను లోకములందు వేదములందు పురుషోత్తము డను నామమున వ్యవహరింతురు- నాతత్త్వమును స్వభావ మును సంపూర్ణముగ గ్రహించి, నన్ను పురుషో త్తమునిగ యెఱిగినవాడు నన్నే భజించుచు ధన్యుడగును-

అర్జునా! పురుషోత్తమతత్త్వ మత్యంత రహస్యము మహోన్నతమైనది. దీని నెఱిగిన జ్ఞాని చరితార్థుడు జన్మసాఫ ల్యము నందినవా డగును.

## ౧౬ దైవాసురసంపద్విభాగ యోగము

శ్రీకృష్ణుడు నుడువుచున్న పలుకులన్నియు వీనులకు విందుగా మానసమునకు ఉత్తేజకరముగా ఉన్నవి. ఎంత చెప్పి నను ఏమిచెప్పినను ఆసక్తితో వినవలెనని యున్నది- ముఖ్య ముగ గుణములు మూడింటికి ఎంత ప్రభావ మున్నదియు ఎంత నిశ్చలమతినైనను బొమ్మలవలె అవి మాట్లాడించునదియు వినిన పిదప అర్జునుని ఆసక్తి మఱింత యెక్కువయినది-తాను

ముందే నుడివినాడు శ్రీకృష్ణునితో, తనను శాసించి ఒక దారిలో పెట్టవలయుననీ- మధ్యమధ్య యుద్ధమునకు సిద్ధము కమ్ము లెమ్ము అనుచున్న శ్రీకృష్ణుని హెచ్చరికలు చెవులలో మ్రోగుచునే ఉన్నవి- మానవుని పరమగమ్యస్థానము పురుషోత్తముడైన తానే నని, త్రిగుణాతీతుడైన భక్తుడు తనను చేరగలడని శ్రీకృష్ణుని వాక్యములందు అర్జునుని మనసిప్పుడు లగ్నమైనది. ఊరకనే త్రిగుణాతీతుడు కావలెనని అనుకొనినచో ఎవడైనను కాగలడా. అందులకు స్వాభావికముగ కొన్నిలక్షణము లుండవలెను. ఎట్టివాడా సదభ్యాసమున కర్హుడు- ఆవిషయములు విశదీకరింపవలసినదని అర్జును డడుగగా శ్రీకృష్ణుడిట్లు తన ప్రవచనము సాగించెను-

అర్జునా! నీవు అడుగదగిన ప్రశ్నయే అడిగినావు. తప్పక ఆవిషయములుగూడ వినుము. లోకములో ఉన్న భూతగణము సర్వమును రెండువిధములుగ విభజింపవచ్చును- వాని ఉత్పత్తియే అట్లు జరుగుచున్నది- ఒకటి దైవగుణమునకు జేరినవారు, రెండు అసురగుణమునకు చెందినవారు- దైవగుణస్థితి *ముక్తిసాధన కనువైనది- అసురస్థితి అధఃపతనమునకే తీసికొనిపోవును- అర్జునా! నీవు దైవగుణమార్గముననే జన్మించితివి భయపడకుము- అని శ్రీకృష్ణుడు నుడువగనే పరమా

---

16-5 దైవీసమ్పద్విమోక్షాయ నిబన్ధాయాసురీ మతా ।
మా శుచః సమ్పదం దైవీ మభిజాతోఽసి పాణ్డవ ॥

త్ముని అను గ్రహము లభించినది ఇక నేను ధన్యుడనే అను భావముతో అర్జునుని ఉత్సుకత మతింత యెక్కువయి అర్జునుడు వినుచున్నాడు.

శ్రీకృష్ణుడు: దైవగుణసంపత్తినిగూర్చి మొదట చెప్పుచున్నాను. అర్జునా! అవి యిట్లుండును. నిర్భయము, చిత్తశుద్ధి, గురుభక్తి, జ్ఞానార్జనాభిలాష, ఇంద్రియనిగ్రహము, యజ్ఞము, శాస్త్రపఠనము, తపస్సు, మంచితనము, అహింస, సత్యము, కోపరాహిత్యము, దానము, త్యాగము, శాంతి, ఇతరులదోషముల నెంచకపోవుట, భూతదయ, నమ్రత, స్థిరత్వము, సౌమ్యవర్తనము, ధైర్యము, సహనము, శుచిత్వము, దానము, త్యాగము, దురాశ, ద్రోహచింత లేకుండుట, నిరతిశయము- ఇవి అర్జునా! దైవగుణసంబంధమున జన్మమందిన వాని లక్షణములు-

ఇక అసురగుణములను వినుము- కపటము గర్వము అహంకారము కోపము పరుషత్వము అవివేకము వారియందు శుచిత్వము సత్ప్రవర్తన సత్యము కానరాదు. జన్మమును సార్థకము చేసికొను మార్గమునకై ఆకాంక్ష ఉండదుసరిగదా జగత్కారణము అసత్యము, భగవంతు డనువాడు లేనేలేడు, ప్రాణుల ఉత్పత్తికి స్త్రీపురుషుల సాంగత్యమే కారణమని వారు వాదింతురు- వారికిగల దుష్టగుణ ప్రభావము వలన దుర్మార్గవర్తనులు బుద్ధిహీనులుగ ఉగ్రకర్మరతులు ప్రజా కంటకులై వ్యవహరింతురు- జీవకోటిని భ్రష్టులుగా

చేయు నవియే వారి పనులన్నియును. వారి కెల్లపుడును మరణక్షణము వరకును కామమోహ భోగ విలాసజీవనమే సర్వమనుకొని దానికొఱకు ధనము నన్యాయముగ ఆర్జించుచు మోసము ద్రోహమునకు జంకక తమ మనుగడ సాగింతురు. నా కీనాడు ఈ భోగభాగ్యము లున్నవి. రేపటిదిన మింత కన్నను ఎక్కువ సంపాదించి కూడబెట్టవలెను— అని ఊహాలు. ఆకోరికలకు అంతుండదు- వారిని వారే పొగడుకొనుచు తమయంతటివారు లేరని శత్రువులను ఒక్కరొక్కరినే పరిమార్చెద ననియు, ప్రజలను మోసగించు టకు తమదోషములు కప్పిపుచ్చుటకు పేరునకుమాత్రము దాన యజ్ఞము లొనర్తురు- వారి దేహములందును ఇతర దేహము లందువలెనే నున్నను కామమోహాదులకు వశులై నన్ను నిరంతరము ఈర్ష్యాద్వేషములతో చూతురు— పెక్కురీతులు బాధాకరములు అయిన నరకములే వారికి గతి. అధమజన్మ ములు రాక్షసజన్మము లెత్తుచు మూఢాతిమూఢులై నన్ను పొందలేక వారింకను అధోగతుల పాలగుచుందురు-

అర్జునా! వింటివిగదా అసురలక్షణములగూర్చి చెప్పుచు ఆ దుర్గుణులకు ఘోరనరకములే గతియని నుడివినాను. అసుర గుణు లొనరించు పాపఫలమే నరకము — ఈ నరకబాధలకు నరులను లాగుకొనిపోవునవి కామము క్రోధము లోభము. సద్గతులు కోరువారు మున్ముందీ దుర్గుణములు విడువవలెను. అది మొదటిమెట్టు. నా వలననే వేదము లుద్భవిల్లినవని చెప్పి

తినిగదా. ఆ వేదధర్మముల ననేక శాస్త్రములు స్మృతులు పురాణములుగా మహర్షులు రచించిరి. ఈ రచనలు వారి స్వార్థమునకు గాదు, ప్రజాకళ్యాణము కొఱకే. అవి పరమప్రమాణములు చేయవలసిన దేదియో చేయతగనిది యేదియో నిర్దిష్టముగ చెప్పగలవి ఆశాస్త్రములే. 'ఆ శాస్త్రములు స్మృతులు లెక్క మనకేమి మనయిచ్ఛానుసారము మనము చేయవచ్చును' అని వర్తించువానికి సుఖముగాని సిద్ధిగాని, మోక్షముగాని సున్న. కావున అర్జునా! నీవేది చేయదలంచినను అది శాస్త్రవిహితమయిన దానిగా నిశ్చయముగా తెలిసికొని చేయుము. నీయత్నము సఫలమగును – నీ సత్ప్రవర్తనమునకు శాస్త్రప్రమాణములే గీటురాయి. ఈ ధర్మమును విస్మరింపకుము–

## ౧౭ శ్రద్ధాత్రయ విభాగ యోగము

శ్రీకృష్ణుడు బోధించుచున్న విషయములన్నియు అర్జునుని మనస్సునకు పట్టుచున్నవి. ఆ మహాత్ముడు మధ్యమధ్య నేవోకొన్ని క్రొత్తమాటలను కలిపిచెప్పను. ఆమాటలన్నియు ఒకదానికొకటి అనుబంధ సంబంధములు కలవియే. ఏ శబ్దమును వదలినను చేయుచున్నదంతయు ప్రక్క ద్రోవలకు బోవునేమో. ఇది అర్జునుని చిత్తమునకు వచ్చిన పెద్దచిక్కు. ఒక త్రుటిమాత్ర మాలోచించి శ్రీకృష్ణునిజూచి యిట్లడిగినాడు –

కృష్ణా! మహాత్మా! నీ విపుడు చెప్పిన విషయములలో నాకొక సందేహమున్నది. పురుషోత్తముడవగు నీ తత్త్వ మెఱిగి

నిన్నుపాసించుచు చేయు యజ్ఞాదికార్యములు శాస్త్రోక్తములు, శాస్త్రవిహితములు కావలె ననుచున్నావు. ఇచ్చటే ఒక చిక్కు తోచుచున్నది. శాస్త్రవిషయములు సమగ్రముగ తెలిసికొనుట అందఱకును సాధ్యమా, ఆసక్తియున్నను తెలిసికొనుటకు అవకాశము లభించునా - ఈ కారణములచే శాస్త్రవిధులను గమనించక ఎవరైనను తగుశ్రద్ధతోడనే యజ్ఞాదులు చేసినచో వారినిష్ఠ యెట్టిదగును. నీవుచెప్పిన మూడుగుణములలో అతి సాత్త్వికమా, రాజసమా, తామసమా, అట్టి కార్యములవలన ప్రయోజన మున్నదా, వచింపుము.

అర్జునుని సందేహము విని శ్రీకృష్ణుడు - "అర్జునా, నేనింకను చెప్పబోవు నాలుగు మాటలు విను. నీ మదిలోఉన్న సందేహమునకు పరిష్కారము నీకే స్పష్టము కాగలదు - శ్రద్ధతో చేయుచున్న సత్కార్యమునకు శాస్త్రవిధి విధానము ఆవశ్యకమా అనుచున్నావు - శ్రద్ధయన నేమియో తెలిసికొనుము. శ్రద్ధఅనగా కేవలము ఆసక్తి ఒకటియేగాదు. తానొనర్చు కార్య ప్రయోజనమందు దృఢమగు విశ్వాసముగూడ కలిగియుండుట శ్రద్ధ - ప్రతిమనుష్యుడు శ్రద్ధకలవాడే. ఆతని పూర్వజన్మ ఫలమునుబట్టి ఆమనుజునిశ్రద్ధ సాత్త్వికముగాని, రాజసముగాని, తామసికముగాని అగుచుండును - ఈ గుణములను బట్టియే వారొనర్చు పూజలును ఉండును - ఈ గుణస్వభావములను నీకింతకమున్నె తెల్పియే యుంటిని.

సాత్త్విక శ్రద్ధాన్వితులు దేవతల నర్చింతురు. రాజసికులు, యక్షరాక్షసుల నర్చింపగా తామసికులు భూతప్రేతాదుల నర్చింతురు - అహంకారమునకు, దంభమునకు లోనగువారు కామక్రోధాన్వితులై వివేకములేక శాస్త్ర సమ్మతములుగాని ఘోరతపములు, భయంకరయజ్ఞము లొనర్చుచు శరీరములో నున్న నా యంశకుకూడ హింస కలుగజేయు చుందురు -

ఈ మూడు విధములైనవారు తిను ఆహారము, చేయ దలచు యజ్ఞతపోదానాదులు కూడ వారి వారి శ్రద్ధావిధ మును బట్టియే ఉండును -

సాత్వికులు రసవంతములు చమురుగలవి పుష్టిప్రద ములు కంటికింపైన ఆహారపదార్థముల నిచ్ఛగింతురు. ఇట్టి ఆహారము అర్జునా కార్యాచరణమందు ఉత్సాహము, బలము ఆనుకూల్యమేగాక ఆయురారోగ్యములగూడ నొసగును. రాజ సికులకు తీవ్రమైన రుచికలవి అనగా చేదు, ఉప్పు, పులుపు, కారము అధికముగా ఉన్నవి, కడుపును మండించుచు అధి కోష్ణము కలిగించినవి ఇష్టము. వీనిఫలము బాధ రోగము తప్ప మరొకటి లేదు - తామసికు లందువా, ఏదో పశువు తినినట్లు తినుటయే వారికి కావలయును - చల్లబడి పోయినవి, విలువఉండి కుళ్ళి వాసనగొట్టునవి, రుచిహీనములు, అశుభ్ర ములు అయిన తిండిపదార్థములే వారికిష్టము -

వేర్వేఱుగ ఈ గుణములచే ప్రభావితమగు శ్రద్ధచే చేయుయజ్ఞములు తపములుగూడ అర్జునా! అట్లే వేఱు వేఱుగ నుండును -

శాస్త్ర విధ్యుక్తము, ఫలాపేక్ష లేని చిత్తశుద్ధితో సలుపు యజ్ఞకర్మము సాత్త్వికము. గర్వాతిశయముతో తన గొప్పతనము చూపుటకై చేయుయజ్ఞము రాజసికము - శాస్త్రవిధులు లెక్క చేయక, దానధర్మములు, మంత్రపాఠములు లేక, శ్రద్ధకూడపూనక చేయుయజ్ఞము తామసికము పూర్తిగ వ్యర్థమే -

ఇక తపస్సును గూర్చి వినుము -

సాత్త్వికమైనతపస్సు మరల మూడు తెరగులు- మనో వాక్శరీర సంబంధములైనవి. దేవతలను విప్రులను గురువులను జ్ఞానులను, పూజించుట శారీరకతపము, ఇందు శుచిత్వము, చిత్తశుద్ధి, అహింస, బ్రహ్మచర్యము ఆవశ్యకములు - ప్రియ భాషణము సత్యము హితకరమైన ప్రసంగము వేదశాస్త్రాధ్యయనము వాక్కునకు సంబంధించిన తపస్సు - మౌనము ఆత్మ నిగ్రహము చిత్తశుద్ధియుతమైనది. మానసికతపము - రాజసికతపము అహంకార గర్వములతో కూడుకొన్నది. ఈతపము వలన తనకు ప్రతిఫలముగ సన్మానము, గౌరవము కలుగవలెనను అభిలాషతో విశ్వాసరహితముగ జేయునది. తామసిక తపస్సు ఇతరులకు పీడకలిగించుటకే తనకు, బాధ కలుగునేమో యను ఆలోచనగూడ లేక చేయునది -

యజ్ఞాదులందు చేయుదానముగూడ ఇట్లే త్రివిధములు- దానమునొక శాస్త్రవిధికర్తవ్యమాగ నెంచి, ప్రత్యుపకార మాసింపక అర్హుడైనవానికి సమయానుకూల మెఱిగి చేయునది సాత్వికదానము - ప్రత్యుపకార మాసించుచు తనపేరు అందఱు చెప్పుకొనవలయునను ఆశతో మనఃపూర్తిగా గాక ఏదో చేయవలయునుగదా యని చేయుచున్న దానము రాజసికము. ఇది నా నెత్తికి ఎందులకు వచ్చినదిరా అని ఎదుటివాని తిట్టుచు తిరస్కార భావముతో సమయాసమయ లెంచక చేయునది తామసికదానము -

అర్జునా! ఈ యజ్ఞ యాగాదులలో ఉచ్చరింపబడు ఒక పవిత్రశబ్ద మున్నది. "ఓమ్ తత్ సత్" అనునది అదియే. ఇది మూడుమాటల కూడిక. పరబ్రహ్మమునకుగల మూడు తెఱగులైన నామ మిదియే అని అందురు. పరబ్రహ్మము తాత్వికముగ నామరూపరహితమైనదే కాని సాధకుల సాధనకు, చింతనకు ఆ నామములు నిర్దేశింప బడినవి. "ఓమ్" అనగా పరబ్రహ్మము. 'తత్' అపరబ్రహ్మము 'సత్' సత్యమైనదని ఈ వాక్యతాత్పర్యము. ఈ మంత్రోచ్చారణ పరమపవిత్రమైనది- అదిని బ్రాహ్మణులు వేదములు, యజ్ఞములు నిర్మింపబడుట ఈపదముల వలననే-

వేదవిధుల ననుసరించువారు 'ఓమ్' అని ఉచ్చరించుచు యజ్ఞ దాన తపః క్రియలు నిర్వహింతురు. 'తత్' అను శబ్దముతో

ముముక్షువులు ఏవిధమగు ఫలాకాంక్ష లేక వివిధము లగు యజ్ఞతపము లాచరింతురు. కర్మఫలత్యాగమే మోక్ష మార్గమని నే నీవరకే నుడివితిని – 'సత్' అనునది సత్యమై నది, శ్రేష్ఠము, శుభప్రదము అను అర్థములలో వాడుదురు – ఈ కార్యములం దావశ్యకమగు నిష్ఠనుకూడ ఈ సత్ శబ్దము తెలుపును – ఆ నిష్ఠలు నేను పూర్వము నుడివినటుల ఈ కర్మము లన్నియు ఈశ్వరప్రీత్యర్థములౌను విశ్వాసము, చిత్త శుద్ధి సంయుతము లే.

శ్రద్ధ విశ్వాసము చిత్తశుద్ధి లేనియజ్ఞ దాన తపములు పూర్తిగ వ్యర్థములు. 'అసత్' అని చెప్పబడు అశుభములం- కాన ఈ కర్మములందు చూపదగిన శ్రద్ధ శాస్త్ర, విధి విశ్వా సము కడుజాగ్రతతో గమనింపుము–

## ౧౮ మోక్షసన్న్యాస యోగము

శ్రీకృష్ణు డర్జునునకు తాను చెప్పదలచిన దంతయు చాలవఱకు నుడివినాడు. ఇక చెప్పవలసిన దేమైన యున్నచో చెప్పినవిషయములను సింహావలోకనముగ మరల జ్ఞప్తి చేయ వలయును– ఏదియో భ్రాంతిలోపడి యుద్ధపరాఙ్ముఖుడైన అర్జు నుని అతని సహజ క్షాత్రధర్మమునకు సుముఖుని చేయుట ప్రధానాంశమై దానికనుగుణముగ ఉపనిషదర్థ బీజముఖి నా యర్జునుని మనస్సున నాటినాడు. తన ఈశ్వరీయత ప్రత్యక్ష

ముగ దర్శింపజేసి, తన విభూతులను వర్ణించి చెప్పి తాను నుడివినదెల్ల ధర్మ్యామృతము, రాజవిద్య, పరమరహస్యమైన దని విశదముగ బోధించినాడు. అర్జునునకిక కృష్ణుడు తనకు చెలికాడు బావమఱందియు కాదు– శ్రీకృష్ణుడు కేవలము అక్షర పరబ్రహ్మమగు పరమాత్మస్వరూపమని గ్రహించి విశ్వసించి ఇదియంతయు తన శ్రీభగవానుని అనుగ్రహాఫల మని మనసార నమ్మినాడు–

శ్రీకృష్ణుడు తన ప్రవచన మారంభించి ఘడియ దాటి నది– యుద్ధారంభ శంఖధ్వాను లెపుడు మ్రోగునా యని ఇరు వాగుల బలములు తొందరపడుచున్నారు– తమ దుస్తులు కవచములు సరిచేసికొనుచున్నారు– అశ్వారోహకులు గజా రోహకులు తమ వాహనములను సరియైన భంగిమలో నిలబెట్టు చున్నారు– చేతనున్న ఆయుధములను ధృఢముగ ధరించి మఱింతగ మెరయునట్లు జేయుచున్నారు– రథాశ్వములను ముందునకు దూకించుటకు సారథులు యజమానుల హెచ్చరిక యేక్షణమున వినిపించునో యని చెవులను రిక్కించి కాచుకొని యున్నారు–

ఎక్కువ కాలవ్యవధి తమకు లేదని, అర్జునుని తొందర పెట్టు తలంపుతో శ్రీకృష్ణుడు, "అర్జునా! చాల విషయము లను నీకు నుడివినాను, నీకు నామాటలయందు నాయందు నమ్మకము కుదిరినది– సంతసించితిని. ఇంకను మఱేమయిన

విషయము లున్నచో వానినిగూడ వివరింతును- నీకేమైన సందేహము లున్నచో అడుగుము". అనగనే పార్థుని మనసున కెంతో ధైర్యము తోచినది. తానుగూడ తనసందేహములను, నివృత్తి జేసికొను తలంపులోనే యుండి యిట్లడిగినాడు-

"కృష్ణా, మహానుభావా నీవు రెండుముఖ్యమైన సందర్భములలో, మనఃపూర్వకముగ కర్మముల నన్నిటిని సన్యసించు" అని "కర్మఫలమును త్యజింపుము" అనియు నుడివినావు. ఈ రెండు వాక్యములలోనున్న సన్యాసము, త్యాగము అనుపదముల అర్థము వేర్వేఱుగ నున్నచో వానితత్త్వమును వినుగోరెదను. వివరించి నన్ననుగ్రహింపుము దేవా!" అను అర్జునుని జూచి శ్రీకృష్ణుడు-

అర్జునా! ముందు నీవడిగిన విషయములనే చెప్పుచున్నాను వినుము నేను క్రొత్తగా నీకు కల్పించి చెప్పునది కాదు తెలిసినవారు నుడివినవే యివి- నీ వనిన రెండు మాటలకు మధ్య భేదములేదు. అర్జునా! ఉదయాది సాయంకాలము వరకు మనమునుగడ కేవోకర్మలను చేయవలసియే ఉండునుగదా- వానిని వదలుట దేహయాత్ర కనుకూలముకాదు. కామ్యకర్మములు, అనగా మనమేదో సుఖభోగమును కోరి చేయనవి పనికి రావు; వానిని వదలుట సన్యాసమని కొందఱు పండితు లందురు. ఈ కామ్యసుఖముల ననుభవించుటకు జన్మములు తప్పవు. అవిమోక్షమున కవరోధమని వారిభావము-

కర్మమేదైనను దానిఫలముతో మనకు సంబంధముగాని దానియం దాసక్తిగాని లేదనుకొని కర్మఫలమును విడవలయు నని మఱికొందఱు పండితులు నుడువుచున్నారు- కర్మములు దోషయుక్తములుగాన వానిని వదలవలయుననియే కొందఱి భావము కాని యజ్ఞదానతపములు సత్కర్మములు శ్రేయో దాయకరులుగాన వదలరాదని మఱికొందఱి విశ్వాసము-

అయితే త్యాగము అనే విషయమును గూర్చి నా అభిప్రాయమును విను అర్జునా. ఈ త్యాగము మూడువిధ ములు యజ్ఞ దాన తపములవలన చిత్తశుద్ధి యేర్పడును. అది జ్ఞానార్జనకు మార్గము. వానిని త్యజింపవలసిన ఆవశ్యకత లేదు. అయినను ఆ కర్మములను చేయుచున్నది నేను అనే కర్తృత్వాభిమానముగాని, ఆ కర్మములందు ఫలాపేక్షగాని ఉండరాదు-

నిత్యకర్మలను సన్యసింపరాదు- ఒకవేళ యెవరైనను సన్యసించినట్లయితే అది అవివేకము, తామసికము అనిపించు కొనును. ఈ నిత్యకర్మములు, సంధ్యావందనాది విధులు పితృ తర్పణములు మొదలయినవి- ఇవి ఆచరించుట మనకు కష్టము, వానికి తగిన ద్రవ్యాదులు తెచ్చుట, కాలమును వీనికొఱకు వినియోగించుట కష్టమని ఈ కర్మలను వీడుట రాజసిక త్యాగము- ఆ కర్మఫలమాతనికి లభింపదు- నిత్యకర్మముల రహస్యమెఱిగి నా హృదయ పారిశుద్ధ్యము నెంచి చేయవలసి

నవిగాన చేయుచున్నాను. ఇంతికన్న నాకు దీనియందు ఆసక్తి గాని ఫలాపేక్షగాని లేదనుకొనుట సాత్వికత్యాగము - ఇట్టి సత్వగుణునకు కర్మములందు ఇష్టానిష్టము లుండవు. ఫలాసక్తియు కలుగదు- మానవునకు కర్మములను మొదలంట వీడుట అసాధ్యము- కర్మఫలమును వీడు నరుడే 'త్యాగి' అనగా- ఈ కర్మఫలము లెప్పుడు ఎట్లు కలుగును? త్యాగికి ఆ విషయమే అక్కఱలేదు- వానియం దతడు అనాసక్తుడు- ఆ త్యాగఫలము జన్మరాహిత్యమే-

ఈ కర్మములు, నెఱవేఱు విధమునుగూర్చి కూడకొన్ని విషయాలు అర్జునా జాగ్రతగ వినుము- తాను చేయుచున్న పనులకు తానే కర్తననుకొనుట కెవనికిని అవకాశమే లేదు- తాను తనకు ఆలంబముగానున్న దేహము, వివిధములగు ఇంద్రియములు, వాని వర్తనము, ఆ పైని తత్కర్మకు అధిష్ఠాన దైవము- ఈ అయిదు కూడినప్పుడే ఏదయిన కర్మము కొనసాగును. ఆ కర్మము న్యాయమైనదో, అన్యాయమైనదో వాక్కు మనస్సు శరీరములకు సంబంధించినది ఏదయినా కొనసాగును. ఈ రహస్యము గ్రహించలేక అంతటికి తానే కర్తనను కొనువాడు మూఢుడు-

అర్జునా! తానే కర్తనను అహంభావము లేక, ఇప్పుడు నీ వొనరింపబోవు యుద్ధమున ప్రతివీరులను చంపినవాడు

ఎవరిని చంపనివాడే అగుచున్నాడు. ఆ కర్మ యందాతడు బద్ధుడుకాడు.

కర్మము నొనర్చెడి పైజెప్పిన అయిదుపదార్థములుగాక కర్మమును ప్రేరేచునవి జ్ఞానము జ్ఞేయము జ్ఞాత అని మూడు విధములు. వీని వివరణమును నీవు పూర్వమే వింటివి. అట్లే కర్మకాధారములైన సాధనము, క్రియ, (ఉద్దేశ్యము) చేయువాడు అని మూడు తెఱగులున్నవి. త్రిగుణములనుగూర్చి చెప్పితినిగద దీనినిగూర్చిన వివరణములకు సాంఖ్యశాస్త్రము ప్రమాణము. ఈ గుణభేదము ననుసరించి జ్ఞానము కర్మము కర్త అనునవిగూడ త్రివిధములుగ చెప్పబడినవి. వానిని గూడ తెలుసుకొనుము.

## జ్ఞానము

అర్జునా నేను మొదటి నుండియు నుడువుచున్న విషయ మొకటియున్నది, నీవు గ్రహించియే ఉందువు. సర్వజగత్తు నందు వేఱ్వేఱుగనున్న చరాచర భూతకోటియందు ఏకైకము అవ్యయమునై విరాజిల్లు ఆత్మపదార్థమున్నది. ఆ యాత్మ నెఱుగగలజ్ఞానమే సాత్త్వికజ్ఞానము. గుణములలో సాత్త్వికమత్యుత్తమమని తెలిసినదేగదా. ఈ యేకత్వమెట్లు ఊహింపవలెనో దానినివినుము. మట్టికుండలనేకరూపములు దానిలోనిమృత్తికఒక్కటే. సముద్రతరంగములు వేలు లక్షలు జలముఒక్కటే. పుష్పములనేక విధములు పరిమళమొక్కటే. ఇట్లే భూతము

లందు పరమాత్మఅంశ- ఈ పరమాత్మ అద్వితీయమగు ఒక్క పదార్థము కాదు. వేర్వేఱు భూతములందు వేర్వేఱుగనే ఉండు ననుకొను జ్ఞానము రాజసికము. ఏ వృత్తివాడైననేమి ఏ కులమువాడైననేమి వారి యందలి ఆత్మస్వరూపమును భిన్నముగ నెంచుట రజస్స్వభావము. చంచలమగు మనస్సుతో తన బుద్ధికి తట్టిన ఏదో యొక వస్తువునందే ఆసక్తితో అదియే సర్వమనుకొను తెలివి తామసికము. అది వినాశనమునకు హేతువు.

ఇక కర్మముగూడ త్రిగుణాన్వితము-

కర్మము నేదోరీతి నొనర్పకుండ ఎవడును ఒక్క క్షణమైనను ఉండడు- ఆ కర్మయందే కర్తృత్వ భోక్తృత్వములు పెంచుకొను ఆసక్తి అపేక్ష లేక శాస్త్రవిధివిహితమగు కర్మము సాత్త్వికము- శ్రమతో కూడినది, తత్కర్మ ఫలమపేక్షించు అహంకారముతో కూడినది రాజసిక కర్మ. శక్తి సామర్థ్యములు చూడక ముందు వెనుక లాలోచింపక దీని వలన ఎవరికే దుఃఖము కీడు కలుగునో యనువిచక్షణ చూడక చేయబడు కర్మము తామసికము. స్వార్థమునకై ఒకరిని పీడించుట, అన్యాయముగ ద్రవ్యము లార్జించుట ఇట్టివే. ఇవి కేవలము అజ్ఞానమూలకములు ప్రమాదకరములు. మనుజుని అధఃపతితునిజేయు అసురకృత్యములు- అర్జునా ఇట్టివి మనసునందూహాకే రాగూడదు-

కర్మము లొనర్చువా డెట్టివాడో వినుము-

వానికి ఫలాఫలములం దపేక్ష యుండదు- అహంకారము గాని, ఆసక్తిగాని లేని నిర్వికారుడు. తనపనులు నిత్యోత్సాహియై చేయువాడు సాత్వికకర్త- లోభియై కర్మ ఫలము నాశించుచు రాగద్వేషములతో హింసాత్మకమగు కర్మలొనర్చువాడు రాజసకర్త, అవివేకి, మోసగాడు, ఇతరుల నాశనము గోరువాడు సోమరి మత్తుడు మత్సరుడై కార్యములు చేయువాడు తామసికకర్త. వీనిని నరకసంబంధమగు నీచ జనన మరణములు బంధించి విడువవు-

ఈ మాట లన్నియు వినుచున్న అర్జునున కేదియో మనస్సున దోచినది. త్రిగుణస్వభావముగల ఈ కర్మ కర్త జ్ఞానాదివిషయము లన్నియు మిగుల స్పష్టముగ దెలియు చున్నవి. వీని వెనుకనున్న సంగతు లీవరకే వినియుండిన కారణముచేత- ఇవి బాగుగనే ఉన్నవి కాని దీని వెనుకనున్న ఒకటి రెండు విషయములుగూడ తెలిసికొననెంచి అర్జునుడు-

'కృష్ణా, మహానుభావా, నీవు చెప్పిన కర్త కర్మము జ్ఞానమును గూర్చిన విషయములు నిజముగ విజ్ఞానదాయకములుగ నున్నవి- ప్రప్రథమమున వీనిని చేయవలయు నను బుద్ధి దానికి తగినధైర్యము ఉండవలయును గదా. వానికిని ఈ త్రిగుణ స్వభావముకల దందువా. అయినచో అవి యెట్టివి' అని ప్రశ్నింపగనే శ్రీకృష్ణుడు-

"అర్జునా! నీ వడిగినవిగూడ ముఖ్యమైన విషయములే. వీనియందును త్రిగుణస్వభావములు ప్రభలియున్నవి ఏ కర్మ మునైన చేయుటకు ముందు, అనగా ప్రవృత్తియగు కర్మ మార్గముగాని నివృత్తియగు సన్న్యాసముగాని, ఇది ధర్మమా అధర్మమా దీనివలన బంధము లెక్కువగుచున్నవా లేక బంధ ములు విడివడి మోక్షము సుకరమగుచున్నదా అని యోచించ గల బుద్ధి సాత్వికము- ధర్మాధర్మములు కార్యాకార్యము లెఱుగక చేయించునది రాజసబుద్ధి. తొందరపడి చేయుటయే ముఖ్యము- మంచిచెడ్డలు గమనింపదు- ఇక తామస మందువా, అజ్ఞానము మూఢత్వమే యిది. ఏ విచక్షణము లేక చేయుట విపరీతమైనదియు అధర్మమును ధర్మముగానెంచి విరుద్ధకార్యము లొనరింపజేయునదియు తామసికబుద్ధి-

ఇక ధైర్యముగూడ అట్టిదే వినుము- సామాన్యములగు కార్యములందు, అనగా ఒక యుద్ధమున పాల్గొనుటో దుస్తర ములైన సముద్రముల నీదుటో మున్నగు పనులకు వలయు ధైర్యము నటుంచుము- కర్మ కర్త జ్ఞానము ఇవి సాత్వికము గాండవలయు నన్నచో ఏ లక్షణములు విలసిల్లువలెనో నుడి వితిని, అట్టి సాత్త్వికలక్షణములు సుస్థిరముగ నిలుపగల్గు ఇంద్రియనిగ్రహము మనోబలము విలసిల్లజేయు ధైర్యసంపద సాత్త్వికము. ఇది మనస్సుకు సంబంధించిన ఉన్నతధైర్యము- ప్రారంభోత్సాహము గలదియై పదపడి సడలిపోవు ధైర్యము వలన లాభము లేదు- స్వలాభపూరితమైన ధర్మ అర్థ కామము

లందు ఫలాపేక్షాపరుడయి, మోక్షము మాట తలంపునపెట్టని ధైర్యము రాజసధైర్యము— ఇక కొందఱుందురు. చెప్పినను వినరు. చెడ్డపనియైనను చేయుటకు వెనుదీయరు— ఆ కార్యములు మదమత్సర పూరితములు, దుఃఖప్రమాద భరితములు, అగుగాక వానిని తెలిసికొనలేక చేయు మొండితనము తామస ధైర్యము— ఇది అధఃపతన కారణమగు రాక్షసగుణమే గాని మఱియొకటి కాదు—

అర్జునా, ఒక మాట వినుము. ఇప్పుడు నేను నుడివిన త్రిగుణప్రభావితములగు విషయములన్నిటిని సమన్వయించి చెప్పవలసిన దొకటున్నది— మనుజుడేదైన యెందుల కొనరింప జూచును. ఈ ఉద్దేశము వెనుకనొక అభిలాష ఉండవలయును గదా. ప్రవృత్తి మార్గామునను్న వారికైనను, నివృత్తి మార్గావలంబులకైనను ఒక లక్ష్యము తప్పక ఉండును— అది తన సాధనలో తాను సుఖము నందుటకే. ఈ సుఖమెట్టిదియో ఒకింత తెలిసికొనుము— సాధన విషయములో ప్రారంభదశ యందు విషమువలె కష్టముగనున్నను; తన బుద్ధి నైర్మల్యముదే తుట్టతుదకు అమృతప్రాయముగ నుండు సుఖము సాత్వికసుఖము— అభ్యాసకాలమున ఆటంకములు తోచినను అధైర్యపడరాదు. పర్యవసానమున లభ్యమగు అనంతానందమే ఆశయము కావలెను— ముముక్షువుల సాధనమిట్లే యుండును— బుద్ధి నైర్మల్యమనగా విషయేంద్రియదోషము

లకు దూరమగుటయే- విషయాసక్తితోకూడి ప్రారంభదశలో చాల అనుకూలముగా సంతోషప్రదముగనున్నను చివర వచ్చుసరికి విషప్రాయమగునది రాజససుఖము- విషయేంద్రియములకు వశులైనవారి పరిస్థితులిట్లే యుండును- మనుజులిది గ్రహించి తప్పుదారిపట్టి అధమ సుఖములను ఆశించరాదు- తామసికసుఖము ఆద్యంతము విషప్రాయమే- దీనివలన ఎట్టి లాభమును లేదు- మోహపూరితమైన వర్తన ఫలితమిట్లే యుండును- ఎందుకును కొఱగానిది- అజ్ఞాన మింకను బలపడి తామససుఖముల వలన మనుజుని భ్రష్టుని జేయును-

గ్రహించితివిగదా అర్జునా సత్త్వరజస్తమో గుణముల వలన మనుజుని ప్రవర్తన మంతయు ఎట్లు ప్రభావితమగు చున్నదో మాయాచ్ఛన్నమగు ప్రకృతినుండి పుట్టినవగుటచే ఈ గుణములకు లోబడని వస్తువు త్రిలోకములందును దేవతల యందునుగూడ కనుపింపదు-

ఓ పార్థా! చాలవరకు ముఖ్యవిషయములన్నియు నీకు ముందుగనే బోధ జేసితిని. వానికి అనుబంధములగు విషయములు కొన్నియున్నవి- ప్రస్తుతము మనమున్న యుద్ధరంగ పరిస్థితులను బట్టి త్వర త్వరగ వీనినిగూడ ముగించెదను. నీవు కడుశ్రద్ధతో వినుచుండుట సంతోషప్రదముగనున్నది- నీకు జ్ఞప్తియున్నదా నిష్కామ కర్మతత్త్వమును బోధించుచు, జను లందఱును వారి వారి గుణకర్మముల కనుగుణముగ నాలుగు

వర్ణములుగ సృష్టింపబడిరని నుడివితిని- వారి వారి జన్మాంతర సంస్కారములవలన వారికాగుణములు కలిగినవి. ఆ గుణములనుబట్టి వారి వారి కర్మవిభజనమును జరిగినది- ఈ వర్ణములెవ్వి అని నీవడుగ వచ్చును- బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్రులను వర్ణములవ్వియే- వారి స్వభావ జనితకర్మములను వినుము.

బ్రాహ్మణుల కర్మములు, శమదమములు, అనగా మనసు ఇంద్రియముల నిగ్రహము, తపస్సు శుచిత్వము సహనము. నిష్కాపట్యము, జ్ఞానము, విజ్ఞానము, ఆస్తికత.

క్షత్రియులకు, శౌర్యము, ధీరత, స్థైర్యము, తేజము, యుద్ధమునందు వెనుదీయకుండుట, ఈవి, ప్రభుత్వము.

వైశ్యులకు సేద్యము పశుపోషణము వర్తకము.

శూద్రులకు సేవా కార్యములు వృత్తివిద్యలు-

కర్మాచరణములోగల రహస్యమేమనగా, అర్జునా, ఎవని స్వకీయధర్మము వానికి శ్రేష్ఠమైనదగును- తన అవివేకముచే తనసహజధర్మము గుణము లేనిదిగ గన్పడినను బాగుగా ఆచరింపబడిన ఇతరుల ధర్మముకంటె ఉత్తమమే అగును- ఈ సర్వప్రపంచమునకు కారకుడు సర్వవ్యాపియయిన పరమేశ్వరుని తన స్వాభావిక కర్మాచరణముచే ఆరాధించువాడు జ్ఞానయోగ్యతాసిద్ధి నందును- అగ్నిని పొగ

కప్పియుండినట్లు కర్మములన్నియు గుణదోషములచే ఆవరింపబడి యున్నవి. పాపకార్యములనెఱిగి త్యజించుట ప్రతి మనుజునికి కర్తవ్యము. ఒకవేళ తన స్వకీయకార్యము దోషయుక్తమని తోచినను ఇతరులకెట్టి బాధయులేనిరీతిని నిష్కామముగ భగవదర్పణముగ చేయుటయే ఉత్తమము-

అర్జునా కర్మయోగ విషయమును నీ విపుడు వినినావు. సంగ్రహముగ మఱియొకసారి జ్ఞాన విషయమునుగూడ వినుము. మనుజు డేదోయొక కర్మను చేయుచునే ఉండును గదా, అట్లు చేసినను ఏదియును చేయని యట్టి నైష్కర్మ్య స్థితికి రావలయును- దానికి మార్గము దేనియందును కోరిక ఆసక్తి లేని వైరాగ్యభావము- విషయ వాంఛాత్యాగము, సంగరాహిత్యము, కర్మఫల త్యాగముతో కూడియున్న యీ స్థితియే మోక్షస్థితి. ఈ స్థితి కవసరములైనవి, నీ విదివరలో వినినవే. మఱియొకసారి జ్ఞప్తి చేయుచున్నాను- నిశ్చలము నిర్మలమైన బుద్ధి, మనస్సును ఇంద్రియములను నిగ్రహించుట. సుఖదుఃఖముల యందు ఇష్టానిష్టముల యందు రాగద్వేషములులేని సమబుద్ధి అహంకార మమకారములేని శాంతచిత్తము, కామక్రోధ లోభములు లేనివాడు బ్రహ్మపదము నొందుట కర్హుడు- అర్జునా అట్టి బ్రహ్మదేవుడు నిజముగ జీవన్ముక్తుడే. తాను ఆసక్తి పొందదగినదిగాని వాంఛింపదగినదిగాని అతని కేమియు లేదు- అన్నిటను సమబుద్ధియే

అతని యందు విలసిల్లును- నా యందు నిర్మలమగు భక్తియు అతనికి కుదురును-

భక్తిని గూర్చిగూడ అర్జునా సంగ్రహముగ మరల చెప్పుచున్నాను వినుము- జ్ఞానము భక్తి ఇది ఒకదాని కొకటి అనుబంధము లే. ఆత్మజ్ఞానము వలన నా యందు భక్తి కుదురును. భక్తివలన నన్ను మనుజుడు యథార్థముగ నెఱిగి జ్ఞానవంతుడై తుదకు నా సాయుజ్యము నందగలడు- నా యందు భక్తియనగా నా యందు ఆసక్తి అను ప్రేమ. విశ్వాసపూర్వకముగ నేనే తనకు ఆశ్రయమనుకొని నన్ను శరణుపొందవలెను- నా అనుగ్రహముచే మనుజునకు అవ్యయమైన మోక్షపదము నిశ్చయముగ లభించును- అతడు కర్మలొనరించు చున్నను వానిబంధము లాతనికుండవు-

అర్జునా మనుజునకు నా యందు విశ్వాసము కుదిరినచో కర్మ జ్ఞాన భక్తిగుణములవలన జన్మ సాఫల్యసిద్ధి యెట్లు లభించుచున్నదో వింటివిగదా. అందుచే నేను నీకు చెప్పబోవునదొకటే. నన్ను ధ్యానించుచు నా యందు నీ చిత్తము లగ్నము చేయుము- సర్వ కర్మములను ఫలాపేక్షరహితముగ నా యందు సమర్పించి నన్నే పరమశరణుగ భావింపుము. ఈ భక్తి సదా ఉండవలెను- ఇది యొక్కటే * అనుసరణీయమగు

---

18-58 మచ్చిత్తః సర్వదుర్గాణి మత్ప్రసాదాత్తరిష్యసి
అథ చేత్త్వమహంకారాన్న శ్రోష్యసి వినంక్ష్యసి॥

మార్గము- నీకు ఏవిధమైన దుఃఖములు క్లేశములున్నను నా మాటలు విని యాప్రకారము ప్రవర్తించుచో ఆ దుఃఖములు క్లేశములుయన్నియు తొలగిపోవును. తొలగిపోవుటే కాదు. తుదకు జ్ఞానవంతుడవై నన్ను జేరుదువు. నా మాటలు నీవు వినకున్నచో నీవే చెడిపోదువు. ఇంతికన్నను స్పష్టముగ ఏమి చెప్పుదును- ఒకవేళ ప్రథమమున నీ వనుకొనినట్లు, అనగా, నీవు నీ స్వజనమును చంపి పాపము నొడికట్టుకొనుటెందులకు, యుద్ధము చేయను అని అహంకారముతోనుందువా. ఆ ప్రయత్నము పూర్తిగావ్యర్థమే. ఏలనందువా' నీ క్షాత్ర స్వభావధర్మము నీచే యుద్ధము చేయించి తీరును. దానికి నీవు అనివార్యముగ అధీనుడవు కావలసినదే-

అర్జునా మఱియొక మాటనుగూడ వినుము- పరమాత్మ అగు ఈశ్వరుడు ఎక్కడో దూరము నందుండు నని భావింపకుము. ఈశ్వరుడు జగత్తునంతయు శాసించు ప్రభువు! సర్వభూతముల హృదయములందును కలడు- తన మాయాచే యంత్రమునం దమరించిన బొమ్మలవలె జనులను త్రిప్పుచుండును. మాయచే కప్పబడిన ఈ ప్రపంచమునందు జనులను వశపరచుకొను అనేక విషయేంద్రియ సుఖము లుండును- వానికి లోబడక ధర్మమునెఱిగి హృదయమందున్న ఈశ్వర సన్నిధిని గుర్తించి నరుడు మెలగవలయును- సాక్షిమాత్రుడై ఈశ్వరుడు మానవుని వర్తనము గమనించుచునే యుండును-

హృదయస్థుడగు ఈశ్వరునే శరణుబొంది సర్వోత్తమగు మోక్ష శాంతిని నీవు పొందగలవు- దీని నెప్పుడును మఱవకుము-

అర్జునా నీవు నాకు కావలసినవాడవు. నేను చెప్పుచున్న దంతయు శ్రద్ధగా వినుచున్నావు- నేను చెప్పిన విషయము లన్నియు నీకు జన్మసాఫల్యమును గూర్చు మోక్షపదము నొసంగు నవియేగాక, రహస్యములలో పరమరహస్యము లయిన ధర్మములు- వీని నన్నిటిని విచక్షణ శీలుడవై, విమర్శ నాత్మకముగా విచారించి నీవే ఒక నిర్ణయమునకు రమ్ము. ఇందు నా బలవంతమేమియును లేదు- నీ కెట్లు మంచిదని తోచిన అట్లే చేయవచ్చును. అయినను మరియొక్క మాట- నాకు నీవు ఇష్టుడవు గాన నీ శ్రేయస్సునుగోరి చెప్పుచున్నా మాటలే ఇవి-

నీ మనస్సెప్పుడు నా యందే లగ్నముచేసి యుంచు. నా యెడల భక్తి కలిగి నన్నారాధింపుము. నాకు నమస్కా రము లర్పింపుము- ఈ విధముగ మనఃస్ఫూర్తిగ చేయుదువా నన్నే నీవు చేరగలవు. ఇది నిశ్చయమని సత్యముగ ముమ్మా టికి ప్రతిజ్ఞ చేసి చెప్పుచున్నాను అర్జునా- ఇక నీకు సంశ యింపవలసిన పని గాని శోకింపవలసిన పని గాని * లేదు-

---

18-66 సర్వధర్మాన్ పరిత్యజ్యమామేకం శరణంవ్రజ!
అహం త్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి
మా శుచః॥

పాప విముక్తులయి పుణ్యలోకములకేగి అచ్చటి శుభములను నిశ్చయముగ పొందుదురు-

అర్జునా, నీవు భ్రాంతిలోపడి యుద్ధము చేయుట వలన నీ కేదియో పాపము సంభవించుసను భయముతో దీనుడవై యున్న నీకు నేను చెప్పవలసిన దంతయు చెప్పితిని. కొన్ని ముఖ్యాంశములు రెండవసారిగూడ బోధించితిని- ఈ చెప్పిన దంతయు మెలకువతో వింటివా. నీ సందేహములన్నియు ఇప్పటికైన తొలగి నీవు చేయవలసిన కర్తవ్యమేదియో తెలిసి నదా లేదా?

శ్రీకృష్ణు డాప్యాయముతో ఈ మాటలు నుడువు సరికి, అర్జునున కొడలు పులకించినది- కనులు వెంట ఆనందా శ్రువు లుప్పతిల్లినవి. శ్రీకృష్ణుడే తన శరీరము నంతటినితడవి తనలో ఒక నూత్న తేజము నుదయింపజేసి నట్లయినది- తానిది వరకు అనుదినము చూచుచున్న వ్యక్తి కాదు శ్రీకృష్ణు డిప్పుడు. అ మహానుభావుని వదనారవిందములోని, ప్రేమా దర దృక్ప్రసారము నుండి, మధుర దరహాసము నుండి ప్రసన్న మగు ఒక తేజము వెలువడి తనను ఆపాదమస్తకము కప్పివేసి నట్లయినది- ఆ తన్మయత్వమున అర్జును డొక్కనిమేషము ఏమియు మాటాడలేని స్థితిలోపడి, కడకు తేరుకొని, చేతులు జోడించి శిరమరవాల్చి 'శ్రీకృష్ణా దేవా, పరమాత్మస్వరూపా, అచ్యుతా, నీ ప్రశ్నలకు ప్రత్యుత్తరము చెప్పదగిన వాడను.

గాదు స్వామీ, నన్ను మూఢత్వమను ఆపద నుండి రక్షించిన ప్రభువువు. నీ యనుగ్రహము వలన నా అజ్ఞాన మంతయు నశించినది. ధర్మ స్మృతి కలిగినది- నా కర్తవ్యమేదియో నా మనస్సునకు స్పష్టముగ కనుపించు చున్నది- నీవు చెప్పిన మాటలన్నియు నాకుశిరోధార్యములు- నీ యాదేశానుసారము సర్వము నిర్వహించుటకు సంసిద్ధుడనై యున్నాను' అని ఉత్సాహముతో క్రిందకు జారవిడిచిన తన విల్లమ్ములను ధరించి ధైర్యముగ నిలబడెను-

శ్రీకృష్ణుని వదనారవిందము సంఫుల్లమైనది అర్జునునకు తన ప్రబోధము వలన జ్ఞానోదయమై కర్తవ్య స్పృహ గలిగినందులకు సంతృప్తితో బాటు పరమ సమ్మోదము నంది విజయోఽస్తు విజయోఽస్తు అర్జునా యనుచు తన బాహువులు సాచి అర్జునుని మనసారా కౌగలించు కొనినాడు. ఆ గురు శిష్యులిరువురు ఒకరి కౌగిలిలో ఒకరు కరగి పోయినారు- మఱునిముసములో శ్రీకృష్ణుడు రథాశ్వముల వీపులను ప్రేమ పూర్వకముగ తట్టి పగ్గములు చేతబూని అరదంపు నొగలపై సారథియై నిలుచుండెను. రథారూఢుడైన అర్జునుని చేతిలో గాండీవము, తూణీరముల నున్న పాశుపతాది అస్త్ర శస్త్రములు తమ శక్తిని చూపించగలుగు సమయ మాసన్నమైనదని దివ్య తేజముతో వెలుగుచున్నవి- పార్థుని వదనము దుర్నిరీక్ష్యమగు మహావీర ప్రకాశముతో నిండియున్నది- విజయో

త్సాహముతో అర్జునుడు తన దేవదత్తము చేబూని నాదు-భూమండలమున పాపభరమణగి ధర్మ ప్రతిష్ఠాపనము కాగల మహాభారత యుద్ధ మారంభమైనది-

## 7. విజయ శంఖారావము

సంజయా డీ కృష్ణార్జున సంవాద మింతవరకు నుడువు సరికి వినుచున్న ధృతరాష్ట్ర మహారాజున కొక్కపెట్టున దేహము కంపించి నట్లయినది. తడబడు మాటలతో "ఏమేమి సంజయా! ఏమి చెప్పితివి. స్వజనులను చంపు మహాపాపమున కొడిగట్టలేనని విల్లమ్ముల విడచిన అర్జునుడు శ్రీకృష్ణుని మాటలను విని యుద్ధమునకై లేచెనా. ఎంత విడ్డూరముగా నున్నది! అర్జుని ధైర్యసాహసములు శౌర్యపరాక్రమములు అజేయములు, ఆతని బెడద కౌరవులకు తప్పినదని సంతసించితిని సుమా- అర్జునుడు శస్త్రాస్త్ర ధరుడయి యుద్ధోన్ముఖుడగుట నా గుండెలలో కొట్టులు గొట్టినట్లయినది- సంజయా! నీ వంతయు సరిగానే చెప్పుచున్నావు గదా. నీవు చూచినది చెప్పుము. యుద్ధారంభ మెట్లయినది- ఆ సూచన లెట్లున్నవి. అని అడుగగనే సంజయుడు మరల-

"మహారాజా, ఔను అర్జునుడు అజేయుడైన జగదేక వీరుడు. అతని కలిడే సాటి- వ్యాసభగవాను డొసగిన దివ్య శక్తి ప్రభావము వలన, పరులకంట బడకుండ శ్రీకృష్ణార్జునుల సంవాదమును వినగల్గితిని- మహాద్భుతమయిన దృశ్యమది.

వారిని చూచుచు వారి సంభాషణము వినిన నన్ను పులకి తాంగునిజేసి ఒడలు మఱపింప జేసినది- నా ఆనందాతిశయమున కు మేఱలేదు. శ్రీకృష్ణుడు అర్జునునకు నుడివిన అతి రహస్యము అత్యుత్తమము అయిన యోగశాస్త్రమును విను మహాభాగ్యము నాకు కల్గినది. నీకు తెలియజేయు సదవకాశము లభించినది. నా కిప్పటికిని ఆ సంభాషణ క్రమ మంతయు మరల మరల స్ఫురణకు వచ్చుటయే గాదు, నా చెవులలో మఱుమ్రోగుచునే యున్నది- శ్రీకృష్ణుని విశ్వరూప దర్శనమున నా జన్మము ధన్యమైనది- ఆ గొప్పదనము ఆ విభూతి చెప్పనలవి కాని అద్భుతాశ్చర్యములు- మహారాజా, మరల మరల వానినే తలచుకొని పరమానందభరితుడ నగుచున్నాను. వేయి మాట లేల మహారాజా, ఒక్కమాటలో నుడివెదను- యోగేశ్వరుడైన శ్రీకృష్ణుడు, ప్రచండ దనుర్బాహుడైన అర్జునుడు యెచ్చట నుందురో అచ్చట సంపద ఐశ్వర్యము నీతి విజయము నిస్సంశయముగా విరాజిల్ల గలవని నా అభిప్రాయము-

ఇక యుద్ధ మారంభమైన విషయమును గూడ వినగోరెదవా, మహారాజా! ఆ దృశ్యమెట్లున్నదో చెప్పెదను వినుము- నాకు కనులు మిఱుమిట్లు గొల్పిన వనినచో ఆశ్చరము లేదు- అర్జునుడు శ్రీకృష్ణమూర్తికి సాష్టాంగ ప్రణామము లాచరించి సశర శరాసనుడై రథమున నిలుచుండెను.

ఆ మహావీరునిలో శత్రు భీకరమైన ఒక మహాతేజము వెలుగొందుట చూచినాను- చూచుట యేమి? ఆ ప్రకాశము దుర్నిరీక్ష్యమై నా కనులు మూతబడి పోయినవి- ఆ తేజము, ఆ యుత్సాహము ఆ జిగీష అచట నున్న యిరుతెగలలో నెవరి యందు కాన రాలేదు- అది యంతయు శ్రీకృష్ణుని ఆశీర్వాదబల మనుకొందును. ఖాండవదహన సమయమున, అగ్నిహోత్రుడు కానుకగా నొసగిన గాండీవ చాపము తాలాభమై మహా భీకరముగ అర్జునుని చేతి యందున్నది- మహేశ్వరు డొసగిన పాశుపతము, ఇంద్రాదు లొసగిన ఇతర మహాస్త్ర శస్త్రములు మహా తేజఃపుంజములై తూణీరమున నున్నవి. వానిని చూచుసరికే మన సైన్య వీరులకు గుండెలు దడ దడ లాడినవి-

అర్జునుడు లేచి తన శంఖము దేవదత్తము నెత్తి బలముగ పూరించినాడు. ఆ మహాధ్వని దిక్తటముల దాకి భూనభోంతరములు నిండి ఒకట నున్న ధ్వని మఱొక్కట ప్రతిధ్వనించి ప్రపంచము నల్లకల్లోలము చేసినది. ఆ మహాధ్వనికి మహారాజా వినుము దుర్యోధనుని సైన్య బలములో ఏ కొందఱో భీష్మద్రోణాది వీరులు తక్క తక్కిన వారు నిశ్చేష్టులైరి- అర్జును డంతతో ఆగ లేదు- ఎదిరి సైన్యము వైపు తన ప్రచండ గాండీవము నెత్తి ఆకర్ణాంతము నారిని లాగి టెటాలున ఒక్క పరి మ్రోయించి నాడు- దేవదత్త శంఖారావమునకే సంక్షుబ్ధమైన దుర్యోధనుని సేన నిర్నిరోధమైన ఆ

ధనుష్టంకారమునకు ఆ శబ్ద సంఘాతమునకు తట్టుకొనలేక తల్లడిల్లి కొన్ని వందల గజములు ఒక్క పెట్టున వెనుకకు నెట్టివేయబడినది. మహారాజా, ఆ చాప ధ్వనియే అంత ప్రబలముగ నున్నచో, ఆ చాప ప్రవిముక్తములైన బాణాగ్నులెంత ప్రళయ ప్రచండములుగా నుండునో ఊహింప నలవి కాని విషయము. అర్జునుని ఉత్సాహము జూచి పాండవబల ముప్పొంగి ముందునకు దూకినది. మన సైన్యబలము కూడ పితామహుడు భీష్ముని నాయకత్వమున ముందునకు వచ్చినది. ఎందఱో ఎన్ని విధములనో మాన్ప జూచిన పాండవ కౌరవ మహాయుద్ధము ఆగలేదు సరికదా, ప్రపంచ భీకరముగ, రథ గజ తురగ బటాళి విన్యాసములతో రణభేరీ నినాద తుములమై సాగినది.

మహారాజా ఒక మాట మాత్రము చెప్పి ఈ నాటికి విరమించెదను. ఆ యుద్ధరంగ మధ్యమున పాండవ బలముల కాగ్రగామియై నడచు పార్థుని రథము, గగన చుంబి కపికేతనముతో వాయువేగాశ్వములతో, మంగళ తోరణములతో, కాంచన ఘంటికాక్వణ నినాదములతో పగతుర గుండెల నలయించుచు మెఱసిపోవు చున్నది. మహాతేజస్వియై శ్రీకృష్ణుడు సారథిగ అందున్నాడు. రథ మధ్యమున చాపాస్త్రధారియై మధ్యందిన మార్తాండుని వలె నున్న అర్జునుని విజయ విజృంభణము చూచిన దేవతలకైనను ఈర్ష్య జనించును.

శుభసూచన లన్నియు మహారాజా అర్జునుని దెసనున్నవి- ఈ మహా సంగ్రామ విజయ మెల్లవిధములను శ్రీకృష్ణార్జును లదే. ఇది నిస్సందేహాము-

## 8. ధర్మ విజయము

సంజయుడు నుడివిన మాటలు వినిన అంధరాజు ధృతరాష్ట్రునకు మనస్సు సంక్షుబ్ధ సాగరమైనది. నిరాశా తరంగములు నింగి నంటినవి- ఒకింత తేరుకొని ఆ కురురాజు "ఏమంటివి సంజయా! ఏమంటివి. శ్రీకృష్ణుని ప్రబోధము విని అర్జునుడు విజృంభించి కదనమునకు గాండివ మెత్తినాడా! విజయ సూచనలన్నియు పాండవుల వైపుననే ఉన్నవా. భీష్మ ద్రోణ కర్ణ అశ్వత్థామాది మహావీరుల బల ధైర్యములు వ్యర్థము కావలసిన దేనా- నా తనయులు దుర్యోధనాదులు నూర్వురును పాండవుల చేతులలో మడియ వలసినదేనా! ఇది యంతయు విధి వైపరీత్యముగాక మరేమి- వినలేను సంజయా! వినలేను" అని తన మొగమును చేతులలో కప్పుకొని వణకి పోవుచున్నాడు- ప్రక్కనే ఉన్న భార్య గాంధారి భర్తను పొదివి పట్టుకొని మహారాజా! ధైర్యముగ నుండి పుత్రుల నాశీర్వదించి ఆహవమునకు పంపవలసిన సమయమున మీకీ నిర్వేదమేల- పరిస్థితులు విషమించు నంతవరకు చూచీ చూడ నట్లు ఊరకున్నాము- ఈనాడు విచారించిన లాభమేమి? సాహసించి ఆనాడే శకుని ప్రేరేపణతో జరిగిన కపట ద్యూతము

నాపిన యెడల ఇంత ప్రళయము రాకపోవును గదా- పాండవులును మన బిడ్డలే. శ్రీకృష్ణుని పరమాత్మగా నమ్మి ధర్మ జాదు లెట్లుండిరో అట్లే మనమును ఉందము అను సరికి ధృతరాష్ట్రు డొకింత సుస్థిరుడై ఆసనమున కూర్చుండుట జూచి సంజయుడు, ఆ రాజవర్యుని హస్తములు తన చేతుల లోనికి తీసికొని మహారాజా! మీరు ఆవేశము పడవలసిన సమయము గాదిది- జరుగుచున్నది ప్రపంచ మీ వరకెన్నడును కని విని యెఱుగని మహా సంగ్రామము- భరత వర్ష రాజ వంశము లెల్ల తమ సైన్య బలములతో నచటనే యున్నవి. మీరు వినగోరిన విషయము లే నేను వ్యాసభగవానుని కృప వలన దర్శించి మీకు నుడువుచున్నాను- ఇంతకును శ్రీకృష్ణుడు నుడివిన ప్రబోధము మాత్ర మెట్టిది- "అర్జునా! నీధర్మము నీవు ఫలాపేక్ష లేక నిర్వర్తింపుము. ఎవరి కర్మఫలము వారిదే. సర్వాంతర్యామియైన పరమాత్మనే ప్రతినిముసము శరణు పొంది నీకర్తవ్యము నిర్వహింపుము. ధర్మము తథ్యముగ జయించును." అనికదా- ఇవి యెవరికైనను సమముగ వర్తించునవియే. యుద్ధఫల మెట్లున్నను నిర్మలమతితో గ్రహింపవలసినదే యెల్లరకును.

అయినను మఱియొకమాట వినుము మహారాజా- ఆశ్రీకృష్ణుని పలుకు లెటున్నవని నుడువగలను- ఆదిశేషునకైన వర్ణింప అశక్యము- అవిసర్వము ఒకమృదుమధుర గీతమే. ఆపలుకులు నందనమందార మధువులు. జనులేకాదు మునులకైనను

సర్వసమ్మోహనములనియే చెప్పవలయును- తనసందేశము నామహనీయు డేమని ముగించినాడో నుడివితినిగదా- తాను చెప్పిన విషయము లన్నియు సహృదయముతో వినినవారు, పిపిపించినవారు ఆ మహాత్మున కత్యంతప్రియులట. ఆహా, నీవు నిమిత్తముగ నేనును ధన్యుడ నైతిని మహారాజా! ఇంతకన్నను కావలసిన దేమున్నది- ఆ శ్రీకృష్ణసందేశములో ఏమున్నదో కాని, వానిని వినిన అర్జునునిలో ఒక దివ్య తేజము ప్రాదుర్భవ మందినది- అంతటితో ఆగినదా ఆ తేజము అర్జునుడు ధరించిన ఆయుధముల నన్నిటిని ప్రకాశింప జేసినది- ఆ దివ్యదృశ్యము చూచి నా కిట్లనిపించినది మహారాజా! ఆ తేజ మజేయము. అది విజయప్రదము- ఇంకను చెప్పవలయునన్న చో ఆ కృష్ణార్జునుల సంభాషణము సర్వము నాతలపునకు మరల మరల వచ్చుచునే యున్నది- దానిలో ఒకభాగముమాట నటుంచుడు, రెండు పంక్తులైనను సంస్మరింపగలుగుచో ఎవనికైనను జీవన భాగ్యమే. బాల్యమునుండియు నీతిపరులైన పాండవులకే గాదు, ఎచ్చటెచట శ్రీకృష్ణసందేశ మధురగీతారవ ముండునో, ఆ మహాయోగీశ్వరుడగు శ్రీకృష్ణుడును, ధనుర్ధరుడగు అర్జునుడు ఎచ్చటకలరో అచ్చటనే సర్వసంపదలు, విజయము, ఐశ్వర్యము, నీతి కలవనుట నిశ్చయము, నిశ్చయము.

నా నమస్కారము లందుకొనుము. రాజా! మరల రేపటి యుద్ధక్రమము తిలకింపవలయును గదా అని సంజయుడు ధృతరాష్ట్రమహీపతి పదము లంటెను-

ధృతరాష్ట్రుని మొగము విప్పారినది. వెనుకటిదైన్యము పోయినది. ఆనాటి కొలువుకూటమున శ్రీకృష్ణుని విశ్వరూప దర్శన భాగ్యము తన కబ్బినది. ఈనాడు అందలి మహత్త్వము సర్వము మనసున కవగతమయినది- ఆహా! యనుకొని చేతులు జోడించి శ్రీకృష్ణుని తన యంతరంగమున మరల మరల తలచుకొని శిరము వాల్చినాడు- ధర్మము ముందు ఎల్లరును తల వంచవలసినదే. గత్యంతరము లేదు-

అర్జునుడు నిమిత్తమాత్రముగ మానవజాతికేగాదు త్రిలోకములకును శ్రీకృష్ణు డొనరించిన ధర్మప్రబోధ మిది- మాటవినక మారాము చేయు చంటిబిడ్డను బుజ్జగించు మాతృదేవి మధురగీతమువలె శ్రీకృష్ణుని ప్రవచనము సాగినది- వేదోపనిషత్సార మధువులు జాలువార్చిన ఉపదేశామృత ప్రవాహమది- భగవద్గీతయనం పవిత్రనామమున ప్రపంచ మంతటను వ్యాప్తిగాంచినది- ఆ గీతాసారము నాస్వాదించిన ఉత్సాహములో ధనుస్సు సంధించి, స్వధర్మకర్తవ్యనిర్వహణ మునకు కాలూని నిలచిన అర్జునునకు ఎదురుపడి నిలచినవారు లేరు- భగవద్గీత పాండవమధ్యముడగు ఆవిజయునకు విజయము. మానవాభ్యుదయమునకు విజయము. సర్వజగద్ధర్మమునకు విజయము-

విజయగీత సంపూర్ణము

ఓమ్ తత్ సత్



గ్రంథకర్త : శ్రీ కొండేపూడి సుబ్బారావు
రి॥ డిఫెన్సు అకౌంట్సు ఆఫీసరు.

జననము : నలకార్తికము, నవంబరు 1916 చేబ్రోలు. ప.గో జిల్లా

జననీజనకులు. కీ॥శే॥ రత్నమ్మ. సర్రాజు

విద్యాభ్యాసము. చేబ్రోలు కైకరము, ఏలూరు, కాకినాడ

బిరుదములు. కవిభూషణ, మధురకవి, కవిశేఖర.

రచనలు :- అమ్మకమునకు సిద్ధముగా నున్నవి.

| | | | |
|---|---|---|---|
| శ్రీ దేవీభాగవతము | ద్విపద | వెల. రు. | 40-00 |
| శ్రీ హనుమత్‌స్తోత్రము | శతకము | " | 4-00 |
| శ్రీ ఈశ్వరార్పణము | శతకము | " | 8-00 |
| శ్రీ ముకుందమాల | ఆంధ్రానువాదము పద్యతాత్పర్యసహితము | " | 6-00 |
| శ్రీ శివానందలహరి | " | " | 10-00 |
| శ్రీ పరమేశ్వరి దేవీభాగవత సంగ్రహము వచనము | | " | 20-00 |
| శ్రీ దేవీపంచాశిక | ప్రార్థన పద్యములు | " | 3-00 |
| ప్రార్థనదండకములు 12 | | " | 5-00 |
| శ్రీ సరస్వతీదేవి మాహాత్మ్యము వచనము | | " | 3-00 |
| శ్రీ ప్రసన్నభారతి, I భాగము సరస్వతీదేవిపై ఈనాటి ప్రసిద్ధ కవితాసంకలనము | | " | 10-00 |
| శ్రీ ప్రసన్నభారతి II భాగము | | " | 20-00 |

శ్రీ విజయగీత భగవద్గీత నవల వచనము " 20-00

శ్రీ సౌందర్యలహరి (ఆంధ్రానువాదము) " 15-00

శ్రీ గీతామృతము 18 అధ్యాయములు మూలము

పద్య తాత్పర్యసహితము " 30-00

## పునర్ముద్రణము కావలసినవి

పద్యకావ్యములు: కావ్యాంజలి వేంకటేశ్వర కర్ణామృతము

వచనము. గీతాసంగ్రహము, భక్తమందారము

శతకములు, సర్వేశ్వర, సూర్యనారాయణ శతకములు

పురాణములు, ద్విపద } శ్రీమద్రామాయణము, శ్రీమద్భాగవతము, శ్రీ ఉత్తర రామాయణము, శ్రీ మహాభారత కథ

ముద్రణ కావలసిన వ్రాతప్రతులు చాల ఉన్నవి.

ప్రతులకు గ్రంథకర్తకు వ్రాయవలెను.

47-10-5 ద్వారకానగరు. విశాఖపట్టణము. 530 016